ఆంధ్రప్రచారిణీగ్రంథమాల. ౪౮.

# యోగేశ్వరి

(రెండవసంపుటము.)

(శ్రీదామోదర ముఖోపాధ్యాయ రచిత వంగభాషాగ్రంథమునుండి)

శ్రీ పులుగుర్త లక్ష్మీనరసమాంబగారిచే

ఆంధ్రీకరింపఁబడినది.







మొదటి కూర్పు.

ప్రకాశకులు.

శ్రీ వేంకటపార్వతీశ్వరకవులు.

ఆంధ్రప్రచారిణీ గ్రంథనిలయము,

పిఠాపురము.

1927

 [వెల రు

# ప్రధానపోషకులు. III

మ. రా. శ్రీ పోతాప్రగడ బ్రహ్మానందరావుపంతులుగారు, ప్రొప్రయిటరు, సుజనరంజనీ ముద్రాక్షరశాల, కాకినాడ.

# రాజపోషకులు.

మ. రా. శ్రీ శ్రీమంతు శ్రీరాజా య్యార్లగడ్డ అంకినీడు ప్రసాద్ బహద్దరు బి. ఏ. గారు, చల్లపల్లిరాజాగారు, చల్లపల్లి.

,, శ్రీరాజా ఇనుగంటి వేంకట సూర్యప్రకాశరావుగారు.

,, శ్రీ కలిదిండి వేంకటరామరాజుగారు, భీమవరము.

,, శ్రీ కొప్పూరి-సూర్యనారాయణ రెడ్డిగారు, జమీందారు, కాకినాడ.

,, శ్రీ కర్రి చినవేంకటరెడ్డిగారు, మర్చంటు, కాకినాడ.

,, శ్రీ ముత్యాల సుబ్రహ్మణ్యముగారు, రంగూన్.

,, శ్రీ వనచర్ల సత్తెయ్యగారు, రంగూన్.

,, శ్రీ బత్తుల బసవయ్యగారు, రాజమండ్రి.

,, శ్రీ ఆకారపు వెంకన్నగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ ఆకారపు చెన్నయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు.

,, శ్రీ వెలగల గోవిందరాజుగారి కుమారులు వేంకట [illegible]కు, ఇతిహాసతరంగిణీగ్రంథమాలా సంపాదకులు, అరవిల్లి.

# రాజపోషకులు.

మ. రా. రా. శ్రీ శ్రీ రాజా వత్సవాయి వేంకట సుభద్రయ్యమ్మ జగపతి బహద్దరు జమీందారిణీవారు, తుని.

# పోషకులు.

మ. రా. రా. శ్రీ దివాన్ బహద్దరు కొమ్మిరెడ్డి సూర్యనారాయణమూర్తి నాయఁడుగారు, కాకినాడ.

,, శ్రీ వాడ్రేవు వేంకటరత్నము పంతులుగారు, పిఠాపురము

,, శ్రీ ద్వారంపూడి రామారెడ్డిగారు, అనపర్తి.

,, శ్రీ [illegible]ంరాజు వేంకటరమణారావుపంతులుగారు, వైలుఖాసాదారు, తణుకు.

,, శ్రీ బెండాసూర్యనారాయణపంతులుగారు బి.ఎ. యల్.టి. తణుకు.

,, శ్రీ పండ్రాజు వీరరాజుగారు, కాకినాడ.

,, శ్రీ కొప్పూరి వేంకట రెడ్డిగారు, పిట్టలవేమవరము.

,, శ్రీ కర్రి పల్లారెడ్డిగారు, మారుటేరు.

,, శ్రీ తేతల గంగిరెడ్డిసోదరులు, పెనుగొండ.

## పోషకులు.

మ. రా. శ్రీ దివాన్ బహద్దరు పి. పరాంకుశము నాయ్డుగారు,
రిటైర్డుస్పెషల్ పోలీసుకమీషనరువారు: చెన్నపురి.
,, శ్రీ అర్జి వెంటయ్యగారు, నరసాపురము.
,, శ్రీ టి. యల్. నరసింహారావుగారు, మాతుటేరు.
,, శ్రీ చిర్ల అమ్మిరెడ్డిగారు, రంగూన్.
,, శ్రీ పులగం వేంకన్నగారు, మారుటేరు.

---

## సహాయులు.

మ. రా. శ్రీ ఉదయరాజు వేంకటరంగారావుపంతులుగారు, దేశ్ముఖ్
సర్ దేశపాండ్యా, మటేవాడ, ఒరంగల్లు: (దక్కన్.)
,, శ్రీ నేరెళ్ల నరసింహరాములుగారు, కలపవర్తకులు,
ఒరంగల్లు, (దక్కన్.)
,, శ్రీ గుండాపుల్లయ్యగారు, వర్తకులు, ఒరంగల్లు (దక్కన్)
,, శ్రీ ద్వారంపూడి వేంకటరెడ్డిగారు, అనపర్తి.
,, శ్రీ పాళ్యపువేంకటాచలపండితులుగారు, ప్రొప్రయిటరు,
శ్రీ సీతారాఘవశైద్యశాల, మైసూరు.
,, శ్రీ పింజల సుబ్రహ్మణ్యంచెట్టిగారు, వర్తకులు, నె 91
అన్నపిళ్లవీథి, జి. టి., మదరాసు.
శ్రీ గంధి హనుమంతరావుగారి కుమారులు రామా
రావుగారు, వర్తకులు, అనకాపల్లి.

VI

# కృతిసమర్పణము.



పరమయోగేశ్వరీజ్ఞానభాస్వత్కమైన జీవనముచే వంశపావనముగావించి, స్త్రీలోకమున కతులితాదర్శమగు కీర్తికాయముచే శోభనాలంకారమైన సౌభాగ్యదేవత--నా మాతృదేవత

## చింతలపూడి అగ్గమ్మగారికి

ఈయోగేశ్వరిని సమధిక భక్తిపూర్వకముగా సమర్పించుచున్నాను.

ఇట్లు

పులుగుర్త లక్ష్మీనరసమాంబ.

# రాగేశ్వరి

## ...నవసుఖండము—హోత్రి.

### నాలుగవప్రకరణము.

మహాప్రళయము.

ఆకాశమంతయు మబ్బుగ్రమ్మియుండెను. నలుమూలలను నొక్కొక్కమాఱు వానజల్లు పడుచుండెను; మరలమరల నాగిపోవుచుండెను. పల్లెటూళ్లమార్గమధ్యములు కర్దమాకీర్ణములై యుండెను. నదులును దటాకములును జలాకీర్ణములై యుండెను. వర్షాకాలలక్షణములగపడుచుండెను.

రామనగర మతిసామాన్యగ్రా... వారమునకు రెండుమా
ఱులాయూరిలోఁ జిన్నసంతజరుగు... ప్పులమున్న చిన్న
యూళ్లనుండి యీసంతకు నా... ...మ్ము
కొనుచుందురు. జను...

నేఁడు సంతరోజు. కాని, సంతజరుగువేళ యింకను గాలేదు. పదిగంటలవేళకుఁ బ్రారంభించి పదునొకండు గంటలు గునటికి సంత పూర్తిగా సాగుచుండును. ఇప్పు డెనిమిదిగంటలప్రొద్దెక్కినది. ఇప్పటి కా ప్రదేశమునందు మనుష్యు లెవ్వరును జేరలేదు; కాని, యక్కడి తాటియాకుపాకలలో నొకపాకదగ్గఱఁ గురూపిమనుష్యుఁ డొకఁడు కూరుచుండియుండెను; ఆతఁ డక్కడ నూరక కూరుచుండలేదు. ఆపాకస్తంభమును బట్టుకొని కునుకుపాట్లు పడుచుండెను. ఆతఁ డొకపట్టును గట్టుకొనియుండెనుగాని, యది లేనిదానితో సమానము. ఆతనిమైమీఁదఁ గూడ నొకవస్త్రము గలదు. అది చినిఁగి చినిఁగి యలుకుగుడ్డవలె నక్కఱకురానంతశుభ్రముగా నున్నది. కునుకుచుఁ గునుకుచు నాతఁ డొక్కొక్కమాఱు క్రిందికిఁ బడఁబోవుచు, మరల వెంటనే జాగరూకుఁడై తొప్పుటియట్లు గూరుచుండుచునుండెను. ఈఁగలును దోమలును నాతనిపైఁ జక్కఁగా నధికారము చేయుచుండెను. ఈఁగలు గుంపుగుంపుగా నాతనిజీర్ణమలినవస్త్రము నాశ్రయించుకొనియుండెను; మఱియు నాతనితలపైకిఁ గూడ నది తఱచుగా నెక్కి తొక్కుచు గంతులు వేయుచుండెను. తండోపతండములుగా వచ్చి దోమ లాతనికర్ణరంధ్రములలో మహాగాన మొనరించుచు నాతనికృశదేహముతోఁ దమశరీరమును సమ్మేళనము నొనరించుచుండెను. ఆతనికి వ్రితభంగముగాఁ జొచ్చెను. అప్పు డాతఁడు [illegible] క సేక వ్యాఘాతములు గల్గుచున్నట్లు గ్రహించి చివర [illegible] లు రెండును నిర్మూలములు చే [illegible] నే యాతఁ డాయీఁగల [illegible] కాని,

అందులో నొకఁ డాతనిని దొందరగా "బాబూ, మహాశయా!" అని పిలువఁ జొచ్చెను.

మలినవేషియుఁ, గృశకాయుఁడును, లంబోదరుఁడును, కోటర నేత్రుఁడు నైనయాపురుషుఁడు గాఢనిద్రలో నుండెను. ఈసంబోధనవాక్యము లాతనికర్ణరంధ్రములలోఁ బ్రవేశించెనుగాని, పిలిచినవారెవ్వరో చూచి మాటాడవలయునని మాత్ర మాతనికి మొట్టమొదటఁ దోఁచ లేదు. నిజముగా నాతఁడు నిరవ్యగ్రుఁడై యుండినయే యానిద్రాభంగము గావించినయాగంతుకుని లోలోనఁ దిట్టుకొనఁ జొచ్చెను.

ఆయాగంతుకు లిరువురును మనకుఁ బరిచితులైనహరకుమార బాబును, జరీఫ్ కోచమానును. వారిలో నాహ్వానముచేసినవాఁడు హర కుమారుఁడు. జరీఫ్ వచ్చియు నాతనిప్రక్కనించుక దూరముగా నిల్వఁబడియుండెను. హరకుమారుఁడు మరల "బాబూ! మహాశయా! నిద్ర మేలుకొనరా తేరా? చాలయగత్యమైనసంగతియొకటి మిమ్ము నడుగవలయునని యపేక్షించి యిక్కడకు వచ్చినాను; అందుచే బాబుగారికు నిద్రాభంగము చేయవలసివచ్చినది" అనియెను.

ఈమనుష్యుఁడు నిద్రావస్థలో నుండియే, యెవ్వరో యపరిచితులు దన్నుఁ బిలుచుచున్నారని తెలిసికొనియెను. కాని, తనలోఁ "జర కాలముక్రిందట నేనును బాబునే; చిరకాలము బాబుగానే యుంటిని; కాని, యది చిరకాలమునాఁటిమాట. ఇప్పుడు నన్నెవ్వరో "బాబూ" అనిపిలిచి మరియాదచేయుచున్నారు. ఇంతమరియాదమనుష్యుఁడనైన నే నింతయాకస్మికముగా సమాధానమునిచ్చుట యనుచితమైనచిన్న తనపుఁబని" యని గ్రహించుకొనుటచే నిరవ్యగ్రుఁడై యూరకుండెను.

హర—కొంచెముగంజాయి త్రాగవలయునని యున్నది. త్రాగుటకును దినుటకును గావలసినరకరకములపదార్థము లన్నియు నాయొ

ద్దనే యున్నవి. కాని, యీసామానులు పెట్టుకొని కూరుచుండి త్రా గుటకును దినుటకును దగినయనుకూలస్థలమును, మంచిస్నేహితుఁడును గావలయును. అట్టిస్నేహితుఁ డీయూర నెవ్వఁడైన దొరకునేమో యని చూచితిని. ఒకపెద్దమనుష్యునుగాఁగా నీయూరిలో నట్టివారెవ్వరు లేదుగాని ఒక్కపెద్దమనుష్యుఁడుమాత్ర మున్నాఁడని చెప్పినాఁడు. ఆయనమూలముననే యీయూరిసౌభాగ్యము నిల్వబడియున్నదని యనుకొనినాను. ఆయనపేరు చండీబాబుమహాశయుఁడఁట! ఆమహాశయుని జాడ కనుఁగొనుటకే యీబాబునాశ్రయించితిని.

హరికుమారబాబు స్వయముగా మాటాడుకొనుచున్న యీమాటలన్నియుఁ ద్రాగుఁబోతైనయాచండిమహాశయుని కర్ణముల కొక్కింతయూల్పె కల్గించెను. నల్లమందు, గంజాయిమొదలగుశబ్దములు వినఁగానే నిద్దుర మత్తులోనున్నయాతనిశరీర మించుక కదలఁజొచ్చెను. సారాయి యను పలు కాలకింపఁగానే, నిద్రాముద్రితములైనయాతనికన్ను లాకస్మికముగా విచ్చిపోయి, యుత్సాహముతో, దేవతుల్యుఁడైనయాగంతుకమహాత్మునివంకఁ జూడఁజొచ్చెను. “అందఱును ద్రాగుఁబోతునని యెఱింగి యీపేరుతోనే పిలుచుచున్నారు. నేఁడీయన “చండీబాబు” నని యే విశ్వసించి, గౌరవముతో నన్నుఁ బిలుచుచున్నాఁడు.” అని సంతోషించెను. తరువాత నతఁడు ఒడలువిఱుచుకొనుచు లేచి కూరుచుండి “యాగంతుకుఁడు నిజముగ గ్రహించినపెద్దమనుష్యుఁడే” యని స్థిరపఱుచుకొని, తప్పుమాటలతో “మహాశయా! కూర్చొండి. పెద్దమనుష్యులు? మీనివాసమెక్కడ?” అనియెను.

హరి—నివాసము చాలదూరముగా నున్నది. ఒకపనిమీఁద దేశమునకు వచ్చితిని. ఆవృత్తాంతమంతయు బాబునకుఁ గ్రమముగాఁ జెప్పెదను. బాబుగారెట్టివారో నాకుఁ [illegible] బాబుగారిక నిపా

పదార్థములు చాలయిష్టములు. వానియందిష్టములేనివారు స్వదేశస్థు లెవ్వరు తేరారు. వానియందు నాకును జాలనిష్టమే. కొంచెముకొంచెముగ నం జాయియుఁ గొంచెముకొంచెము తెంబౌలు నములుచును పుచ్చుకొను చుందును.

చండి—(సముత్సాహముతో) నేనును—నేనును.

“ ఈయన నాపాలిటి దేవుఁడు—నేఁడు నాకు సుదినము” అని చండి తనలో ననుకొని మరల “ దయచేయుఁడు. దయచేయుఁడు” అనియెను. చండి కూరుచుండుమని చెప్పెనుగాని, హరకుమార బాబు కూరుచుండుటకుఁ దగినస్థలమేదీ? అయినను హరకుమారబాబు నిస్సంకోచముగా నచ్చట భూమిమీఁదనే కూరుచుండెను.

హర—కూరుచుంటిని. కాని, యిది సంతపాక. ఇక్కడకుఁ జాలమంది గుంపుగూడుదురు. కొంచె మావలికిఁ బోవుట మంచిది గాదా బాబూ!

చండి మెల్లఁగా లేచి “ అదియే మంచిది. నాతోడ రండు.” అనియెను.

చొట్టకాలితో మెల్లఁగా నడచుచుఁ జండి తనవక్రదేహమును మోసికొని బయలుదేఱెను. హరకుమారుఁడును, జరిఘ్నును నాతని వెం బడించిరి. క్రమముగాఁ జండి, బహుదూరము వారిని దీసికొని యొక తోఁటలోనున్న మఱ్ఱిచెట్టుక్రిందికిఁ బోయి “ ఇక్కడఁ జాల బాగుం డును. ఇక్కడ నేమియు గోలయుండదు.” అనియెను.

హర—చాలబాగున్నది. మంచిపని చేసినావు. ఈమాత్ర ముచోటు లేకున్నఁ గష్టము.

హరకుమారుఁ డక్కడఁ గూరుచుండి జరిఘ్నునొద్ద నున్నసంచి నందుకొని, దానినుండి నల్లమందు, మద్దతు, గంజాయి, తంబా

హుక్కా మొదలగు ననేకవిధములగు వస్తువులను మఱియు, బర్ఫీ, అంతరసా, రసగుల్లా, సందేశా, కోవా, మొదలగు మిఠాయిలపొట్లములను బైకిఁ దీసెను. పరిస్థితోపయోగములగు మఱికొన్ని సామానులుగూడ నాతఁడు బయటఁబెట్టెను. ఈసామగ్రిని జూచి, చండీమహాత్ముఁడు ముగ్ధుఁడై హరకుమారునిఁ జూచి నిశ్చయముగా నీతఁడొక గొప్పవాఁడు." అని స్థిరపఱచుకొనియెను.

చండి—బాబూ! మీరీగ్రామమున కెందుకు వచ్చితిరి?

హర—నేనీగ్రామముకొఱకు రాలేదు—ఈగ్రామముమీఁదుగా రామనగరము వెళ్లుటకు వచ్చితిని. మార్గములోఁ దమవంటిమహాత్ములపరిచయము లభించినది. ఇది నాయదృష్టము. బాబూ! మీ కిష్టమైన దేదియో దానిని దీసికొనుఁడు.

చండి, హరకుమారుఁ డుంచినయాపదార్థములయొద్దకు జరిగి, వానిలోని వస్తుపదార్థములపైఁ జేయినైచి చూచుచు, "అన్నియు మంచిపదార్థములే. అన్నియు సంపూర్ణముగా నున్నవి. ఆఁ. రాము నగరమునకా? రామనగర మిక్కడకు రమారమి నాలుగు క్రోసు లున్నది." అనియెను.

హర—అవును. నాలుగుక్రోసులదూర మున్నదఁట. ఏమిచేయము? ఆవశ్యకమునుబట్టి పోవలసియున్నది. అక్కడ నాకుఁ బని యున్నది. వెళ్ళితీఱవలయును. బాబూ! పదార్థము లన్నియు నిూకు బాగుగ నున్నవనుకొనియెదను. మీరు నాదైవమెఱిఁగినవారు. వీనిని నా దైవముచేయుఁడు.

చండీమహానుభావుఁడు ముందుగా నల్లమందును నోట వేసికొని "అన్నియు బాగుగా నున్నవి. క్రమముగా నొక్కొక్కటియే చూడఁగల్గుదు. రామనగరమున మీ కేమిపని యున్నదో నేను వినవచ్చు

నా? అక్కడనే మా పినతల్లిగారి యిల్లున్నది. మఱియు నక్కడ నాకుఁ బరిచితులుగూడ ననేకులున్నారు. నన్ను మీభృత్యునిగా నంగీకరించి యీపుట్టిల్లువలన నేమైనఁ బ్రయోజన మున్నచో మీరాజ్ఞాపింపవచ్చును. అక్కడ మీకెవ్వరితోఁ బనియున్నది?" అనియెను.

హార — గంగామణి యనుపేరుగల యొకబ్రాహ్మణవితంతువునొద్ద నాకొక చిన్నపని యున్నది. అందుకొఱకు రామనగరము పోవుచున్నాను. మీరీప్రాంతమున సుప్రసిద్ధులు. మీదయ యున్నచో నన్నియు జరగిపోఁగలవు.

ఈసమయమునం దించుక వర్షపుఁజినుకులు పడియెను. దానితోఁ గొంతగాలిగూడ చెలరేఁగెను. చండీమహానుభావుఁ డప్పుడు చినుకులతోఁ దడిసియున్న తనచింకిరిమెతకగుడ్డను గట్టిగాఁ గప్పుకొనఁజొచ్చెను. హారకుమారబా బాతనివంకఁ జూచుచు "బాబు! గాలి విస్తారముగా నున్నది. తగినవస్త్రలను ధరింపుఁడు." అనియెను.

హారకుమారబాబు మరలఁ దనయినుపపేటికను దెఱచి, ఒక మంచిదొక్కాయిని, శుభ్రమైన పరిధానమును దీసి చండిచేతి కందించుచు "ధరింపుఁడు! తప్పేమున్నది? నాయొద్ద నున్న మీరు పుచ్చుకొనవచ్చును. మీయొద్దనున్న నేనును బుచ్చుకొనవచ్చును. అట్లు కానిచో నింక బంధుత్వ మనఁగా నేమి?" అని పలికెను.

చండీ మరల మాటాడకయే దాని నందుకొని ధరించెను. తరువాత నాతఁడు "గంగామణిదేవియా? అది మాపినతల్లిపేరు. ఆమెతో నేమిపని యున్నది? ఆమె స్వర్గస్థురాలైనదే?" అనియెను.

హార — ఆమె మీపినతల్లిగారా? ఏమి యీయద్భుతవార్త! అయిన మీదర్శనలాభముచే నాకనేకోపకారములు కలుగఁగల వని యూహింపవచ్చును. ఆమె స్వర్గస్థురాలయ్యెనా! కానిండు. మహాశయు

లుండనేయున్నారు. మీవల్లనే నాకోరిక నెఱవేఱఁగలదు.

చండి, గంజాయిని బీల్చుచుఁ బీల్చుచు "నావలన మీకేమి కావలయునో సెలవిండు." అనియెను.

హర—ఆమెయొద్దఁ గొన్ని కాగితము లున్నవని వినియున్నాను. వానివలన నొకపెద్దమనుష్యునకు విశేషోపకారము కాఁగ అందుచే నాకాగితములను జూడవలయునను నభిప్రాయముతో నీ కి వచ్చితిని.

చండి యించుకసేపాలోచించి, "దుర్లభము—అట్టి కాగితములున్నను, అవి యీపాటికిఁ బాడైపోయియే యుండును. ఆయిల్లు నేను విక్రయించితిని. ఆయిల్లుకొన్నవారుగూడ నాకాగితములను జాగ్రత్తచేసి యుండలేదు. ఇఁక నవి దొరకునా?

హర—అయినను మన మచ్చటి కొకసారి వెళ్లవలెను. ఏమైన దొరకినచోఁ జాల నుపకార మగును. మీరుండఁగా నాకు లోపమేమి? మీరుకూడ నాతో రావలయును. ఇక్కడ నేదియైన నెక్కబండి దొరకునా? ఒకబండి కుదుర్చుకొని మనము వెళ్లుదము.

ఇట్టిమహదాశ్రయమును విడుచుకొనుటకుఁ జండి కెంతమాత్రము నిష్టములేదు. అతఁడు హరకుమారునిఁజూచి "చిత్తము; అట్లేచేయుదము. మీపనిచేయుటకు మీతోవచ్చుటకు నాకింకను సందేహమా?" అనియెను.

హరకుమారుఁడు బండికొఱకు జవానునుబంపి, చండివంకఁజూచి "మహాశయా! కొంచెమేమైనను బుచ్చుకొనుఁడు. ఇంతలో బండి రాఁగలదు" అనెను.

చండి—చిత్తమట్లే పుచ్చుకొనియెదను. కాని, యిప్పుడెందులకు?

హర—సరిసరి, అదియేమిమాట? తినకున్న నెట్లు? నాకుఁ ద

ఒటుగాఁ దినుచుండుటయే యలవాటు. కొంచెముపుచ్చుకొనుఁడు.

చండి ముందుగా 'మానుము' దిని, తరువాత రసగుల్లా, అంత రసా మొదలగుమధురాహారములను భక్షింపఁజొచ్చెను. అంతలోనె జరిఫ్ బండితీసికొనివచ్చెను. హారకుమారుఁడు సాదరముగాఁ జండీమ హాశయుని బండిలో నెక్కించుకొనియెను. చండీమహాశయుఁడు హార కుమారునివంటిస్నేహితుని విడువజాలక యత్యంతసంతోషముతో బండి నెక్కెను. జరిఫ్ బండివెనుకనే నడచుచుండెను.

---

## అయిదవప్రకరణము.



### పరిత్యక్తభవనము.

మధ్యాహ్నము రెండుజాము లగునప్పటికి, హారకుమారబాబును, చండీచరణుఁడును, జరిఫ్ కోచిమానును రామనగరమును సమీపించిరి. పరలోకగతురాలైన గంగామణి పూర్వ మేయింటఁ గాపురముండెడిదో, ఆయింటిసమీపమునందు చిన్నయిల్లొకటియుండెను. ఆయిల్లు భవసుందరి యను పేరుగల యొకశూద్రవితంతువుది. ఇరుగుపొరుగునం దున్న సహవాసముచే నీభవసుందరి, గంగామణిని 'అక్కా' యని పిలుచుచుండెడిది. ఆసంబంధమును బురస్కరించు కొనియే చండీచరణుఁడుగూడ భవసుందరిని 'పిన్ని' యని పిలుచుచుండును. నేఁడు చండీచరణుఁడు హారకుమారునిజరిఫ్‌ను వెంటఁబెట్టుకొని యీపిన్నిగారియింటికే వచ్చియున్నాఁడు.

హారకుమారబాబుచేతిలోని యసుయపేటిక చండీచరణుని యీ

కారమును మార్చివేసినది; దానికృపవలన నాతనిదేహమునందొక మంచివోక్కాయియు మంచిహోవతియు ధరింపఁబడెను; ఈసంగతిని బాలకమహాశయు లింతకుఁ బూర్వమునందే చూచియున్నారు. మరల దారిలో వచ్చునప్పు డాబ్రిహ్మాండోదరి—ఆయుష్యపేటిక, చండీచర ణునినిమిత్తము, మఱియొక మంచియుత్తరీయమును బాదరక్షలునుగూడఁ బ్రసాదించినది. ఈపెద్దమనుష్యునివేషముతోనున్న చండీచరణు నిప్పు డెవ్వరు చూచినను మునుపటి చండి యని యనుకొనఁజాలరు; కాని నేఁ డాతనిదురదృష్టముచే నాతనివేష మాతనికి గౌరవాభివృద్ధిని సంపాదింపలేకపోయినది. భవసుందరియింటగుమ్మమునొద్దకు వచ్చి, "పిన్నీ, పిన్నీ!" యని కేకలువేయఁగా భవసుందరి తలుపుతీసెను; కాని చండిని జూడఁగానే యామె మోము ముకుళించుకొని విరక్తిభావమును వెల్లడించెను. అత్రాగుఁబోతు మొదటఁ దనసొత్తంతయు నపవ్యయముచేసికొని జీవనము వెళ్లఁబుచ్చుకొనునిమిత్తము చివరకు దొంగతనములు చేయఁబొచ్చెను: ఆత్మీయులును బరిచితులును వానిని జేరఁదీసి పోషించుచుండఁగా, దుష్టవృత్తులకలవాటుపడిన యానిర్భాగ్యుఁ డుపకారినిగూడ ననేకవిధముల మోసపుచ్చుచుఁ బీడించుచు రాఁబోడంగెను. ఆతరువాత వాఁ డాశ్రియములేక, అన్నములేక, వస్త్రములేక సకలపరిదుర్భిక్షై వీధులవెంబడి భిక్షాటనము చేయఁజొచ్చెను. ఈవిధముగా నున్నయక్కకొడుకు నిప్పు డిష్టాలాపములచే సంభావించుటకు భవసుందరికి మనసుకొలుప దాయెను. అయినను నేఁ డాతఁడు పెద్దమనుష్యునివేషము వేసికొనుటయు, నాతనితో నెవ్వరో గొప్పవా రుండుటయుఁ జూచి భవసుందరి యాతని నేమియు నిష్ఠురవచనము లాడ నేరకపోయెను. చండి, పరిచితులవలనను, అపరిచితులవలనను, నందఱివలననుగూడ నింతకంటె నత్యధికమైన యనాదరకార్యములను బొంది స

హించుచు వచ్చియున్నాఁడు. నేఁడు నిజముగా నాతనికిఁ దనపిన్నియ నాదరణమువలన నించుకంతయు నిరుత్సాహముగాని, యాశాభంగము గాని కలుగనే లేదు. ఆతఁడు పిన్నిని సమీపించి "పిన్ని, పిన్ని! నేఁడు మే మందఱమును మీయింటనే యుందుము, ఇక్కడనే శాక పాకములు గావించుకొందుము. నాతోఁగూడ నున్న యీ బాబుగారి ని జూడుము. ఈయన చాల గొప్పవారు. మహనీయులు." అని చెప్పెను.

భవ.—ఆ, అంతయుఁ జూచితిని. మాయింటిలోఁ జోటెక్క డిది? ఎవ్వరో పెద్దమనుష్యులను దీసికొనివచ్చి వారి నిక్కడఁ గష్టపె ట్టెదవా యేమి? మఱియొకచోట బస వెదకికొనుము.

ఇట్లు చెప్పుచు భవసుందరి వెనుదిరిగి లోనికిఁ బోఁజొచ్చెను. అప్పుడు హరకుమారబాబు ముందునకు వచ్చి "మర్యాదస్థు లెట్లును మర్యాదస్థులే" అనుచు తనయుపయపేటికనుండి రెండురూప్యములను పైకిఁదీసి భవసుందరిముందఱ నుంచి మరల "అమ్మా! ఇట్టి మర్యా దగల యాశ్రయము విడిచి మే మింకొకచోటికిఁ బోఁజాలము. మీ రీ రెండురూప్యములను దీసికొనుఁడు; ముగ్గురుమనుష్యులభోజనమున కేమే మి కావలయునో సమకూర్చిపెట్టుఁడు. మే మిప్పుడు కొంచెముసేపటి లో మరల వచ్చెదము. ఇంకను గష్టమైన విశేషముగా నైనచో దా నికొఱకు విచారింపవలదు, నేను మరల వచ్చి, నైనకర్చంతయు మీ కిచ్చుకొందును." అని పలికెను.

వెంటనే భవసుందరి వెనుకకు వచ్చి యించుక నవ్వుచు హరకు మారబాబుమోమువంకఁ జూచి యిట్లనియెను. "మీయట్టిమహాత్ము లు మాయింట నడుగుపెట్టుట నాయదృష్టము. ఇల్లు చాల నిఱుకు; అయినను మాయింటియెదుటఁ జండీమండప మున్నది. అక్కడ మహా

శయులు స్వేచ్ఛగాఁ గూర్చుండవచ్చును. అక్కడఁ గావలసిన సము పాయము నేను జేసెదను. తాము తిరిగి వచ్చి వంటస్వయముగాఁ జే సికొందురా ?”

హర—అవసరమైనచో నట్లే. మేము బ్రాహ్మణులము. బ్రా హ్మణు లెవ్వరైన నొకరు సందర్భమైనచో వంటచేసి పెట్టవచ్చును, అట్లయినచో బాగుండును, లేనిచో నేనే కష్టపడియెదను. నాతో నొక మహమ్మదీయుఁ డున్నాఁడు. అతని కీసామీప్యమునం దేదైన మ హమ్మదీయుల యిల్లున్నచో భోజనసమపాయము చేయవచ్చును. అతఁ డక్కడ భోజనము వగైరాలు చేసికొనఁగలఁడు. అతనిభోజనా దుల నిమిత్త మింకొక రూప్యము దీసికొనుఁడు.

మరల నింకొకరూక హరకుమారబాబుసంచినుంచి వచ్చి భవ సుందరిచేతిలోఁ బడియెను. మరల భవసుందరి నవ్వుచు—“అయ్యా! అట్లే చూచెదను. కాని మీరు స్వయముగా వంటచేసికొని భుజింపవ లసివచ్చినది! అయినను, ఆవిషయమైకూడఁ బ్రయత్నించెదను. ఈ సామీప్యమున భట్టాచార్యులుగారి యిల్లున్నది. వారియింటి కేగి వారిపిల్లవానిని లక్ష్మీకాంతుని దీసికొనివచ్చెదను. కొంచెము పాటుపడుచ్చ నను మీకు వెనుకదీయరు. సన్నబియ్యము, చాయపప్పు, కూరలు, నేయి, పెరుగు, పాలు, పంచదారవగైరా లన్నియు నేను దెచ్చెదను. చండీమండపముపైఁ జాపలువేసి పక్కవేసెదను. తామక్కడ విశ్ర మింపవచ్చును. మీతో నున్న ముసల్మానువిషయమునఁగూడ మీ రేమియు నాలోచింప నక్కఱలేదు. ఇప్పుడే రహీమాఖానునింట నాతనికి భోజనాదిసదుపాయములు జరుగుట కేర్పాటు చేసెదను.” అని చెప్పెను.

హర—నేను బోలికను జూచియే మనుష్యులెట్టివారో తెలిసి

కోరఁగలను. మీయింటిలో మాకేయిబ్బందియుఁ గలుగదు—సకల సహాయములును సమకూరును. మిమ్ముఁ జూడఁగానే నేనిది యంతయు గ్రహించితిని. అమ్మా! నేనిప్పు డొకమారు పోయి వత్తునా ?

భవ—చిత్తము. త్వరగా దయచేయుఁడు. నేనిప్పుడే గొల్లక్కను బిలిచి మంచిపాలు తెప్పించెదను.

భవసుందరి లోని కేఁగెను. హరకుమారబాబు చండీచరణుని, జరీఫును వెంటఁ బెట్టుకొని గంగామణి పాడువడినయింటికి వెళ్లుటకు బయలు దేఱెను. చండివద్ద గంగామణి యిల్లు కొనిన పెద్దమనుష్యుఁ డింతవఱకు నింటిని బాగుచేయించుటకుఁ గాని, తిరిగి కట్టుకొనుటకుఁగాని యేప్రయత్నమును జేయనేలేదు. అంతియే గాదు. ఆయిల్లు కొన్నయాతఁ డేకారణముచేతనో సకుటుంబముగా విదేశమునకుఁగూడఁ బోయియుండెను. తనపితార్జితమైన పెద్దలోఁగిలికిఁ గలిసియున్నదన్న హేతువుచేతనే యీచిన్నకొంప నాతఁడు కొనియుండెను. కాని దానిలో నివసించుట కెంతమాత్రము నవకాశము లేదు. మిక్కిలి చిన్నకొంప. ఒక్కటే గది కలదు. ఆకొంప కూలిపోవుటకు సిద్ధముగా నున్నది. ఆకొంపకు సంబంధించి యొకపాక యున్నది. దానిపైకప్పంతయు పోయి యది దిబ్బవలె నున్నది. ఇంటిలోఁ జాలభాగము అడవిమైపోయినది. ఇల్లు గొన్న పెద్దమనుష్యుఁ డేఁడాది కొకమాఱాయడవి నంతను గొట్టించివేయుచుండును గాని, మరల వెంటనే తృణగుల్మవృక్షలతాదులు పెచ్చుపెరుగుచుండును.

చండి యింతవఱకు దూరముగానే యుండెను గాని, యిప్పుడు హరకుమారుని సమీపించి యాయన నాపాడుకొంపలోనికిఁ బోవలదని నిరోధించెను. ఎందుచేత ? భీరుఁడైన యాత్రాగుఁబోతు తానావనా క్రీమైన పాడింటిలోనికిఁ బోలేఁడు గనుక.

హారకుమారబాబు ముందుకుఁ బోవుచుండుటఁ జూచి జరిఫ్ తొందరగా నాతని సమీపించి—" హుజూరువారి సేవకుని యపరాధము మన్నింపవలయును. నేను ముందుగా నీయింటిలోనికిఁ బోయెదను." అనియెను.

ముందుగా జరిఫ్‌ను, తరువాత హారకుమారుఁడును, పిదపఁ గుండియు నింటిలోఁ బ్రవేశించిరి. దారిలోని యనేకలతాగుల్మాదులను ఛేదించుచు జరిఫ్ ముందుకు దారిచేసెను. హారకుమారుఁ డక్కడకేఁగి చూచునప్పటి కాయింటిగుమ్మముఁ దలుపులుఁ జెదపట్టి కూలుటకు సిద్ధముగా నున్నట్లగపడియెను. ఆతలుపులు గొళ్లెము వేయఁబడి, యొకతాళము బిగింపఁబడియుండెను. హారకుమారబా బప్పుడు జరిఫ్‌ను జూచి " ఈతాళముఁ దీయుట కుపాయము లేదా ?" అనియెను.

జరిఫ్‌వద్ద నొకతాళఁపుఁజెవి యుండెను. అతఁ డాతాళముచెవితోఁ దానిని దీయుటకుఁ బ్రయత్నించెను గాని తాళము రాలేదు. హారకుమారబాబు తనతాళపుచెవులరింగునుగూడ జరిఫుచేతి కందిచ్చెను. వానివలనను ఫలము లేకపోయెను. అప్పుడు జరిఫు " హుజూర్! తాళము బ్రద్దలుగొట్టిన నేమి ?" అని యడిగెను.

హార—అట్లు చేయఁగలనా ?

జరి—స్వేచ్ఛగా.

హార—అయినఁ గానిమ్ము.

అప్పుడు జరిఫు సకలవిధములఁ బ్రయత్నించి తాళము నూడఁదీసెను.

హారకుమారబాబు చేసిన యీకార్యము చట్టమునుబట్టి మిక్కిలి నిందనీయముగాఁ బ్రకటము కాఁగలదు. అధికారము లేనిదే యింటిలోఁ బ్రవేశించుట, తాళము బ్రద్దలుగొట్టుట మొదలగు నపరాధము

లనై నభియోగము వచ్చునదోఁ బోలీసువా రాతనిని సులభముగాఁ గచ్చేరీకిఁ గొనిపోవుట కవకాశము గల్గెను. చతురతరుఁడును, సుసమర్థుఁడును, బహువిద్యాయుక్తుఁడైన హరకుమారుఁ డీసంగతి యంతయుఁ దెలియనివాఁడు గాని, తెలియఁజాలనివాఁడు గాని కాఁడు. అయినను నాతఁ డీకార్యమునందు వెనుకంజ వేయలేదు. ధర్మసంబంధమైన యాతనివిశ్వాసము, సామాన్యనియమములలోఁ గొన్నికొన్నిచోట్ల విశేషభేదము గల్గియుండెను. ఉద్దేశము గొప్పదై, ఎవ్వరికి ననిష్టము గొరకుండ, అనర్థమైన స్వార్థమునకుఁ జిక్క పరులకు సర్వనాశము చేయు సంకల్పము లేకుండ, పరహితముకంటె నన్యాకాంక్ష మనస్సునఁ బొడమకుండ మనుష్యులు చేయుకార్యములు ధర్మగర్హితములు గాని, దోషావహములు గాని కావని యాతఁడు విశ్వసించి యుండెను. అప్పుడప్పు డిట్టివ్యాపారములవలన జనవిరోధము రావచ్చును. రాజకీయనియమము లిట్టికార్యముల కనేకవిధములఁ బ్రతిబంధకములును గావచ్చును; కాని, ప్రజాసంఘముయొక్కయు, రాజశాసనముయొక్కయు సమ్మతిమీఁదఁ జేసెడికార్యము లన్నియు ధర్మకార్యము లనియు, వానియసమ్మతిపైఁ జేసెడికార్యము లధర్మకార్యము లనియు నాతఁ డెంతమాత్రము విశ్వసించి యుండలేదు. అయినను, నంతమాత్రముచే నాతఁడు సామాజికరాజకీయనిబంధనములను దలదన్నుట కెన్నఁడును దలఁచియుండలేదు. కాని, ఇట్టిసందర్భములు గల్గినప్పుడు మాత్రము, సామాజికరాజకీయనియమములకుఁ బ్రతికూలములైనను వానివలనవిశేషనిందగాని, దోషము గాని లేకుండుటచే నాతఁ డిట్టికార్యముల నవలీలగాఁ జేసివేయుచుండును.

తాళము బ్రద్దలుకొట్టఁబడెను. గొళ్లెము వేయఁబడియెను. తలుపు దీయుటకు జరిపు ప్రయత్నించెను. కాని తలుపు తెఱవఁబడ

లేదు. లోపలనుండి బలమైనవస్తువేదియో దానిని నొక్కిపట్టుచున్నది. బలముకొలఁది ననేకమారులు త్రోయఁగాఁ ద్రోయఁగాఁ దలుపించుక యెడ మయ్యెను. జరిఫు, ఆనందులోనుండి తొంగిచూడఁగా నింటిపై భాగమునుండి కొన్ని యిటికలు, పెంకులు, కఱ్ఱలు వగైరాలు తలుపున కడ్డముగాఁ బడినట్లు కనఁబడియెను. హరకుమారబాబు చేతి కఱ్ఱ జరిఫున కందింపగా నతఁ డాతలుపుసందునుండి కఱ్ఱతో నిటుకలను పెంకులను ద్రోసివేసి తరువాత బలముగాఁ దలుపును గెంటెను. అప్పు డాయింటిలోని భాగ మంతయు వారికిఁ బ్రత్యక్ష మయ్యెను. ఇంటిలోఁ గాలిచుట బహుకష్టమని వారికిఁ దోఁచెను. ఇంటిలోని పై భాగ మక్కడక్కడఁ గూలిపోయి యున్నది. ఇంకను గూలిపోవుచు ఇంటినడుమఁ గొన్నికొన్ని చిన్నచెట్లుగూడ మొలిచియున్నవి. మట్టి గోడలు పెద్దపెద్దయండలు పడిపోయి యున్నవి. హరకుమారుఁడును జరిఫును సాహసము చేసి యింటిలోఁ బ్రవేశించిరి. చండీ మాత్రము బయటనే నిలిచియుండెను. గృహమధ్యమునఁ బ్రవేశించెను గాని హరకుమారబాబు తానుద్దేశించుకొనిన పదార్థము లేమియుఁ గాంచలేకపోయెను. బద్దలైపోయిన యొకటి రెండు పెట్టెలు, కొన్నికుండలు, కొన్నిబట్టలుఁ, దట్టలు మొదలగు పనికిమాలినవస్తువు లాయింటఁ బడి యుండఁగల వనియు, వానినడుమఁ గొన్ని చిత్తుకాగితములకట్ట లా యింటివారు పనికిరాని వని భావించి పాఱవేసి యుండవచ్చు ననియు, నవన్నియు వెదకినచోఁ దనకుఁ గావలసిన కాగితములు దొరకిన దొరకఁగల వనియు హరకుమారబా బాలోచించి యుండెను. కాని యాతనియాశ ఫలించినది గాదు. గృహమునం దట్టిసామగ్రి యేదియు లేదు. అయినను గృహము నలుదెసల వారు పరిశీలించి పరిశీలించి వెదకిరి. తరువాత విధిలేక వారాయింటినుండి యీవలికి వచ్చిరి. చ

రలఁ దలు పెప్పటియట్లు గొళ్లెము తగిలించిరి.

హరకుమారబాబు జరిఫుని జూచి "సరియే; నేఁటికి మనపని యైనది. రేపటియుదయమున నీవిచ్చటిబాజారునకుఁ బోయి మంచితాళమును గొని తెచ్చి యీతలుపునకు వేయుము. తాళపుఁజెవి గృహయజమానునకుఁ జేరునట్లుగా నేర్పాటు చేయుదము." అనియెను.

చండి యేకాకిగా నీవల నిలువఁబడియుండెను. ఆతఁడు హరకుమారుని జూచి "సోదరమహాశయా! ఏమియు దొరకలేదుగా?" అనియెను.

హర — లేదు.

చండి — నేను మొదటనే చెప్పితిని. కాగితములేమియు దొరకవని.

హరకుమారుఁడును జరిఫును మిక్కిలికష్టముమీఁద నక్కడఁ గూలియున్నపాకలోఁ గూడఁ బ్రవేశించిరి. అక్కడఁగూడ విశేషశ్రమతో నంతయు వెదకిరి, కాని ఫలము లేకపోయెను. అప్పుడు హతాశహృదయుఁడైనహరకుమారుఁ డక్కడనుండి యీవలికివచ్చుటకు మనస్సులో నిశ్చయించుకొనియెను. అప్పు డాతని కాయింటియెదుటనున్న పెంటమట్టిదిబ్బయొకటి కంటఁ బడియెను. ఆతని కాదిబ్బపైఁ గొన్ని పెంకుముక్కలు, గుడ్డపేలికలు, చిపికిపోయినబుట్ట, చేటలు మొదలగునవేమేమియో కనఁబడియెను. ఆదిబ్బపై మొలిచియున్నచిన్నచిన్నమొక్కలుకూడ నాతని కగపడియెను. అతఁ డాదిబ్బను సమీపించి చేతికఱ్ఱతో దిబ్బనటునిటు దొలఁగించుచుఁ జూడఁజొచ్చెను. చాలనాళ్లనుండి యెండ కెండుచు, వానకుఁ దడియుచు గట్టిపడియున్నయాపెంటదిబ్బ నాతఁడు పెకలింపఁజొచ్చెను. ఆదిబ్బపైఁ బడియున్నయొకకఱ్ఱముక్కను దీసికొని జరిఫ్‌గూడఁ బెంటదిబ్బను బెకలించుటకుఁ బ్రవృత్తుఁడయ్యెను.

హార—అదేమో చూతము, కాగితము కాదా!

జరి—చిత్తము, చిత్తము.

హార—(అత్యుత్సుకతతో) ఏదీ, చూతము, ఇటు దెమ్మిటు దెమ్ము.

చినిగిపోయినయొకప్రాఁత కాగితపుముక్కను దెచ్చి జరిఫ హారకుమారునిచేతిలోఁ బెట్టెను. హారకుమారుఁడు సులోచనములను ధరించి విశేషప్రయత్నముతో దానిని జదువుటకుఁ బ్రయత్నించెను. ఆకాగితమంతేయు మట్టిపట్టి యుండెను. అక్కరములు సిరారంగు మాసిపోయియుండెను. ఆతఁ డెంతప్రయత్నించినను దానినుండి యేమియుఁ జదువలేకపోయెను. కాని యొక్కముక్కమాత్రము స్పష్టముగాఁ గన్పడు చున్న ట్లాతనికిఁ దోఁచెను. అదియేమన ? “ మరణించెను ” ఎవ్వ రెక్కడనుండి యెవ్వరికి వ్రాసిరో యేమియుఁ దెలియుట లేదు. అయినను హారకుమారకబా బహుభద్రముగా దానిని దఱుచుమాలుకొనుగను ముడివేసికొని “ జరిఫ ! చూతము, చూతము! హాతాశులము కాఁగూడదు.” అనియెను.

వారిరువురును మరలఁ గష్టపడి యామంటిదిబ్బను శోధింప మొదలుపెట్టిరి. కష్టము వ్యర్థ గాకుండ మరల నింకొక కాగితము వారికి దొరకెను. ఆకాగిత మంత ప్రాఁతపడి యుండలేదు. దానినంతను హారకుమారుఁడు చదువఁదొడఁగెను. దానియందిట్లు వ్రాయఁబడి యుండెను.

“ ... నపద్మములసన్నిధికి—

అ... ప్రణామములు నివేదించి వ్రాసికొనునవి శేషములు. మీ ... ర్వాదబలముచే నీహానుఁ డిక్కడ సకలము శుభకరమై యున్నది. పవిత్రమౌ నీమకర్చనిమిత్తము ఆయుఁగుగూపాయి

లింపుతోఁ బంధికొని యున్నాను. అందినసమాచారము వ్రాయించి దయచేయవలయును. శ్రీమతిదొడ్డమ్మగారు కాశినుండి తిరిగివచ్చియున్నారు. ఆవిషయములో నామెకెట్టిసమాచారమును లభింపలేదు. తరువాత నేమియగునో తెలిసికొనవలసియున్నది. మీసామగ్రు లన్నియు భద్రపఱచితిని. ప్రత్యుత్తరమువలన శ్రీచరణకుశలసమాచారము నఁగి సేవకున కానందవర్ధనము గావింతురుగాక.

శ్రీ, [illegible] లయము,
[illegible] లు.

సేవకుఁడు,
శ్రీరామచంద్రశర్మ."

హారకుమారుఁ డీకాగితమునుగూడఁ బదిలముగాఁ దనరుమాలు కొంగున ముడివేసికొనియెను. జరిఫ్ మరల ననేకప్రయత్నములుచేసి యాపెంటదిబ్బను వెతకించిచూచెనుగాని మఱియేమియు దొరకలేదు. వారప్పుడు మెల్లమెల్లఁగా భువనసుందరీభవనమువంకకు బయలుదేఱిరి.

---

## ఆఱవప్రకరణము.

### భువనసుందరి.

దారిలో నడచుచుఁ జండీచరణుఁ డిట్లనియెను—"ఇంతవఱకును నాప్రాణము లఱచేతిలో నున్నవిబాబూ! భూతములు మింగివేయలేదు. ఇదే యదృష్టము."

హార—ఇల్లు భయంకర మగువిధముగా నున్నమాట నిజమే; కాని భూతములు తినివేయుకట్టిజాడ లేమియుఁ గనఁబడలేదుసుమా.

చండి—అది మీపుణ్యము. కాని నాకుఁ జాలభయమువహా త్రము కల్గినది. కాగితము లేమియు దొరకలేదు. ఆదొరికినరెండుకాగితపుముక్కలవలనను మీ కేమైనఁ బ్రయోజనము కల్గునా ?

హార-ఏమియుఁ బ్రయోజనము కలుగదనియే తోఁచుచున్నది.

నోటితో నట్లు చెప్పెనుగాని,హా రకుమారబా బారెండుకాగితములును మిక్కిలివిలువఁగలవి యని తెలిసియేయుండెను. ఎట్లయినను గష్టపడి ప్రయత్నించి యాపాత్రకాగితమునందలి మాసిపోయినయక్షరములను జదువుటకు నిశ్చయించుకొనియే యుండెను. ముఖ్యముగాఁ దనకుఁ గావలసినరహస్యము లందులో నున్నవనియు, రామచంద్రశర్మ హస్తాక్షరలేఖ తనయభీష్టసిద్ధికిఁ జాలసాహాయ్యపడఁగలదనియు నాతఁడనుకొనియెను. ఆయుత్తరములోఁ, దొడ్డమ్మ కాశీనుండి తిరిగి వచ్చుట ఆవిషయములో నెట్టిసమాచారము లభింపకుండుట, సామగ్రులు భద్రముగా దాఁచి యుంచుట మొదలగువాక్యము లన్నియుఁ దనకు మిక్కిలి ప్రయోజనకరములని యాతఁడనుకొనుచుండెను. ఆసూత్రములను బట్టి ముతాను ముందు నడవవలసినమార్గము నిర్ణయించుకొనుట కుపాయము లాలోచించుకొనుచుండెను.

భవసుందరి యతిథిసత్కారార్థమై చాలవేగిర పడుచుండెను. నిజముగా న... ...నట్లుగానే బ్రాహ్మణస్త్రీని బిలిపించి హారకుమారునకు వంటకములు సిద్ధము చేయించెను. పాలు తెప్పించెను. ఇంటి యెదుటనున్న చండీమండపమును శుభ్రము చేయించి మంచిపఱుపులను బఱపించెను. అక్కడనే యొకవరాండాలో జరిపున కొకకంబళియుఁ జండీచరణునకొకసామాన్యపు బక్కను వేయించెను.

చండీచరణునితో హారకుమారునకు స్నేహము క్రమముగా నభివృద్ధి యగుచుండెను. హారకుమారబాబు నిసావస్తువులను బుచ్చు

కొంటట లేదని యూతఁడు తెలిసికొనియెను. ఆతఁడు దుర్వ్యసనముల ననుభవించుట యెఱుంగఁడని కూడఁ జండి యనుకొనుచుండెను. సామాన్యమయిన తంబాకొక్కటితక్క తక్కినమంచిమందినిషావస్తువు లేమియు నాతని కక్కఱలేదు; అందుచే హారకుమారుని బొత్తుగాఁ బనికి మాలినవానినిగా భావించి యాతనితో సంభాషణవర్జితము చేయుటయే చండీచరణునివంటివాని కుచితమైనపని, కాని యాతఁ డట్లుల చేయలేదు? హారకుమారుఁడు స్వయముగా నిషావస్తువులను దినకపోయినను, నిషావస్తువులయెడల నిష్ఠను గలవాఁడు. నిషామహిమ సమస్తము నెఱింగినవాఁడు. నిషావస్తువులలో మంచిరకములు సంపాదింపఁ గలవాఁడు. అది యంతయు నటుంచి నిషావస్తువులను సేవించుచున్న చండీచరణు నాతఁ డత్యంతముఁ బ్రేమించుచున్నాఁడు. ఆతనియదృష్టము మంచిదగుటచే నాతఁడు స్వయముగా నిషావస్తువుల ననుభవింపఁ జాలకున్నను జండీవంటి మహాత్మునివద్ద నత్యంతశ్రద్ధానువై సానుభూతి చూపుచున్నాఁడు. ఇదియే యాతనికిఁ గలయపరిమితసౌభాగ్యము. కారణముచేతనే హారకుమారుని మహాపురుషుఁడు గాఁడని చండీత్రోసివేయలేకపోయెను. చండీచరణునినేమభావములన్నియు నిష్ఫలము మాఱిపోయినవి. [illegible]కొనినంతమాత్రముననే నిషావస్తువు లన్నియు నాతని [illegible]కి వచ్చుచున్నవి. ఆత[illegible]ముఁ గట్టుటకు [illegible]. చండి గొప్పవాఁడైనాఁడు. నిషాకోరు, ఆతని [illegible] జయము [illegible]!

చండీచరణుఁడు [illegible] సంగతిసందర్భములు మాటలాడఁజొచ్చెను. [illegible]యుగానే మాటలాడెను. ఆమె [illegible] స్నేహమును గూడఁ గనఁబఱచెను. [illegible] తెలిసికొనవలె నని

యామెకుఁ గుతూహలము గలిగి చండి నడిగెను.

చండి—ఆయనా? పిన్నీ! నీవు, నన్నింకను నసికీమాలినవానినిగా నెంచుకొన్నావా? ఆయనను జూడుము. ఆయన యొకగొప్పజమీం దారుఁడు. కాని, ఆయన పిచ్చివాఁడు—కేవలము పిచ్చివాఁడు.

భవ—(విస్మయముతో) అయ్యో! అలాగా! ఉన్నస్లేయుం డి యల్లరి చేయఁడుగదా!

చండి—అబ్బే, భయములేదు. అల్లరి చేయఁడు. నావద్ద నేవి యో కాగితము లున్నవఁట; వానితో నాయన కేమో పనియున్న దఁట. అందుకొఱకు వెదకికొనుచు నీదేశమునకు వచ్చినాఁడు. ఆకా గితము లన్నియుఁ బిన్ని యీపాటికిఁ బొట్లముల కుపయోగించియే యుండును. పాప మాకాగితములవలన బాబు కేమిప్రయోజన మున్న దో గాని యెంతయో ధనమో వ్యయముచేసికొని దేశవిదేశములఁ దిరుగుచున్నాఁడు.

భవ—మీపిన్నమ్మదగ్గఱ కాగితము లుండెడివి. వానిని జా గ్రతచేయుచునే యుండెడిది. కాని, కాగితము లింకను నచ్చట నుం డునా?

భవస్సుందరి గాఢముగా నాలోచింపఁజొచ్చెను. చండి యచ్చ టనుండి లేచివచ్చెను. హరకుమారబాబు సిక్కలి పరాకాష్ఠతోఁ దం బాకు సేవించుచుండెను. చండి హరకుమారుని సమీపించి “బాబూ, ప్రపంచములోఁ బిచ్చివాండ్రు ముప్పదిరెండురకములు, నీవును వారిలో నివాఁడవే యన్నా! నీకుఁ గాగితములే కావలసినచోఁ గిరాణాకొట్టు లోనికి వెళ్లుము. జోళ్లషాపులోనికేగుము. అచ్చాఫీసున కరుగుము. పోస్టాఫీసునకుఁ బొమ్ము. అంతేకాని పాడింటఁ గాగితములుండునా? అబ్బే, అన్నా! నీవు వట్టిపిచ్చివాఁడవు!”

హర—చండీబాబూ! కూర్చుండుము. తంబాకుఁ దీసికొనుము. నాకుఁ గావలసినకాగితములు దుకాణములో దొరకునా తమ్ముఁడూ? అట్లయిన నింతకష్టపడుట యెందులకు? పోనిమ్ము. ఏది యెట్లయినను, ఈవిధముగా నీయట్టివానిసహవాసము నాకు దొరకినది, తమ్ముఁడూ, నాకిది తక్కువలాభమా?

చండి—ఇదిగో అన్నా! నేను నీపాదసేవకుఁడను. ఇఁకెప్పుడు నిన్ను విడిచిపెట్టనే విడిచిపెట్టను. కాగితములమాట, కాగితములను గూర్చిన యాలోచనము నీకేఁక నెందులకు? నీవధికారివి. నాకాజ్ఞాపింపుము. కాగితములు కుప్పకుప్పలుగాఁ గుమ్మరించెదను—నేఁడు మొదలుగా నెక్కడెక్కడ నెన్నెన్నికాగితములు కనఁబడునో, అన్నియుఁ దెచ్చినీసన్నిధిని హాజరుపెట్టుచుందును. కాగితములతో నిన్ను ముంచెత్తివేసెదను. నీకు భయమెందుల కన్నా! అచ్చాఫీసులలోని కాగితములు, పుస్తకములు, వ్రాతకాగితములు, తెల్లకాగితములు, వార్తాపత్రికలకాగితములు, కంటఁబడినకాగితము లొక్కటియైన విడిచిపెట్టను. కాగితములయందు నీకింతయిష్టమున్నచో నీవు నాతో ముందుగానే చెప్పియుండిన నెంతబాగుగనుండును. అట్లయిన నీవింత దూరమువఱకుఁ గష్టపడి రానక్కఱయే లేకపోయి యుండును. నేను రాధానగరపుజమీందారుగారి దస్తరములకొట్లువద్ద నుండియుఁ బాఠశాలావిద్యార్థులదగ్గఱనుండియుఁ, గచ్చేరిలతోనుండియు భిక్షమెత్తియైనను దొంగతనముచేసియైనను గుప్పకుప్పలుగాఁ గాగితము లెన్నియో తెచ్చి నీకిచ్చియుందును. ఇఁక నీవు నిశ్చింతగా నుండుము. అన్నా! నీకుఁ గాగితములు తెచ్చియిచ్చుభారము నాది.

హర—సరే, ఇఁక నాకుఁ గాగితములకుఁ గొదువలేదు. కాని నీవు నేఁడు నల్లమందు మఱచిపోయినావా?

చండి—అది యిక మీదట.

అతఁడు నిషానేవ నుమ్యస్తుఁ డయ్యెను. లోపలనుండి భోజన ములకు రావలయునని వర్తమానము వచ్చెను.

చండి—"నాకొంటికేమియు సిద్ధము చేయనక్కఱలేదు. ఇది నాయిల్లు. ఎప్పుడో ఒకప్పుడు, ఎక్కడనో నెవంక్కొనఁ గూడప్పుడే తినివేసెదను. ముందుగా బాబుగారికి సముపాయము చేయుఁడు. నాకుఁ గొంచెమాలస్య మున్నది" అని కేకవేసెను.

అట్లే జరిగినది. చండీచరణుఁడు నిషానేవలో నిమగ్నుఁ డయ్యెను. హరకుమారుఁడు బాబుతనియనుజ్ఞఁ బుచ్చుకొని భోజనాదికములకు లోని కరిగెను. భవసుందరి ప్రియత్నముచే భోజనాదికము లన్నియు విశేషముగా సంసిద్ధములు గావింపఁబడెను. బాహ్మణబాలుఁడు సమస్తపదార్థములను శ్రద్ధాభక్తులతో వడ్డన చేసెను. హరకుమారుఁడు భోజనమున కుపక్రమించెను. భవసుందరి భోజనములయింటిలోనికి వచ్చి దూరముగా నిల్వఁబడి హరకుమారునిఁ జూచి "నేనేమియుఁ దెలియనిదానను. నాప్రియత్నమువలన మీయట్టివారికిఁ దగినట్లుగా భోజనసదుపాయము కుదురుట కష్టము" అనియెను.

హర—అమ్మా! నీవు చేసినసదుపాయములో నేమియులోటు లేదు. నిత్యము నాకిట్టిభోజనసదుపాయము దొరకదనియే చెప్పవచ్చును. నిన్నుఁ జాల కష్టపెట్టితిని. నీవు దయతో నింతశ్రమ దీసికొనకపోయినచో నేఁడు నేనెంత కష్టపడవలసివచ్చునో.

భవ—ఇల్లువాకిండ్లు విడిచి విదేశములకుఁ బ్రయాణము చేయుటయే కష్టము. నేఁడు వంటకము లన్నియు బొత్తుగాఁ బాగుగా లేవుగదా? ఆపిల్లవాఁడు బాగుగా వంటచేయుట యింకను నేర్చుకొనఁడు. నేను మాటిమాటికి వచ్చి చెప్పుచుఁ, బోధించుచు, నేనేదియో కొ

న్నిరకములవంటకములు, భక్ష్యములు దయారు చేయించితిని.

హరి — అలాగునా! అందుచేతనే యింతబాగుగనున్నవి. ఈ బ్రాహ్మణబాలుఁ డింతచక్కఁగా వంటచేయఁగలఁడా? యని నేనను కొన్నాను. సరే, ఇప్పుడు తెలిసినది. బ్రాహ్మణబాలుఁడు కేవల ము పలుక్యమాత్రుఁడు; వంటయంతయు నీవలన నైనదని నామాటయే. ఇంతచక్కనివంట యింతకెప్పుడును భోజనము చేసినట్లు జ్ఞప్తిలేదు.

భవసుందరి మొదటనే బాబు చాలమంచివాఁడని గ్రహించినది. ఇంక నిప్పుడు బాబు చాలశిష్టుఁడని యామెనిశ్చయము చేసికొనినది. ఆమె బుద్ధిమంతురాలును, చతురురాలును. ఆమెవయసు నలుబదివత్సరములకుఁ దక్కువ యుండదు. ఆమెమాట వినినను, ఆమె మోముఁ జూచినను, ఆమె మర్యాదస్థురాలివలెనే కాన్పించుచుండెను. అల్పవయసునందే యొకకూఁతుపిల్లను గని భవసుందరి విధవరాలయ్యెను. ఆమెకు జీవమాత్రగృహపుటకుఁ దగినరాబడి యేమియు లేదు. అయినను ఆమె యొకరివాకిట కేఁగి బిచ్చమెత్తకయే, యొకరిని బలవంతముచేసి కష్టపెట్టకయే తనజీవనమును వెడలఁబుచ్చుకొనుచుండెను. ఆఁడుపిల్ల కనుకూలమైనసంబంధము చేసెను. ఆమెకు సారె, చీరె పెట్టి యత్తింటి కంపెను. మనుమనికి మనుమరాలికి నన్నప్రాశనము చేసి చిన్నచిన్ననగలు గూడఁ జేయించి పెట్టెను. నలుగురిలోఁ దీసిపోకుండ గుంభితముగా సాంసారికమర్యాదను గాపాడుకొనుచుండెను. ఏమాత్రమో పదిరూపాయలు నిల్వఁగూడఁ జేసికొనియెను. అసహాయురాలైనయాఁడది యింతచక్కఁగాఁ గాలక్షేపము చేయుచున్నమాట నిజమే కాని యేపాపపథమునందైన నెప్పుడైన నించుక కాలు పెట్టిగాని, శరీరమును నొరులకు విక్రయించుకొనిగాని యామె యొక్క పైసయైనను సంపాదించి యుండలేదు. గోవులను బిత్తికించి గొల్లవాం

డ్రివగ్గఱ భవసుందరి పాలు కొనుచు దాని నోరులకుఁ దాను తిరిగి యమ్ముచుండును. ప్రత్తి గొని నూలుదీసి విక్రయించుకొనుచుండు ను. ఇరుగుపొరుగుసావాసకత్తెలకును, నితరస్త్రీలకును గావలసినన లు చేయించి పెట్టుచుండును. ఎవ్వరికేని నవసరముచేఁ దాకట్టువస్తువుల పై సొమ్ము బదులు గావలసివచ్చినప్పు డామె వారివస్తువు లింకొకరి వద్దఁ గుదువఁబెట్టి సొమ్ముఁ దెచ్చి వారికిచ్చుచుండును. ఈవిధముగా భవసుందరి యెవ్వరెవ్వరి కేమేమి యుపకారములు కావలసినను దాని బుచేసి తనప్రాణముల నిచ్చియైనను, అందఱ కుపకారములు చేయు చుండును. ఎవ్వరివ్యవహారములలోను భవసుందరి కేవిక్కులును లేవు; లోకు లెవ్వరు నామెయెడల నెట్టియసంతుష్టి నెప్పుడును బొందియుండ గరు. అన్నివ్యవహారములలో నామె యించుకించుక లాభమును బొం దుచుండెను. ధనికులు, ఋణముకావలసినవారు, వర్తకులు, వ్య వసాయదారులు నందఱును నామెవలన మేలొందుచు నామె కేమైన నిచ్చి సత్కరించుచుందురు. ఎవ్వరి కేమికావలయునో, అది యామె నె ప్పుచుండును; వస్త్రములు, నగలు, ధాన్యము, అపరదినుసులు, మొద లు నితరములైన సాంసారికసామగ్రులు నెవ్వరి కేమికావలసినను భవ సుందరిపై భారముపెట్టి వారు నిశ్చింతగా నుందురు. ఎవ్వరియింట నైన బిడ్డకు నన్నప్రాశనము గావించుకొన్నచో భవసుందరి వారియింట శుభసన్నాహ మంతయుఁ దానే చేయుచుండును. ఎవ్వరికైన వ్యాధి సంభవించినచో భవసుందరి వారికిఁ జేయనైన నన్ని యుపకారములు చే యుచుండును. నివారణోపాయములు చెప్పుచుండును. వైద్యుని బిలి పించును. అగత్యమైనచో రాత్రింబవళ్ళు ప్రక్కనే యుండి రోగులకు సేవయుఁ జేయుచుండును. ఎవ్వరి కేయవసరము కల్గినను భవసుందరి సహాయము లేనిదే కార్యములు జరుగుట లేదు. అందఱికిని నిట్లును

భవసుందరివే. బాలురు, వృద్ధులు, స్త్రీలు, పురుషులు, హిందువులు, మహమ్మదీయులు నందఱు భవసుందరియందుఁ బ్రేమగౌరవములు గలవారే. భవసుందరి కొందఱకు అక్క, కొందఱకుఁ జెల్లి, కొందఱకుఁ బెద్ద, కొందఱకు అమ్మ, కొందఱకు గురువు. భవసుందరి వ్యవహారిత యయ్యును బరోపకారిణి. ఆమె కేవలము లాభముకొఱకే ప్రయత్నములు చేయుట లేదు. లాభ మేమియు లేకపోయినను జాలఁ బరోపకారము లామె నిరంతరముఁ జేయుచుండును. ఆమెయదృష్టముచే నామెకు సకలకార్యములయందును గొంచెము గాకున్నఁ గొంచెమైన లాభము గల్గుచునే యుండెను. హరకుమారబాబు తనయాశ్రియమును గోరి వచ్చినప్పుడు, అతనికి బస యిచ్చుటకుఁగాని తగిన సదుపాయములు చేయుటకుఁగాని భవసుందరి కిష్టము లేకపోలేదు. చండిపైనమాత్ర మామెకుఁ జాల విరక్తి. చండికొఱ కామె యనేక సమయములయం దనేకప్రయత్నములు చేసి యుండెను. కాని చండి దుర్నయముచే నామెకుఁ జాల బాధ గల్గించెను. కొన్నిదినము లాతఁడామెయింటఁ గుడిచియుఁ గట్టియుఁ బిమ్మట నామెచెంబులు గిన్నెలు బట్టలు నెత్తికొని పారిపోయెడివాఁడు. చండి యామె కెప్పుడు నేసహాయముఁ జేసియుండలేదు గాని యనేకదౌష్ట్యము లాచరించియుండెను. ఆకారణములచేతనే చండి కిప్పుడాశ్రియ మిచ్చుటకు భవసుందరి కెంతమాత్రము నిష్టము లేకపోయెను. ఆశ్రియమిచ్చుట యటుంచి వానితో మాటలాడుటకైన నామెకు సమాధానము లేకపోయెను. ఇందుచేతనే చండికిని నాతనితో వచ్చినవానికిని గూడ నావరము చూపుట కామె సమ్మతించినదిగాదు.

భవసుందరి హరకుమారబాబు భోజనముచేయుచున్నచోటనే నిలిచి "బాబుగా రేవియో కాగితములనిమిత్తమై వచ్చియున్నా రని

విన్నాను. అవి దొరకుట కేమైన నుపాయము గలదా?" అనియెను.

హర—ఏమియు లేదు.

భవ—గంగామణియను నామె చాలమంచిదియామె. ఆమెకు నాయందుఁ జాల దయగల్గియుండెడిది. నాతో నాలోచింపకుండ నామె యేకార్యమును జేసెడిదిగాదు. ఆమెవద్దఁ జాలఁగాగితము లుండు ట నేనెఱుంగుదును. కాని యెక్కడ నున్నవో, యేమైనవోమాత్రము చెప్పఁజాలను.

హరకుమారుఁడు చండివలన భవసుందరివృత్తాంతము చాలవఱకు వినియుండెను. తాను స్వయముగాఁ గొంత గ్రహించియుండెను. ఆతనియిష్టసిద్ధికై భవసుందరి సాహాయ్యము బొందుటగూడ నాతనికిఁ గష్టముగాదు. ఆతఁ డామెను "కాగితము లుండుట నీవెఱుఁగుదువా? అమ్మా!" అని యడిగెను.

భవ—చాలఁగాగితము లుండెడివి, గంగామణియక్క వానినన్నిఁటిని జాగ్రత్త చేయుట నేను బాగుగా నెఱుఁగుదును. ఆకాగితములు జాగ్రత్తచేసినచో నొకపెద్దమనుష్యునిగౌరవపదవులను రక్షింపవచ్చుననియు, నావశ్యకసమయమునం దాకాగితము లీయఁగల్గినచోఁ బవిహూపాయలసొమ్ము లభింపఁగలదనియుఁగూడ నామె నాతోఁ జాల మాటలు చెప్పియున్నది.

హర—తరువాత? కాగితము లేమైనవి?

భవ—కాగితములేమైనవో యెఱుఁగను. గంగామణియక్కకుఁ దఱచుఁ బోస్టులో నుత్తరములు వచ్చుచుండెడివి; కాశినుండి యొకరామెకు వ్రాయుచుండెడివారు. ఆమె కొన్నిదినములకుఁ జనిపోవు ననఁగాఁ గాశినుండి యుత్తరములు వచ్చుట నిలచిపోయెను. అందుచే నామె యింతవఱకును జాగ్రత్తపెట్టుచువచ్చినకాగితములప్రయోజనము

ప్రత్యక్షమై పోయినదని యనుకొనియెను. ఆకాగితము లన్నియు నామె యెవ్వరికొఱకు భద్రపఱచి యుంచెనో వారిజాడ తెలియకపోవుటచే నిఁక నీకాగితము లెవ్వరికిని బనికిరావని యామె యనుకొనియెను. ఆ తరువాతఁ గాకితము లేమైనవో యామెకు నేనడుగలేదు.

హరకుమారుఁ డామాటలన్నియు మనసిచ్చి వినుచుండెను. ఏలన? ఆవృత్తాంత మంతయు నత్యంతప్రయోజనీయమైనదని యాతఁడు తెలిసికొనియెను.

హర—కాశినుండి గంగామణీదేవి కుత్తరములు వ్రాయుచుండువా రెవ్వరో, వారిపేరేదియో నీకేమైనఁ దెలియునా?

భవ—వారిని నేనెఱుఁగను గాని, యామె పేరొకమారు గంగామణియక్కవలన విని యున్నాను. కాని యిప్పుడు జ్ఞప్తికి వచ్చుట లేదు. ఆమె బ్రాహ్మణ స్త్రీయ.

హర—ఆమెపేరు సోనామణిగాదా?

భవ—అవునవును, సోనామణియే, ఆమెపేరు సోనామణియే. ఆసోనామణి చాలనాళ్ళనుండి యుత్తరము లంపుట మానివేసినదేమి?

హర—గంగామణి మరణించుటకుఁ జాలపూర్వమే, సోనామణి మృతిచెందుటచే నామెవార్త తెలియకుండఁబోయినది.

భవ—సరియే, సోనామణి చనిపోయినచో నీకాగితములతోఁ బ్రయోజనమేమి?

హర—కాగితములవలన సోనామణి కెట్టిప్రయోజనమును లేదు. తల్లిదండ్రులు లేనియొకపిల్లవాని పుట్టుపూర్వోత్తరము లాకాగితములవలనఁ దెలియఁగలవని యాశపడుచున్నాను. నాయాశ సఫలమైనచో మహాత్ముఁడగు నాబాలునకుఁ జాలనుపకారము కాఁగలదు. అందువలననే కాగితములకొఱకు వెదకుచుంటిని.

భవ—తెలిసినది. ఆబాలకుఁ డిప్పు డెక్కడ నున్నాఁడు?

హర—బాలకుఁడు కాశిలో నొకసన్యాసియాశ్రమమున సన్యాసియై యున్నాఁడు.

భవ—అలాగుననా? ఈరాత్రికిఁ దామిక్కడ నుండవలయును. నేనావిషయమై యాలోచించి, యేమైన జ్ఞప్తికి వచ్చినచోఁ జెప్పఁగలను. నే నిక్కార్యముకొఱకుఁ జాలఁ బ్రియత్నముగూడఁ జేసెదను. ప్రియత్నము చేసినచోఁ గాశికమువృత్తాంత మేమైనఁ దెలియక పోదు.

ఆశపడవచ్చును. బుద్ధిమతియుఁ, బరోపకారపరాయణయు, సుగుణసంపన్నయు నగునీనారీమణిసాహాయ్యము దొరకుట సామాన్యమైన మాటగాదు.

హర—నీవు ప్రియత్నించినచో నీకార్యములోఁ జాలనుపకారము చేయఁగలవు. అందుకు సందేహములేదు. ఈకార్యమువలన ధర్మార్థములు రెండును సిద్ధింపఁగలవు.

భోజనము పూర్తియైనది. హరకుమారుఁడు పీటపైనుండి లేచెను.

భవ—ఈవిషయములో నేనేమియుఁ బ్రయత్నలోపము చేయను. ఏమి కాఁగలదో యుదయమునఁ జెప్పెదను. నేఁడు మీరు విశ్రాంతి గైకొనుఁడు.

హరకుమారుఁడు మోమును గరచరణములను గడిగికొని యీవలికి వచ్చెను. ముసల్మానులవీధినుండి యొకఁడు వచ్చి జరిఫ్‌ను దీసికొనిపోయెను. జరిఫుగూడ సంతుష్టిగా భోజనము చేసి తిరిగివచ్చెను. చండి యెట్టకేలకు భోజనము చేసి చాలసేపటి కీవలకు వచ్చెను. హరకుమారుఁడు జరిఫ్‌తో రహస్యముగా చండి మఱదగ్గఱనున్నప్పుడు చా

లుజాగ్రత్తగా నుండవలయునుసుమా. రాత్రి వాండు మనయొద్దం బం
డుకొనుచున్నపుడు నీవు మేల్కొని యుండవలయును" అని చెప్పెను.
జగత్తు నవ్వుచు "ఆవిషయములో హుజూరువారి కేమియుం జింతింపన
లసినపని లేదు" అనియెను.

---

ఏడవపరిచ్ఛేదము.

సూత్రము.

ఉదయముననే హారకుమారబాబు భువనసుందరి చంటిపడకగదికు
దగ్గఱ నొక్కచోం బీటపైం గూరుచుండి దంతధావనము చేయుచుండె
ను. జగత్తు వాడింటితాళ్ళమును దీసికొనివచ్చుటకు వెడలియుండెను.
చండి యొడలెఱుంగకుండ నిద్రాసేవనము గావించుచుండెను.

మిక్కిలి యధీరభావముతో దుర్బలపూరుషుం డొకండు మెల్ల
మెల్లంగా వచ్చి హారకుమారునికి దూరమునుండి నమస్కరించి సవినయ
ముగా నాతనిసమ్ముఖమునకు వచ్చి నిలిచెను. అతనితలపై నొకగుడ్డ
చుట్టంబడి యుండెను. చేతిలో నొకవెదురుకఱ్ఱబెత్తముండెను. దేహ
మంతయు మిక్కిలి కృశించియుండెను. హారకుమారుం డాతనిని జూచి
"ఎవ్వరు నీవు? ఏమి కావలెను?" అని యడిగెను.

కాతరభావముతో నాగంతుకుం డిట్లనియెను. "చిత్తము నేనె
వ్వఁడైన నేమి? నాపరిచయమువలన నేఫలమును లేదు. ప్రస్తుతము
నేను మిక్కిలి దీనుఁడనై దుర్దశలోంబడి యున్నాను. మహానీయులైన
తాము దయగలిగి నాకేమైన నించుక సాయము చేయుదురుగాక"

హార—నిలిచియుండుట నీకుఁ గష్టముగా నున్నట్లు తోఁచుచున్నది. నీవిక్కడఁ గూరుచుండుము. నీ కించుక సాహాయ్యము చేయఁగలను. నీవు జబ్బుగా నున్నట్లగపడుచున్నావు. నీకేమి జబ్బు?

ఆగం—దుర్బలత్వము. నాహారము లేకుండుటయునే నాకు జబ్బు. అంతకంటె నాకు మఱియొకవ్యాధి యేదియు నగపడుట లేదు.

హార—నీకీదుర్బలత్వము స్వాభావమా, లేక యేదేని వ్యాధిచే నిట్టినీరసము కలిగినదా?

ఆగం—చిత్తము, అది పెద్దకథ. ఈతలకు నొకపెద్దదెబ్బ తగిలి నాకు మందమతి సంభవించినది. అప్పటినుండియు బలహీనత కూడఁ బ్రారంభమైనది.

హార—నీతలపై దెబ్బ యెందులకుఁ దగిలినది! చాలఁ బెద్ద దెబ్బ తగిలినది?

ఆగం—దెబ్బ యెట్లు తగిలినదో నేనెఱుఁగను. కాని పెద్దదెబ్బమాత్రము తగిలినది. చాలసేపటివఱకు స్పృహ లేకయేపోయెను.

హార—ఎట్లు తగిలినది! ఎవ్వరైనఁ గొట్టిరా? లేక మఱియెట్లయినఁ దగిలినదా?

భిక్షుకుఁడు—అది యెట్లు చెప్పఁగలను? నేను నిర్భాగ్యుఁడను. నాకు సర్వనాశమైపోయినది. ఇప్పు డీప్రపంచములో నాబోఁటిదుఃఖితుని మఱి యెక్కడ నుండఁబోఁడు.

హార—నిజమే. నీమాటలు వినుటవలనఁ జాలవిచారముగా నున్నది. నీవు సర్వనాశమైనట్లు విని చాలదుఃఖించుచున్నాను. అయ్యో! అట్లయినచో నెవ్వరో నీసర్వస్వము హరించి నీకట్టియాపద కల్గించి నిన్నుఁ గొట్టియున్నారు.

భిక్షుకుఁడు నీరసుఁ డయ్యెను. హరకుమారుఁడు మరల " మంచిది. ఎందులకు నీకీదుర్దశ సంభవించినది ?" అని యడిగెను.

భిక్షు—పరులకు మేలుచేయఁబోయినమాట నానోటితో నెట్లు చెప్పుకొనఁగలను ? కలికాలములో మేలు చేయఁబోయినఁ గీడు వచ్చును. ఒకబ్రాహ్మణకన్య కుపకారము చేయఁబోఁగా సర్వనాశనము ఘటిల్లెను. ప్రాణములు పోవుటకు సిద్ధమయ్యెను. పోయినను మేలే యైయుండును. నాస్త్రీ మరణించినదని తెలియవచ్చెను. నేను దేశవిదేశముల కేగి యామెను వెదకుచుంటిని. ఇంకను జెప్పుట కేమున్నది బాబూ !

భిక్షుకుఁడు దుఃఖింపఁజొచ్చెను. హరకుమారుఁడు— " నీవు చాలమంచిపని చేసియుందువు. నీవాసగ్రామ మేది ?

భిక్షు—ఇక్కడకుఁ జాలదూరము—" చండీతలము "

హర—నీపేరు రామహరిదాసుఁడా ?

భిక్షుకుఁడు సవిస్మయుఁడై నిల్వఁబడిపోయెను. తరువాత— " బాబూ ! నేను నిర్భాగ్యుఁడను. నన్ను సర్వనాశము చేయవలదు" అని ప్రార్థించెను.

హర—నీవు చాలమర్యాదమనుష్యుఁడవు. నేను నీవృత్తాంతమంతయు వినియున్నాను. నీవే బ్రాహ్మణకన్య కుపకారము చేయఁబోయి సర్వనాశనము నొందితివో, యామె నాకుఁ బరమాత్మీయురాలు, నిన్నుఁ జూడఁగల్గుటచే నాకు మిక్కిలి యానందము గలిగినది. నిన్ను వెదకుటకొఱకు మాగ్రామమునుండి చాలమంది మనుష్యులను బంపియున్నాను. కాని నీవెచ్చటను వారి కగపడలేదని విన్నాను. నీభార్యయు, బ్రాహ్మణకన్యయుఁ బడవ మునిఁగిపోయి నీటిలోఁ బడిపోయిరి. బ్రాహ్మణకన్య కొట్టుకొని వచ్చి మఱియొకయూరిలో దొరకినది. చా

లంగట్టముమీఁద నామె మరల బ్రతికినది. నీభార్య నేఁటివఱకును దొరకలేదు. నానాస్థలములకు నామెను వెదకుటకై మనుష్యులను బంపియున్నాను. ఆమె మరణించలేదు. నేనిసమాచారము తెలిసికొంటిని. త్వరలోనే యామెయు మనకు లభింపఁగలదు. సందేహ మక్కఱలేదు. ప్రస్తుతము నిన్నుఁ జూడఁగల్గుటచే నాకుఁ జాలసంతుష్టి గల్గినది. ఆబ్రాహ్మణకన్యయు నిన్నుఁ దలఁచుకొనుచు జాల దుఃఖించుచున్నది. నీవు మాకుఁ బరమాప్తుఁడవు.

ఈసమయమునందు జరిభు వచ్చెను. హరకుమారుఁ డాతనిఁ జూచి—“ ఈతఁడు చాల మర్యాదమనుష్యుఁడు. మన కుపకారబంధుఁడు. ఈతనిజాగ్రత్తగాఁ దీసికొనివెళ్లి కావలసిన సదుపాయములు చేయుము! తంబాకు నిమ్ము” అని చెప్పెను.

జరిభు, అత్యంతసమాదరముతో రామహరిని దీసికొనివెళ్లి వాకిటఁ గంబళమునందుఁ గూర్చుండఁజేసెను. తంబా కందించెను. హరకుమారుఁ డక్కడనుండి లేచి చండీమండపములోని కేఁగెను.

రామ.—బాబూ! మీరు సకలవృత్తాంతములను దెలియఁజేసినారు. వానిని వినుటచే నాప్రాణములు లేచి వచ్చినవి. ఆసతీలక్ష్మియైనబ్రాహ్మణకన్య సురక్షితురాలై యుండుట నాకెంతయు సంతోషమైనది. నాభార్య మరల బ్రతికినచ్చునను నాశ నాకులేదు. కాని, యిట్టిమహాశయులు మాకొఱకుఁ బ్రయత్నములు చేయుటయే మాకు మహాభాగ్యము.

హర.—నీభార్యకొఱకు నీవేమియు విచారింపవలదు. నేను చాలమందిమనుష్యుల నామెను వెదకునిమిత్తము పంపియున్నాను. వారును త్వరలోనే శుభవర్తమానము దీసికొని రాఁగలరు. ఆవిషయములో నీకెంతచింత గలదో, నాకును నంతచింత గలదు.

రామ—నేనీదిక్కునకు భిక్షాటనమునకువచ్చుట నాకుఁ బరమ సౌభాగ్యమైనది! మహాత్ములైన మిమ్ములను దర్శించుటచే నాకు సకలశుభవర్తమానములును దెలియవచ్చినవి. నాతల్లియైన బ్రాహ్మణి కౌసల్యక యిప్పు డెక్కడ నున్నది? ఎట్లున్నది?

హర—నీవిప్పుడు మేలు చేసినావు. నీవుగూడ నేఁడే యామె దగ్గఱకుఁ బోవుదువుగాని. నీశరీరము చాలసుష్కలముగా నున్నది— పరిశ్రాంతము కొంచె మేదేని యాహారము దీసికొనుము. తరువాత వేళకు భోజనము చేయవచ్చును.

హరకుమారబాబు బ్రహ్మాండభాండోదరి యైనచేతిసంచి యీవలికి వచ్చెను. మరల దానిలోనుండి యొకదోవతి బహిర్గత మయ్యెను. హరకుమారుఁ డాదోవతిని రామహరిచేతిలోఁ బెట్టి "ఆమాసిన బట్ట తీసివేసి దీనిని గట్టుకొనుము." అనియెను.

ఇప్పటికిఁ జండికి నిద్రాభంగ మయ్యెను. అతఁడు కన్నులు తెఱచి చూచుసరికి తల కొకగుడ్డను జుట్టుకొని జీర్ణశీర్ణకృష్ణకాయుఁ డగు నుచెవొక మహాపురుషుఁ డక్కడకు వచ్చి యుండుట కనఁబడియెను. వానిని జూచి యాతఁడు—"వీఁడును నావలెనే నిసాకోశై యుండఁ బోలు" నని నిశ్చయించుకొని "నీవెవ్వరు! ఎక్కడనుండి వచ్చితి వన్నా!" అని యడిగెను.

రామహరి—(భయముతో) చిత్తము. నేను దాకిబిచ్చగాఁడను.

చండి—మంచి దన్నా. ఈమహారాజకార్య మైనఁజాలును. బిచ్చగాఁడవైన నేమిలెమ్ము. పరాయివాఁడవు గావు. కాని అన్నా! చేతి డబ్బు లేకున్న నొక్కరోజైన జరుగదు. కనుపరింపఁ గమ్మగ నిషా దొరికక యుండలేముసుమా!

రామ—చిత్తము. చాలదినములనుండి నాకేమియు లేదు. నేను మిక్కిలి దుఃఖిని.

చండి—కొంచెమైన విచారింపకుమన్నా! దుఃఖ మింకనుండఁ బోదు. కల్పవృక్షము నీడకు వచ్చిపడితివి. ఇఁక భయములేదు.

చండి తరువాత హరకుమారబాబును జూచి "నీకక్షయస్వర్గలోకములు వచ్చునన్నా! నీయట్టిపుణ్యాత్ము లీలోకములో నెవ్వరు నుండఁజాలరు. నీవు రామచంద్రమూర్తివి. నీసంచి మందోదరి. ఇట్టి సత్సంగము—ఇట్టిసాధుసేవ యింక నెవ్వరికి నెప్పుడు లభింపదు. నీవిప్పుడు సంపాదించినకీర్తి యింక నెప్పటికిని క్షీణింపఁబోదు. చిరంజీవివై యీవిధముగానే నిషాకోరులందఱను బరిపాలించుచుందువుగాక యని యాశీర్వదించుచున్నాను. నీజన్మ సార్థకమైనదన్నా!" అనియెను.

హర—చండీబాబూ! నీవొక్కమాఱు లెమ్ము. ఇతఁడు మన కాత్మీయుఁడు. నీవీతనికి మర్యాద చేయవలయును.

చండి—ముఖ్యముగా. తంబాకుఁ దెచ్చి యిచ్చెదను. అయిదుకళికలలో గంజాయి యమర్చి యిచ్చెదను. లేపేరు, మాదము, నల్లమందు సమస్తము నిచ్చెదను. అన్నా! వచ్చి నీపనులన్నిటిఁ జేసెదను.

చండి లేచి వచ్చి రామహరిని కౌఁగిలించుకొనియెను. రామహరి మిక్కిలి కుంఠితుఁడై పోయెను.

హర—విడిచిపెట్టుము. ఆతనిని నీవట్లు చేయఁగూడదు. ముందుగా మీపిన్నిదగ్గఱకుఁ బోయి యేమైనఁ దెచ్చి యాతని కాహారమిమ్ము.

చండీ—కేవలము మంచినీళ్లు దాగెదవా? (దీర్ఘనిశ్వాసము

ను వినిచి సందిగ్ధభావముతో మరల; ఇంకనేమియు లేదు. మంచినీళ్లు
ద్రాగెదవా ?

ఆతరువాత నొకమాఱు రామహరిమోమును, ఒకమాఱు హ
రకుమారునిమోమును జూచుచు నాతఁ డక్కడనుండి వెడలిపోయెను.

అంతలో భవసుందరి యచ్చటకు వచ్చి హరకుమారుని జూచి
“ చూడుఁడు బాబూ! ఇరువదివత్సరములకుఁ బూర్వము నాభర్త కా
శికిఁ బోయియుండెను. ఆయన యక్కడనుండి ప్రతిదినమును నాకు
త్తరములు వ్రాయుచుండెడివారు. నిన్నటిరాత్రి మీమాటలు విను
చున్నప్పుడు నాభర్త వ్రాసినయొకయుత్తరముసంగతి నాకు జ్ఞప్తికి వ
చ్చినది. ఆయుత్తరములో నొకసుందరీమణియైనయువతి మరణవృత్తాం
తము వ్రాయఁబడినది. ఆసుందరి యెవ్వరో, ఆమెవృత్తాంత మేమో
నాభర్తయెఱుఁగరు. ఆమెకు రెండుమూఁడేండ్ల యీడుగల బిడ్డఁడొ
కఁడు మాత్రముండెను. ఆమె కింకెవ్వరును లేరు. అభిమానముగల
వృద్ధస్త్రీయొకతెమాత్ర మామెను సంరక్షించుచుండెను. ఆముసలి
దానిని, ఆబిడ్డను విడిచి యాసుందరి స్వర్గస్థురాలయ్యెను. అప్పుడు వా
రికి నాభర్త సత్కారమును సాహాయ్యమును జేసియుండెను. ఆసమ
యమునం దాయన, ఆసుందరి తనపతికి భయపడి యచ్చట దాఁగి
యుండి మరణించినదనియు, నామె యొకగొప్పధనికునిభార్య యని
యు విని యుండెనఁట. భగవంతునికృపవలన బిడ్డఁడే యాబిడ్డఁడై జీ
వించియున్నచోఁ గ్రమముగా సకలైశ్వర్యమునకు నధికారి కాఁగలఁ
డు. ఈసంఘటనము మిక్కిలి యాశ్చర్యము, నసాధారణము, దుఃఖజ
నకము నైయున్నది. అందుచేతనే నాప్రాణేశ్వరుఁడు నాకీవృత్తాంత
మంతయు నప్పుడే వ్రాసియుండెను. నిన్నను మీమాట వినఁగానే,
నాకీవృత్తాంత మంతయు స్వప్నవృత్తాంతమువలె జ్ఞప్తికి వచ్చినది. రాత్రి

ుండును. ఇట్లు మను మను

బెకల్లిగారి కాసమాచార

ాగుర్లు లన్నియు జాగ్రత్తపెట్టి

ను నాకథతో సంబంధించినవే నై

నా కాగితము లున్నచో వానిని సం

యనుకొనుచున్నాను. ఒకప్పుడు

ఱములవలన విశేషలాభ ముండునని య

జిక్కించుకొని యుండును. అతని కేమైన

గాగితములఁ బడయవచ్చును.

భావించుచున్నావో, నేనుగూడ నట్లేభావించు

న, రామచంద్రుఁ డెవ్వరో, అతఁ డెక్కడ నుండునో

ుయు నాకుఁ దెలియదు.

భవ—పాడింటిలో దొరకిన రెండవకాగితము నింకొక్కమాఱు చదువుటకుఁ బ్రయత్నింపుము. దానిలో నావశ్యకములైన సంగతు లుండియుండును. కాగితము నొక్కమాఱెండలోఁ బెట్టవలయును. లేకున్న నిప్పు సెగ చూపుము. అట్లున నక్షరములు (సిరా) పైకుబుకఁ గలవు. అప్పుడు చదువవచ్చును. కాగితమంతయుఁ జదువ రాకున్న ను, అక్కడక్కడఁ గొన్నికొన్ని వాక్యములు చదువఁగల్గినను మనకుఁ జాలనుపయోగము కలుగవచ్చును.

హరికుమారబాబు, భవసుందరిబుద్ధివివేచనమును, బరోపకార మహోత్సాహమును మొదలగు గుణములనుగూర్చి యాలోచించుచు ముగ్ధుఁడు గాఁజొచ్చెను. అతఁ డామెను జూచి—"నీయట్టిబుద్ధిమతి యుపదేశము ననుసరించి పనిచేసినచో, నీబాలకునివృత్తాంతము బయ లుపడుట కుపాయము లభింపఁగలదు. సందేహము లేదు. అప్పుడు

చాలనేపటివఱకుఁ గాగితము
ము దొరకినదికాదు. నా భర్త
దాఁచి యుంచితిని. అందుచే
నాకు ధైర్యము. నేఁటియుదయ
దువఁగాఁ జదువఁగా నాయుత్తరమ

హర—అది చాల నుపయో
చిశుభవర్తమానము. అమ్మా! నీభ
గూర్చి నీకు వ్రాసెనో, యాబాలకునికొ
చేయుచున్నానని యనుకొనుచున్నాను. ఆ
త్నముకు విశేషసాహాయ్యము లభింపవచ్చు
కొక్కసారి చూపెదవా?

భవ—చూచుట యేమి, ఆకాగితము మీకిచ్చి
నివలన మీకుఁ గార్యసిద్ధి కాఁగలదని నాకును దోఁచుచున్నది. నిన్న
ను మీకు దొరకినరెండుకాగితములలో నేమిరహస్యము గలదు?

హరకుమారబాబు, భవసుందరికి మొట్టమొదట, రామచంద్ర
శర్మస్వహస్తలిఖితలేఖను జదివి వినిపించెను. మఱియు రెండవకాగిత
ములోని "మరణించెను" అనువాక్య మొక్కటియుమాత్రము చదు
వఁగలిగెను.

భవ—ఈరామచంద్రశర్మ గంగామణియక్కకుఁ జెల్లెలికొమా
రుఁడు, చండికిఁ బెదతల్లికొడుకు. ఇప్పు డాతఁ డేదియో యుద్యోగము
నం దున్నాఁడు. స్థితిగతు లొకవిధముగా బాగుగనే యున్నవి. చాలఁ
జులుకయినవాఁడు, చాలధూర్తుఁడును. చండి నిషాకోరును, దుర్వ్య
పారియును. అందుచేతనే, చండిచేతిలోఁ గాగితములు పడినచో నష్ట
మై పోవఁగలవని యెంచి, గంగామణి మరణమునకుఁబూర్వమే కాగిత

కాగితముసు గాంచుము చూతము" అనియెను.

భవసుందరి కొంచెము మెండుగడ్డిని దెచ్చెను. జరీపు దాని నగ్గిపుల్లతో నంటించి మండించెను. హారకుమారుఁడత్యంతజాగరూకతతోఁ గాగితము నటునిటు దిప్పుచు నాయగ్నిలోఁ గాంచఁజొచ్చెను. అతఁడట్లు కొంతసేపు కాంచినతరువాత కాగితమునందలి సిరా ఉబికె నమాట నిజమే కాని యందువలనఁగూడ లాభము లేకపోయెను. అయినను హారకుమారబాబు చాలసేపు కష్టపడి యొక్కముక్క నీవలితెఁ దీసెను. ఆముక్క—"సన్యాసులు"

భవ—సామాన్యముగాఁ జూచినచోఁ గార్యము లేదు. ఉండుఁడు నేనొక పిల్లవానిని దీసికొనివచ్చెదను.'

భవసుందరి యక్కడనుండి వెడలిపోయి మరలఁ దక్షణమే, సభ్యుఁడును దర్శనీయుఁడు నగు నొక యువకుని బిలుచుకొని వచ్చి యాకాగిత మాతని చేతి కిచ్చి చదువుమని కోరెను. ఈయువకుఁడు సంస్కృతము, బంగాళీ, ఇంగ్లీషు మొదలగు ననేకభాషలు, నేర్చియుండెను; అతఁ డాయూరిలోఁ బేరొందిన బాలుఁడు. బాలుఁ డాకాగితము ననేకవిధములఁ బరీక్షించి చూచి—"కాగితమంతయుఁ జదువుట కష్టము, అక్కడక్కడఁ జదువవచ్చును; కాని నావద్ద సూక్ష్మదర్శకదర్పణమున్నది. కావలయుచో నది తెచ్చి సాధ్యమగునంతవఱకుఁ జదివెదను" అని చెప్పెను.

భవ—లక్ష్మీపతీ, అది తెచ్చి చదువుబాబూ! చాలనుపకారముఁ జేసినవాఁడవగుదువు. ఇది చాలఁ బ్రయోజనమైన కార్యము.

యువకుఁడు వెడలి, వెంటనే "దుర్భిణి"ని జేతఁ బట్టుకొని మరల వచ్చెను. అతఁడప్పు డాయంత్రసహాయమునఁ గాగితమును జదు

వఁజొచ్చెను. "ఈవ్రాఁత చాలభాగము చదువవచ్చును గాని, వృత్తాంతమంతయుఁ జక్కఁగాఁ దెలియుట కష్టము" అనెను.

హర—సాధ్యమగునంతవఱకుఁ జదువుము బాబూ! నేను పెన్సిలుతో నింకొకకాగితముపై వ్రాసికొనియెదను.

యువకుఁడా కాగితము నీక్రిందిరీతిని జదువఁజొచ్చెను. హరకుమారుఁడాతఁడు చదువుచున్నవాక్యములన్నియు వేఱొకకాగితముపై వ్రాసికొనఁ జొచ్చెను.

"ఎప్పుడు...ఆమె...కాగితములు మీకు...మరణించెను...మీరు...చూచియుంటిరి...పుట్టినది మొదలు...ఉండెను...సోనామణి...ఇట్లు...నిన్న...ఎంతో...సన్యాసులు... పెద్దవాఁడైన ...రాఁగలఁడు...పరిచయము...వానికి...ఈకాగితము...ఇట్లు

శ్రీ...దాస...వ[illegible]

"గణేశమహల్, కాశి"

ఇట్లు చదివి యాయువకుఁడు వెడలిపోయెను. హరకుమారుఁడు భవసుందరిని జూచి యిట్లనియెను. "కాగితమునందలి విశేషము లన్నియుఁ దెలియకపోయినను, నే నేబాలకునికొఱకుఁ బ్రయత్నము చేయుచున్నానో ఆబాలకునకుఁ జెందగల కాగితములను సోనామణి, గంగామణి దగ్గఱ దాఁచినట్లుమాత్రము తెలియుచున్నది. ఈపత్రము వ్రాసినవారెవ్వరో పూర్తిగాఁ దెలియుట లేదుగాని, యాతనిపేరేదియో చక్రవర్తి యనియు, నాతఁడు కాశిలో గణేశమహాలునందు నివసించియుండెననియు మాత్రము తెలియుచున్నది. కాశిలో వెదకుట కొక నిర్దిష్టమైన పేరు దొరకినది, పేరునుబట్టి ప్రయత్నము చేసినచో మనుష్యుని బట్టుకొనవచ్చును. ఇది గొప్ప యుపకారమే.

భవ—ఆబాలకునిమాతామహుల నెక్కడనో యెవ్వరు నెఱుఁగరా?

హర—నే నెఱుఁగుదును. పిల్లవానితల్లి, తల్లిదండ్రులు లేనిది, ఆమె యొకదూరపుజ్ఞాతులయింట నుండెడిది. ఇట్టిస్థితిలో నే యామెకు వివాహమైనది. జ్ఞాతులుగూడ నిప్పు డెవ్వరును లేరు. ఆమెగర్భమున నం దీపిల్లవాఁడు పుట్టినట్లు ప్రమాణములు దొరకినచో మనసంకల్ప మనేకవిధముల సిద్ధించినట్లే. ఈబాలకుఁ డామెసంతానమే యని తెలిసికొనుట యావశ్యకము. సోనామణి యెవ్వరో తెలియఁగల్గినచోఁ జాల లాభము పొందుట కుపాయ మగును.

భవ—ఇప్పు డీసందర్భమున రామచంద్రునివద్ద కేఁగుటయే ముఖ్యప్రయోజనముగాఁ దోఁచుచున్నది. ఆకాగితములను జూడఁగల్గినచో నన్నియుఁ దేటతెల్లము కాఁగలను.

హర—అట్లే. నేను నేఁడే బయలుదేరెదను. నీబుద్ధియు నీసద్గుణసంపత్తియుఁ జూచి నేను మిక్కిలి యానంద మొందుచున్నాను. నీముఖ్యబంధువులలోఁ జేర్చుకొని నన్ను జ్ఞప్తియుంచుకొనవలయును. అవకాశ మున్నచో నింక నొకటిరెండునాళ్లు నేను మీయింట నుండవలసినదే. సరే దానికేమి. ప్రస్తుతవ్యవహారములో ననేకసమయములయందు నీసాహాయ్యము ముఖ్యముగాఁ గావలసియుండును. నాచిరునామా మొదలగునవన్నియు నీకుఁ దెలియఁబఱచి వెళ్లెదను. నీ వెప్పుడెక్కడ నుందువో నీకెట్లుత్తరములు వ్రాయుచుండవలయునో అంతయు నాకుఁ దెలుపవలెను. ఆవశ్యకమైనచో నీకుత్తరములు వ్రాయుచుందును. దయచేసి ప్రత్యుత్తర మిచ్చుచుండుము. మఱియుఁ బ్రయోజనమునుబట్టి సాధ్యమగునంతవఱకు నీవు సాహాయ్యము చేయుచుండవలయును.

భవసుందరి యప్పటికి సంగీకరించెను. అవసరముబట్టి తాను గాశికిఁగాని మఱియెచ్చటికిఁగాని రావలసివచ్చినచో వచ్చెద ననియుఁ జెప్పెను.

భోజనాదులు సమాప్తి చేసికొని చండియు రామహరియు, జరిఫ్ను, హారకుమారుఁడును బయలుదేఱిరి. బయలుదేఱుటకుముందు భవసుందరికిఁ బదిరూప్యము లిచ్చిపోవలయు నని హారకుమారుఁడు ప్రయత్నములు చేసెను. కాని యామె యెంతమాత్రము నందుల కంగీకరింపలేదు. భవసుందరి హారకుమారుని జూచి "మీదయ యున్నచో ననేకలాభములు నాకుఁ గలవు." అని చెప్పుచు వాకిట నఱచుచున్న బిచ్చగానికి బియ్యము పెట్టుట కామె లోనికిఁ బోయెను. ఆమె లోపటనుండి తెచ్చునప్పుడు తనభర్త వ్రాసినయుత్తరము హారకుమారున కిచ్చుట మఱచిపోలేదు.

---

## ఎనిమిదవప్రకరణము.

### సమ్మేళనము.

హారకుమారుఁడును, చండీచరణుఁడును, రామహరియు, జరిఫ్ను యథాకాలమున సనాతనపురములోని హరీశునియింటికి వచ్చిరి. హారకుమారుఁడు లోనికిఁ బోయెను. అప్పుడు సుహాసిని యెవ్వరో నల్లని పడుచునకు తలదువ్వి జడవేయుచుండెను. హారకుమారున కపరిచితురాలైన యాపడుచు, హారకుమారుని జూడఁగానే తన రెండుచేతులుఁ దనమోమునకడ్డము పెట్టుకొనియెను.

సుహాసినిచేలాంచలమును సవరించుకొనుచు లేచి నిల్వఁబడియెను. తరువాత నామె హరకుమారునకుఁ బ్రణామముచేసి యిట్లనియెను—" నాన్నగారూ! నేఁడు నేను పోయిననిక్షేపమును మరలఁ బొందినాను! ఈమెయే దాసి. ఈదంపతు లిరువురును నాకొఱకు సమస్తముఁ బోఁగొట్టుకొని తుదకుఁ బ్రాణములకుఁగూడ భయపడవలసినవారైరి. భగవత్కృపచే దాసి మరల నన్నుఁ గలిసికొనినది. కాని యీమెభర్త రామహరిమాత్ర మింతవఱకు దొరకఁడయ్యెను. అయినను రామహరి బ్రతికియున్నాఁడని దాసివలన వినుచున్నాను. హరీశుని కృపచే దాసిని బడయఁగల్గితిని. దాసి యనేకకష్టములను బొంది, యనేకవిపత్తులనుండి దాఁటి, మిక్కిలి ప్రయాసపైఁ దనయూరు చేరినదఁట. దాసి యిల్లు చేరుటకు ముందే రామహరి తనయింటికి తిరిగి వెళ్లిపోయినాఁడఁట. కాని యాతనిమతి స్థిరముగాక యెట్లో పోయినాఁడని తోఁచుచున్నది. ఎక్కడ కేఁగినాఁడో, యేమి చేయుచున్నాఁడో యేమియుఁ దెలియక దాసి బహుపరితాపపడుచున్నది.

హర—నీవు నాకు సందేశ మిచ్చినచో దాసిపరితాపమును బాపుటకు నేను బ్రయత్నించెదను.

సుహా—మీకు సాధ్యముగాని దేమున్నది తండ్రీ! చచ్చిపోయినవాండ్రను బ్రతికించుటయే మీకసాధ్యము గాకపోయెను! రామహరియు దాసియు సుఖులై యుందురని మీ రెప్పుడు చెప్పినారో అప్పుడే నేను ధైర్యము పొందినాను. ఏమన? మీరు దేవతాస్వరూపులు, దేవవాక్య మెప్పుడును వృథపోదుగదా!

హర—అమ్మా! అయినచో నీవు " అదితివి " నీసంతానము తక్కువ దెట్లగును?

సుహా—నాన్నగారూ! రామహరిమాట యేమిచెప్పెదరు?

హర — ఏమిచెప్పిన నీవు సంతోషించెదవు ?

సుహా — రామహరి యెక్కడనున్నాఁడు ? ఎట్లున్నాఁడు ? తిరిగి యింటి కేల రాలేదు ? గ్రామవాసము లెట్లు జరుగుచున్నవి ? ఈసంగతు లన్నియుఁ దెలిసిన సంతోషించెదను.

హర — ఇంతసమాచారము నేఁ జెప్పలేను. నేను రామహరి విషయమై యొక్కచిన్నమాట మాత్రము చెప్పఁగలను.

సుహా — మంచిది. అట్లే చెప్పుము.

హర — అట్లయినచో నిక్కడ నిలుచుండుము.

అతఁడు వాకిటి కేఁగి రామహరిని వెంటఁబెట్టుకొని మరల లోనికి వచ్చి ‘‘ ఇదిగో నామాట, చూడుము.” అనియెను.

సంతోషమునకు మేర లేకపోయెను. పెద్దరోదనము చేయుచు దాసి యావలికి వచ్చి హరకుమారునకుఁ బ్రణామము చేసెను. తరువాత రామహరిని సమీపించి యేడ్చుచు నచ్చటఁ గూలఁబడియెను. రామహరి యేమియు మాటాడలేకపోయెను! ఏమియిాస్వప్నము! దాసి నాతఁ డిఁక నీజన్మములోఁ జూడఁజాలననియే యనుకొనియెను. ప్రొద్దుట హరకుమారబాబుతో మాటలాడునప్పుడు గూడ నాతఁడు దాసిసంగతి యేమియు మాటాడఁజాలకపోయెను. అకస్మికముగా నిప్పుడీయనుకొనినచోట దాసిని గన్నులార నెట్టయెదుటఁ జూచుటచే నాతఁడు మిక్కిలి విస్మయము పొందిపోయెను. ఏమి చేయవలయునో తోఁచినదిగాదు. మొట్టమొదట హరకుమారుని చరణములకును, తరువాత సుహాసినిపాదములకును బ్రణామము లొనరించెను.

హర — సందేశములు పొందుసమయము వచ్చినది. అమ్మా! ఇప్పుడు సందేశములు దెమ్ము.

సుహా — ముఖ్యముగా. ఇంతసంతోషకార్యము నేనుమూఁడు

చేయుచున్నాఁడో, ఆకుమారుపత్ని కెంతగర్వ ముండును! ఉండును. ముందుగా సందేశములు తెచ్చెదను.

హార—అమ్మా! మనము చాలమంది యున్నాము. కొఱకు మూఁడుసందేశములు చాలవుసుమా!

సుహా—దేవమాత కెన్నఁడైనఁ గొఱఁతయుండునా? కావలసినన్ని సందేశములు.

సుహాసిని యింటిలోనికిఁ బోయి యొకపెద్దపళ్లెరమునిండ సందేశములు (ఒకదినుసు పిండివంట) నింపుకొని రెండుచేతులతోఁ బట్టుకొని తిరిగి వచ్చెను.

హార—(సవిస్మయుఁడై) ఇన్నిసందేశము లెక్కడనుండి తెచ్చితివమ్మా?

సుహా—హారీశుని బిలువనంపియున్నాను.

హారకుమారుఁడు వాకిటికిఁ బోయి చూచెను. చండి వీథిచావడిలోఁ గూరుచుండి తంబాకు సేవించుచుండెను.

హార—బాబూ! కొంచె మేదియైన ఫలాహారము చేయుదువా?

చండి—మంచిది, అట్లే. అట్లయిన రెండుమూఁడు పీల్పులు పీల్చుట కెక్కడనైన చోటు చూపెదవా?

హార—ఇది చోటుగాదా? ఇది నీయిల్లు. ఇక్కడే నీయిష్టము. నేనించుక ఫలాహారము చేసివచ్చెదను.

హారకుమారుఁడు మరల లోపలి కేఁగెను. రామహరి యొక చాపమీఁదఁ గూరుచుండెను. ఆతనియెదుట నేలపై దాసి కూరుచుండి వ్రేళ్లునల్పుకొనుచు నేమేమోగాథలు చెప్పుచుండెను. అప్పుడు దాసి హారకుమారుని జూచి చాల లజ్జితురాలయ్యెను. రామహరి నవ్వుచు నామెను జూచి ‹‹ ఓసివెఱ్ఱిదానా! నీకుఁ గొంచెమైనను దెలివి

లేదు. చూచితివా? వారు మీయక్కగారి తండ్రిగారు. తండ్రిదగ్గఱ బిడ్డ కింతసిగ్గెందుకు?

దాసి యింక నేమియు సమాధానము చెప్పజాలకపోయెను. ఆమె వెంటనే లేచి వచ్చి చెంగు మెడకుఁ జుట్టుకొని హరకుమారుని చరణములకడ సాష్టాంగముచేసెను.

హర—అమ్మా! ఎన్నిమాఱులు ప్రణామములు చేసెదవు? ఆశీర్వదించుచున్నాను లెమ్మా. నీసుఖసౌభాగ్యము లెప్పుడు నక్షయము లగుఁగాక!

తరువాత హరకుమారుఁడు కొన్నిసందేశములను జేతఁ బట్టుకొని యీవలికి వచ్చెను. వచ్చునప్పు డాతఁడు "అమ్మా! యెక్కడ నున్నావు? రామహరి కించుక ఫలాహార మీయవా?" అని కేక వేసెను. తరువాత నీవలికి వచ్చి చండికిని, జరిఫసరును గొన్నిసందేశములనిచ్చి వారికిఁ దేసిరిచ్చెను.

చండికి నిషాసేవ సమాప్తమై చాలసేపైనది. తరువాత నాతఁడు ఫలాహారాదికములు గావించుకొని సంతుష్టుఁడై కూరుచుండెను. హరకుమారుఁ డప్పుడు చండిని జూచి—"లెమ్మా. అన్నా! రెండు మూఁడుదివములలో మనము దేశసంచారమునకుఁ బోవుదము." అనియెను.

చండి—ఎంతదూరము?

హర—అంతదూరమునకుఁ గాదు. ఈప్రాంతముననే. వర్ధమానపురమువఱకును.

చండి—సీతాభోగపురమునకుఁ బోయిన బాగుండును. అక్కడ నీచదువులు, నీకథలును లేవు. పద. అన్నా! నీతో వచ్చెదను. ఇంకను నాలోచన మెందులకు?

ఆతరువాత హరికుమారుఁడు జగన్నాథునితోఁ జాలసేపు చాలసంగతులు మాటలాడెను. అనేకవిషయములలో ననేకములైన యేర్పాటులు గావించెను. అనేకకార్యభారములు జగన్నాథునిపైఁ బెట్టెను. చాల రాత్రి యైనతరువాత వారందఱును భోజనాదికములు గావించిరి.

---

## తొమ్మిదవప్రకరణము.

వ్యవహారజీవి.

వర్ధమానపురమున రామచంద్రచట్టోపాధ్యాయుఁడు పోలీసు కచ్చేరిలో "ముక్తియారు" గా నుండెను. ఉద్యోగములో నంతగా లాభము లేదు. ఎట్టులో సంసారయాత్ర నిర్వహించుకొనుచుండెను. వానిగృహ మంతబాగుగా లేదు. "ముక్తియారు" మహాశయునకు నౌకర్లుఁ జాకర్లు విశేషముగా లేరు. ఒక్కదాసిమాత్రము కలదు. అది యొకవిధముగా నింటిపనులు చేయుచుండును. ఆతని కిరువురుసంతానము—ఒక మగపిల్లవాఁడు నొకయాఁడుపిల్ల. పిల్లలిద్దఱు బడిలోఁ జదువుచుండిరి. ఆఁడుపిల్లకుఁ బదివత్సరములు పైనుండును. ఆబిడ్డ వివాహమును గూర్చి 'ముక్తియారు' మహాశయునకును, ఆతనిభార్యకును విచార ముదయించెను. ముక్తియారుమహాశయుఁడు తాను చేయఁబూనిన పనులన్నియు శీఘ్రగానే చేయుచుండును. శరీరమునకెంతయో అస్వస్థత సంభవించినఁగాని యాతఁ డెన్నఁడును గచ్చేరీకిఁ బోవుట మానఁడు. ఎవ్వరేపిరియాదులు తెచ్చినను వానినన్నిటి నామోదించుచుఁ బ్రయత్నపూర్వకముగా వారివారి పనులను సఫల

మొదలుపెట్టుటలో లోపము చేయఁడు. ప్రతిదినము దక్కనయుదర్శ్రీ స్థలును పక్షీకారులు గచ్చేరీకి రాకమునుపే తాను పదివిరుగుల పాయిజామాను, నూరువిరుగుల చొక్కాయిని, మిగులమాసిన తలగుడ్డను, జంకలో దస్త్రమును, చేతిలోఁ బ్రాంతగొడుగును, చెవిలోఁ గలమును, సిల్కుచెప్పులజోడును ధరించి కచ్చేరీకి పోజరగుచుండును. కచ్చేరీకివచ్చి రామచంద్రభట్టోపాధ్యాయుఁడు మాటాడకుండ నొకచోటఁ గూరుచుండి యుండువాఁడు గాఁడు. పనియున్నను లేకున్నను, అతఁడు నాలుగుదెసలకు చులుకుగాఁ దిరుగుచుండును. అంతటితో నాతనిచులుకుదనమునకు శాంతి గలుగక యాతఁడు కొమఁ దొందరతోఁ దనకాగితములకట్టను విప్పి, ఇదివరకనేకపర్యాయములు చదివియున్న యొక కాగితపుముక్కను దస్త్రములోనుండి పైకిఁ దీసి మరలఁ జదువుచుండును. ఆతఁ డటునిటుఁ దిరుగుచున్నప్పుడుగాని దీకగాఁ జదువుచున్నప్పుడుగాని, యెవ్వరైన నాతనితో మాటాడుటకు వచ్చినచో నాతఁడు వారిని జూచి "ఉండుఁడు ఉండుఁడు. ఒక్కగడియ యుండుఁడు. ఇప్పుడే వచ్చెదను." అనియును, గొంతుకను ముక్కును సవరించుకొనుచు "వచ్చెదను గొంచె మవసరమైనపని చూచుచున్నాను." అనియు సమాధానముఁ జెప్పుచుండును. స్వయముగా పిరియాదులు దాఖలుచేయుట తఱచుగా నాతనియదృష్టమున లేదు. ఏవకీలో, ఏ ముక్తియారో సహాయము చేయకుండ నాతని కేపనియు నెప్పుడును జరుగుటయే లేదు. దరఖాస్తుపత్రములు, దస్తావేజులు దాఖలుచేయుట సాక్షివాఙ్మూలము తీసికొని యార్గ్యుమెంటు చెప్పుట మొదలగుముఖ్య సమయములయందు వకీళ్ళదగ్గఱఁగాని ముక్తియారులదగ్గఱఁగాని చెవి యప్రస్తుతప్రసంగములు చేయుచుండును. వేయేల? ఆతఁడు కచ్చేరీలోఁ బనిచేయుచున్నంతసేపు న్యాయాధిపతులకు వకీళ్ళకు ముక్తియార్లకు

దలగువారందఱకు ననహ్యమైనవిరక్తిని గలిగించుచుండును. మన రామచంద్రమహాశయుని శక్తి యిది.

రామచంద్రచట్టోపాధ్యాయుని వాకిట నరుఁగుపై నొకకంబళి పఱవఁబడి యుండెను. ఒకటిరెండుకుర్చీలు. నొకపెద్దబల్లయు నాతని బల్లయు నాతని యింటినడవలో నుండెను. తంబాకు తయారుచేయుటకును, దానిని సేవించుటకును దగినసామానులుకూడ నక్కడ నొక బల్లపై నుండెను.

ఉదయము దరిదాపుగా నేడుగంటలకాల మైనది. రామచంద్రుఁడు వీథియరుఁగుపైఁ గూరుచుండి యుండెను. ప్రతిదినము నాతనితో నుండెడివస్త్రము, నొకకలందాను నిప్పు డాతనిదగ్గఱ నుండెను. రామచంద్రుఁడు చదువుట గాని, వ్రాయుట గాని యేమియు లేదు. మాటాడకుండఁ గూరుచుండి యేదియో యోచించుకొనుచుండెను. అట్టిసమయమునం దాతని కెదురుగా నెవ్వరో యిద్దఱుపెద్దమనుష్యులు వచ్చుచున్న ట్లాతఁడు చూచెను. అప్పు డాతఁ డత్యావేగముతోఁ దనవస్త్రమునుండి యొకకాగితమును దీసి, యతిశ్రద్ధతోఁ జదువుటకు మొదలుపెట్టెను. ఆవచ్చినపెద్దమనుష్యు లిద్దఱును దిన్నఁగా లోనికిఁ బోవుచుండిరి. అది చూచియు రామచంద్రుఁడు తనచేతిలోని కాగితమునుండి దృష్టి మరలింపకయే వారితో "వచ్చుచున్నాను కూర్చుండుఁడు." అనియెను.

ఆవచ్చినవారిరువురు మనహరకుమారబాబును, చండీచరణుఁడునే. రామచంద్రుఁడు దూరమునుండియే వారిని జూచెను. హరకుమారబాబువేషభావములు చూచి, ఈతఁ డేదియో పెద్దదావా పట్టుకొని వచ్చినాఁడు, సరియే సులభముగాఁ బదిరూకలు సంపాదింపవచ్చును. అని నిశ్చయించుకొనియెను.

హరకుమారబాబు అక్కడ నున్నయొకనవారుమంచము గూరుచుండెను; చండిమాత్రము కూర్చుండకయే "ఏమి? అన్నా! మఱచిపోయితివా? పోల్చుకొనలేకున్నావా?" అనెను.

ఇట్లనుచు రామచంద్రునిపాదములకు నమస్కారము చేసెను. తరువాత నాతఁడు రామచంద్రుని జూచి, విశేషప్రయోజనము గల్గి మేము కొన్నికాగితములకొఱకు వచ్చితి మని చెప్పుచు హరకుమారు నివైపు కనుసైగ చేసి చూపెను. చండినిజూచి యాతఁ డానవాలు పట్టకపోలేదు. కాని యాతఁడు మనసులో—"ఈనిర్భాగ్యుఁడు మరల మనలను గష్టపెట్టుటకు వచ్చినాఁడు. దీని కేదియేని పంచియిచ్చుట యావశ్యకమే" అనుకొనియెను. మరల నాతఁడు "వీనితో నింకొక పెద్దమనుష్యుఁడుగూడ వచ్చియున్నాఁడు; ఏదియో వ్యాపార ముండి యుండును. చివరవఱకుఁ జూచెదను. ఆతరువాత వీనిని సాగనంపుట కుపాయము చూతము! అనుకొని "ఏమిరా, తమ్ముఁడా! చండీ! ఎక్కడనుండి వచ్చినావు?" అనియెను.

చండీ—ఇంటివద్దనుండే, అన్నా! పిల్లలు కులాసాగా నున్నారా? వదినెగారు బాగుగ నున్నదా?

రామచంద్రుఁ డట్లే యని తలయూఁచుచు "నీవు కులాసాగా నున్నావా?" అనియెను.

చండి—(సవినయముగా) మీయాశీర్వాదముచే దినములు సుఖముగఁ గడచుచున్నవి. ఇంచుక తంబాకు కావలయును. నవుకరు లెవరైన నిక్కడ నున్నరా?

రామచంద్రుఁడు తల యూఁచెను.

చండి—"అన్నా! నాతో వచ్చినవీరు—చాలగొప్పవారు సుమా; వీరియవసరముకొఱకే మేమిప్పుడు వచ్చినాము. నవుకరు ఇ

జారునకు వెళ్లినట్లు తోఁచుచున్నది. అవసరము లేదు. అన్నియు మావద్దనున్నవి" అనియెను.

చండి తంబాకు సిద్ధముచేయ మొదలుపెట్టెను. రామచంద్రుఁడు తనమనసులో "ఇన్నాళ్లకుఁ దెలిసినది!—నావిద్యాబుద్ధులప్రాభవము దశదిశలకు వ్యాపించినదని. అందుచేతనే మహాత్ములైన గొప్పవారుగూడ దేశవిదేశములనుండి నాబంధువులను వెంటఁబెట్టుకొని నన్ను వెదకికొనుచు నిక్కడకు రానారంభించుచున్నారు. ఒకనాఁటికిఁ గాకున్న నింకొకనాఁటికైన నాపేరు సర్వత్రప్రచారితము కాఁగలదని బోధపడినది." అనుకొని "మహాశయులు నివసించుగ్రామమేది?" అనియెను.

హర—అయ్యా! నేనీజిల్లాలోనివాఁడను గాను.

రామ—ఏజిల్లాలోనివారైననేమి, వ్యాజ్యము నాచేతిలోఁబెట్టినతరువాత మీకే తెలియును—ఇంతచక్కఁగాఁ బనిచేయుట యెవరివల్లను గాదని చట్టములన్నియుఁ బయటఁబెట్టి, యెదుటిసాక్ష్యమును బడఁగొట్టి, న్యాయాధిపతి తాతవలె వక్తృత్వముఁ జూపి పనిచేయుట నాకుఁ దెలిసినట్లింకనెవరికిని దెలియదు. అది నాసహజగుణము. చెప్పుట కేమున్నది? ఇప్పటిరోజులలో న్యాయము తెలిసినవారు లేనేలేరు. ఈప్రాంతములో వకీళ్లు ముక్తియరులు బొత్తుగా వ్రాయుటయుఁ, జదువుటయుఁగూడ నేర్చుకొనియే యుండలేదు. 'లా' యెఱుఁగనే యెఱుఁగరు. వ్యాజ్యమనఁగా నేమో యెఱుఁగరు. మాటాడవలసివచ్చినచో గట్టిగా రెండుమాటలైనను మాటాడలేరు! నావలె ననుభవమును, ప్రావీణ్యమును గలవారింక లేనేలేరు. ఒకరిద్దఱువారైన నున్నను వారు వ్యాజ్యవ్యవహారములు న్యాయాధిపతి యిష్టప్రకారముగాఁ గొనసాగించెదరు. ఇఁక నెందులకు? మహాశయా! మీరు నాకు

లకుగొనిపోదను? వాదిపక్షములో నేనర్జీవ్రాసినచో, దానిలో నింక నెవ్వనికిఁ గలముఁబెట్టుట సాధ్యముగాదుగదా!

హర—చిత్తము. నేను వాదినిగాను.

రామ—ఓ! అట్లయిన మీరు ప్రతివాదులా? కాని, భయములేదు. సాక్షులను భంగపఱచి, తర్కవితర్కములు గావించి, వ్యాజ్యము క్షణములోఁ గొట్టివేయించెదను. నామాట నేనే చెప్పుకొనఁగూడదు. కాని, అది నాకు సిద్ధవిద్య.

హర—చిత్తము. నేను బ్రతివాదినిగూడఁ గాను.

రామచంద్రుఁడు విప్పినకాగితము లన్నియు గట్టగట్టుచు “అట్లయిన మీ రెట్టివ్యాజ్యమునకై వచ్చినారూ?” అనియెను.

హర—ఎట్టివ్యాజ్యమును లేదు.

రామచంద్రుఁడు మరల నొకకాగితమును దీసికొని శ్రద్ధాభక్తులతో దానిని జదువుట కారంభించెను.

హర—నేను వేఱొకపనిగలిగి వచ్చినాను. అదియంతగా లాభముగలకార్యమును గాదు.

రామచంద్రునిచేతినుండి కాగితము పడిపోయెను. అతఁడప్పుడు—“సరియే వ్యాజ్యములతో సంబంధించినవి యనేకకార్యములుండును; వ్యాజ్యములు నుండును. ఇప్పుడు మీకేమి కావలయును? ఓహో! తెలిసినది మహాశయునికార్యము మ్యునిసిపాలిటితో సంబంధించినది. అపని నావలన నిముషములోఁ గాఁగలదు. మీరీపనినిమిత్తమై తగినవానివద్దకే వచ్చితిరి. ఏమన మ్యునిసిపల్ వ్యవహారము లన్నియు నాచేతిలోనే యున్నవి.

హర—చిత్తము. మ్యునిసిపల్ ఆఫీసులో నాకేమియుఁ బనిలేదు.

రామ—అట్లయిన రికార్డుఆఫీసుపనియా? అదియైనను మంచి

దే. జమీందారీభూముల సరిహద్దుకొలతలలెక్కలు కావలయునా? అవియును సప్లయిచేయఁగలను. కాని కొంచెము మిత్రులకావిషయమును లో దాహ మీయవలసియుండును. అయినను మన కాటంకములేదు. ఇప్పుడే దరఖాస్తు చేయుదము. మీకు నంబరు జ్ఞప్తియున్నదా?

హర—చిత్తము. ఆపనియును నాకు లేదు.

మరల, నూరుమారులుచదివినకాగితమును రామచంద్రుఁడు పైకిఁ దీసెను. దానినే చూచుచుఁ దలపైకెత్తకయే రామచంద్రుఁడు హరపమారునిగూర్చి "సరియే, అట్లయిన నింకేమి కావలయును?" అని ప్రశ్నించెను.

హర—మీవద్దఁ గొన్నికాగితములు గలవు.

రామ—ఏవ్యాజ్యపుకాగితములు? నాకు జ్ఞాపకములో లేవు. నాయొద్ద కాగితములు దిగవిడిచినారా? ఎవ్వరైన నేమైన బాకీ యున్నఁగాని కాగితములు నావద్ద నుండనీయనే?

హర—వ్యాజ్యపుఁగాగితము లేమియుఁ గావు.

రామ—అయిన నింకేమి?

హర—మీపెదతల్లి—పరలోకగతురాలైన గంగామణీదేవి మీవద్ద కొన్నికాగితము లుంచిపోయినదిగదా; అవియే యిప్పుడు కావలసివచ్చినవి.

రామచంద్రునిశరీరము గగుర్పొడిచెను. చిరకాలమునుండి యీకాగితము లాతనివద్ద పడియుండెను. ఎప్పుడో యొకప్పుడు, ఆకాగితములవలన నెంతయో కొంతలాభ ముండునని యెంచియే యాతఁడా కాగితములు పెద్దతల్లివద్దనుండి సంపాదించి దాఁచుకొనియెను. గంగామణి యిఁకఁ గొలదికాలములోఁ దనకు మృత్యువు రాఁగలదని యనుకొనుచుఁ, బ్రయోజనీయములైన యీకాగితము లేమిచేయవలయునని

రించెను. చండి దరిద్రురాలు గనుక, తనసొత్తు నాతనికిఁ జెందఁ
జేయవలయునని యామె నిశ్చయించుకొనియెను. కాని, కాగితము
లను జాగ్రత్తపెట్టుటకుఁగాని, వానిని సద్వినియోగము చేసికొనుటకుఁ
గాని చండి తగనివాఁడని యామె యెఱుఁగును. ఈసమయములో
రామచంద్రుఁడు గంగామణిని జూచుటకు వచ్చెను. అప్పుడు గంగా
మణి కాగితములు రామచంద్రుని కిచ్చుట మంచిపని యని నిశ్చయిం
చుకొనియెను. కాగితము లెవ్వరివో తెలిసికొనలేకపోయినను, రామ
చంద్రుఁ డాకాగితములను జదివికొని, యవి రహస్యపుఁగాగితములని
గ్రహించెను. ఎప్పుడో యెవ్వరికో వానియావశ్యకత కల్గినప్పుడు సు
లభముగాఁ దమకుఁ బదిరూపాయిలు దొరకఁగలవని రామచంద్రుఁ డా
కాగితములవిషయములోఁ జాల నాశపెట్టుకొనియెను; కాని, యాతని
యాశ యేమియు సఫలమైనదిగాదు; ఇంతపర్యంతమునుఁ గాగితముల
ను వెదకికొనుచు నెవ్వరును రాలేదు. ఈవ్యవహారము కాశితో సం
బంధించినదని తెలిసికొని, స్వయముగా నాతఁడు కాశికిఁగూడ వెళ్లి,
కాగితము లెవ్వరివో తెలిసికొనుటకుఁ గొంతప్రయత్నము చేసెను.
కాని, కార్యము లేకపోయెను. చివరకాతఁడు నిరాశచెంది, యిక నీ
కాగితములు పనికిరావనియే యనుకొని వానినిగూర్చి జాగ్రత్తపుచ్చు
కొనుట మానివేసెను. కాని తాళమూడిపోయినతనపాతపెట్టెలో నె
క్కడనో యాకాగితము లిప్పటికిని పడియుండెనని యాతఁడెఱుఁగును.
ఇన్నిదినములైనతరువాత వానికొఱకిప్పు డెవ్వరో వచ్చిరి. ముఖ్యము
గాఁ బదిరూపాయీలసొమ్ము లభింపఁగలదు. అతనిశరీరములోనుండి
యేదియో విద్యుత్ప్రవాహము బయలుదేఱెను. అతఁడు హారకుమా
రుని జూచి ,, ఉండవచ్చును. మాపెద్దతల్లిగారికాగితము లనేకములు
నావద్దనుండెడివి. వానిలోఁ జాలకాగితములు వినష్టములైపోయి

సావి." అనియెను.

హర—నాకుఁ బనికివచ్చెడి కాగితములు మీయొద్ద నున్నవానిని నాకిచ్చి, నావలన నేఁబదిరూప్యములు బహుమానముగ దీసికొనుఁడు.

రామచంద్రుఁడు తనలో మొట్టమొదటనే తననోటితోఁ దాను, నేఁబదిరూప్యము లిచ్చెదనని యీతఁ డనుచున్నాఁడు. అందుచే నం తకంటె నెంతోయధికముగానే మనమీతనివద్దనుండి సంపాదింపవచ్చును. అని యనుకొని, మరలఁ బైకిట్లు చెప్పెను. "ఉన్నవో, లేవో అదియును సందేహమే. ఎక్కడ నున్నవో వానికొఱకు విశేషప్రయత్నము చేసి వెదకవలయును. ఏమైన లాభము దొరకఁగలదనియే యిన్నినాళ్లనుండియు వానిని జాగ్రత్తపఱచి యుంచితిని. ఏఁబదిరూప్యములు నాకిచ్చుట మీకు సమ్మతమైనచో నొకమాఱు కాగితములకొఱకు వెదకి చూచెదను, గానియవి దొరకునో లేవో?"

హర—ఆకాగితములవలనఁ గాఁగలయుపకార మంతయు నే నితరవిధముగా సంపాదించియున్నాను. ఆకాగితములలోనివృత్తాంతమంతయు నేను దెలిసికొనియే యున్నాను. కాగితములు దొరకకపోయినను నాకార్యమునకు భంగములేదు. అయినను వానిలో నేమైన నించుకనూతనవృత్తాంత ముండునేమోయని యెంచి, కాగితముల నొక్కమాఱు చూచుటకుమాత్రమే కోరుచున్నాను. నేనిచ్చుచున్న యేఁబదిరూప్యములుఁ గేవలము నష్టమే యైనను నాకది యొకలెక్కలోనిది గాదు.

రామ—కాగితములవలనఁ బ్రయోజన మున్నదన్నమాట నిజము. అయిదువందలరూప్యములు పుచ్చుకొనకుండ నేను గాగితములనుమాత్ర మీయఁజాలను.

హర—ఏఁబదిరూపాయిలకంటె నొకపైసయైనను నేను పైగా

నీయును. ఇష్టము లేకున్న మీరు కాగితములను మీవద్దనే యుంచుకొనవచ్చును. అయినచోఁ జండీబాబూ! మీరిక్కడనే యుండెదరా? నే నీరాత్రిబండిలో బయలుదేఱి కాశీయాత్రకుఁ బోవుచున్నాను. సాయంకాలమునం దొకపర్యాయము కనఁబడఁగలరా?

చండి—అది యేమి! అన్నా? నేనును మీతోడనే కాశికి వచ్చెదను; నన్ను విడిచిపోవలదుసుమా. నేనీవేళ నిక్కడనే యుండవలయునని యున్నది. చాలదినముల కన్నగారి యింటికి వచ్చియుంటిని. పిల్లలను జూచి వదినెతో మాట్లాడి మఱిరావలెననుకొనుచున్నాను. మీరు నడచుచుండుఁడు—నేనును గొంతము సేపటిలో మీవద్దకు వచ్చెదను.

రామ—అయినచో మహాశయునకు గాగితములవలన నంతగాఁ బ్రయోజనము లేదా? అవి దొరకునో లేవో కూడ సందేహమే. ఒకవేళ దొరకినను లాభ మేమి? ఇంతకాలమువఱకు వానిని డాచినందులకుపయోగ ముండవలదా?

హరి—అవును నిజమే.

హరికుమారుఁడు వెడలిపోయెను. రామచంద్రుఁడు మనసులో నిట్లనుకొనఁజొచ్చెను. "కాగితములయావశ్యకము గలిగినప్పు డాతఁడే నావద్దకుఁ దప్పక రాఁగలఁడు. బిడ్డపెండ్లికిఁ గావలసినసొమ్ము సంపాదించుటకుఁ దగినయుపాయము పరమేశ్వరుఁ డిప్పటికి నాకుఁ గనఁబఱచినాఁడు."

చండి—అన్నగారు మాటాడక వెడలిపోయినారు. మీరు చేతిలోనియేఁబదిరూప్యములను నిష్కారణముగా పోగొట్టుకొన్నారు. ఆయనతో స్నేహము చేసికొనుటవలన మనకుఁ జాలలాభ ముండును. అది నిజము, నేనిప్పు డందులకే బాబుతోఁగూడ వెళ్లనైతిని.

రామ—అయిన నేమి? నేటికి నీవిక్కడనే భుజింపవలయును. తరువాతమాట తరువాతఁ జూచుకొందము.

చండివలన సమస్తవృత్తాంతమును దెలిసికొనవచ్చు ననియుఁ, గాగితములవలన నెంతసొమ్ము రాఁబట్టవచ్చునో చండితో నాలోచింపవచ్చుననియు రామచంద్రుఁడు నిశ్చయపఱచుకొనియెను. "హరకుమారునితోఁ జండి యథేచ్ఛముగా మాటలాడుచున్నాఁడు. హరకుమారుని విడిచిపెట్టినను జండిని విడిచిపెట్టరాదు. సంగతు లన్నియుఁ దెలిసికొని సాయంకాలమునం దేదియో యొకటి చేయవచ్చును. ఈ వేళకుఁ జండిని బోకుండ నాఁపివేసెదను." అని రామచంద్రుఁడు స్వార్థలాభము కోరి చండిని దనయింటనుండుమని నిరోధించెను. లేకున్నచో నన్నము బెట్టుటకును, జుట్టఱికముఁ జూపుటకును రామచంద్రుఁడు సమ్మతించువాఁడు గాఁడు.

చండి తంబాకు సిద్ధముచేసి తనయన్నకందించుచుండెను. అన్నయుఁ దంబాకు సేవించుచుఁ జండిని, హరకుమారునివిషయమై యనేకప్రశ్నము లడుగుచుండెను. చండియు సత్యాసత్యముల సమ్మేళము గావించి ప్రత్యుత్తరము లిచ్చుచుండెను. అంతయు విని రామచంద్రుఁడు కళవళపడఁజొచ్చెను; వచ్చినమనుష్యు నొక్కసారిగా విడిచిపెట్టుకొనుట మంచిపని కాదని యాతఁ డప్పుడనుకొనఁజొచ్చెను. చండి తలంచుకొనినచో, నేఁబదిగాదు, నూఱురూప్యములైన నిప్పించఁగలఁడనికూడ నాతఁడు గ్రహించుకొనియెను. అందుచేతనే యాతఁడు చండి నిప్పుడు గౌరవింపవలసివచ్చి, యేవిధముగా గౌరవింపవలయునో యాలోచింపఁజొచ్చెను.

రామచంద్రుని కింక స్నానమునకు వేళయైనది. ఆతఁడు చండిని

మాధవి—కొమ్ముకొమ్మా, లోనికి రమ్ము" అనెను.

అంకి—చిత్రము.

ఉభయులును లోనికరిగిరి.

---

## పరియావప్రకరణము.

### కార్యశోధకుఁడు.

రామసముద్రము ఫీకరచిన్నదై యుండెను. కార్య మయినపాల పనులు లెట్లు? ఇన్నినాళ్లనుండియు నెవ్వరు నెప్పుడు వెదకనికాగిత ములకొఱ కిప్పుడు ధైర్యమువలనచే నెవ్వరో వెదకుకొనుచు రాఁగా వారి నీవిధముగాఁ జెండనాడుట మంచిపనియా? బాబు, ఇప్పుడే స్టేషను నుండి వచ్చెను. రాత్రివఱకు నుండును. స్టేషనుకు వెళ్ళి చూడవల యునా? ఇంతతొందరపడినను బాగుగ నుండదు. ఆయనతో మంచి తనముగా మాటలాడి స్నేహముకల్గించుకొనకపోవుటయే తప్పిదము. వారి నింటికి యాదరించి ప్రేమించి మర్యాద చూపఁజాలకపోయితిని. ఒక్కకాగితపుముక్కకొఱకు గర్వించుటచే నన్నియు మన్నైపోయినవి. ఇంక వారు వచ్చునట్లును దోఁచదు. కాగితము చదువవలసినయవసర మున్నట్లును దోఁచదు. ఆకాగితములలో నేమున్నది? నేను పక్కా ముక్కియారుపంగదా—'లా' బాగుగాఁ దెలిసినవాఁడనుగదా! పది మారులు ఆకాగితములను జదివి చూచితిని. ఆకాగితములలో నక్షర ములు పోలిక లేకుండ మాసిపోయినవి—చదువుటకేమియు బోధపడుట లేదు. దొడ్డమ్మ అందురు. ఆమె కెవ్వరో యీకాగితము లప్పగించి

యోజకీయము లని చెప్పి యున్నారు. అందుచే నామె యీశాస్త్రము క్కంఠియు జాగ్రత్తపఱచినది. ఆమెమాట విని నేనుకూడ నాపతమే చేసినాను. వీనివలన నేమో లాభించునని యాశపడినాను. ఇంతవఱకు దీనికొఱ కెవ్వరును రానులేదు. నాకు వృథాయాసము తప్పనులేదు. నేఁ డెవ్వరో యొకరు వానికొఱకుఁ గష్టపడి రాఁగా, నేను వారి ననాదరించి చేతఁ జిక్కినలక్ష్మిని గాలితోఁ దన్నుకొంటిని.

లోభియు, హీనస్వభావుఁడు నగురామచంద్రుఁడు లోలోన మిక్కిలి పరితాపపడఁజొచ్చెను. తన తెల్వితేటలను, విద్యాబుద్ధులను నూఱువిధముల నిందించుకొనఁజొచ్చెను. అతఁడింతవఱకును దనబోఁటి బుద్ధిశాలియైన మనుష్యుఁ డెక్కడఁ బుట్టఁబోఁడనియే యనుకొనుచుండెను. తనబుద్ధిపరితాపమువలనిబాధ యాతని కెప్పుడును గనఁబడలేదు. కాని నేఁడీవ్యాపారమువలన నాతఁడు తన్ను మూర్ఖాగ్రేసరునిగా నిశ్చయించుకొనియెను.

ఇప్పుడు చండి యాధారమై యున్నాఁడు. చండికి బాబుతోఁ జక్కఁగా మాటలాడఁగలపాటిపరిచయ మున్నది. ఇద్దఱు నొక్కమాఱుగానే వచ్చియున్నారు. ఒక్కమాఱుగానే కాశికిఁ బోవుటకుఁ బ్రయాణ మగుచున్నారు. చండి యేదేని నుపాయము చేసెనచో నీవ్యాపారము నొడ్డునకుఁ జేర్పఁగలఁడు. ఏచండి నాతఁడు పనికిమాలినవానినిగా నిరాదరించెనో, ఏచండి నొకనాఁడు బట్టెడన్నము పెట్టినను, నొకవస్త్రముగాని, యొకబసగాని యిచ్చియైన నెఱుంగఁడో, ఆచండి రామచంద్రున కిప్పు డాధారభూతుఁడు—పరమసహాయుఁడు—ఆత్మీయుఁడు నని భావించుకొనవలసివచ్చెను.

రామచంద్రుఁడు మరలఁ జండిని జూచి—“తమ్ముఁడా! బంధుఁడు నిన్ను విడిచిపెట్టి వెళ్లెఁనుగదా?” అని యడిగెను.

చండి—అట్లు జరుగదు. అతఁడుండకపోయిన నాతనికార్య మే కాదు.

రాము—సరియే. అట్లయిన నీవాతని నొక్కసారి పిలుచుకొని రావేమి? నేనైదువందలరూప్యము లడిగితి నని చెప్పి నీవెట్లయిన నా రూపాయీలను సంపాదింపుము. అదేమంచిపని. చూతుము. భోజన మైనతరువాత నీవొకమారు స్టేషనుకు వెళ్లుము. నేనును గచ్చేరీనుండి యాస్టేషనుకు వచ్చెదను. నేను నిన్నుఁ జూచియుఁ జూడనట్లుండెదను. నీవు నన్నుఁ జూచి అన్నా! అన్నా! యని పిలువుము. ఆతరువాత నిన్నుఁ జూచి "ఓహో, మీరింకను వెళ్లలేదా?" అని యడిగెదను. ఆతరువాత నీవు రూపాయీలసంగతియుఁ, గాగితములసంగతియుఁ గ్రమక్రమముగాఁ బ్రసంగించి వ్యవహారము నడుపుము.

చండి—మంచియాలోచనము చేసినావు. అన్నా! అందుకొఱకే నీకంతప్రసిద్ధి. నీవు చెప్పినవిధముగాఁ జేసినచో నిజముగాఁ బని జరుగఁగలదు. ఇఁక భయము లేదు.

తమ్ముని యీయాడింపుమాటలచే నన్న సంతుష్టుఁ డయ్యె ను. ఇంటిలోని కేఁగి రామచంద్రుఁడు తనభార్యను బిలిచి "ఇదిగో! చెప్పకో చూతము, మనయింటి కెవరు వచ్చినారో?" అనియెను.

చండి—వదినెగారూ! నన్నానవాలు పట్టలేదా? నేను చండిని.

వదినెగారు మిక్కిలి విరక్తురా లయ్యెను. ఈనిర్భాగ్యుఁడు వచ్చినాఁ డెందుకు? ఎవ్వరికైన నన్నము పెట్టుట యామెకు నియమ భంగము. ఈమందభాగ్యుఁ డిప్పు డొక్కపూటమైన భోజనము చే యకుండఁ బోనేపోఁడు. 'ఎవరూ రానక్కఱలేదు. నాకొకరిమీద దయ యు లేదు, నొకరిమీదఁ గోపము లేదు. నాయింటి కెవ్వరు రానక్క ఱలేదు.' అని యామె పలికెను.

ఇదివఱకు హరకుమారునివలన నుపదేశము పొందినప్రకారము గాఁ జండి యిప్పుడు తనజేబులో నుండి రెండురూపాయలు పైకిఁ దీసి తళతళలాడించి వంటయింట నున్నవదినెగారి చరణసన్నిధి నుంచి యామెకు నమస్కారము గావించెను.

వదినెగారిఁక మాటాడలేదు! అన్నములేనితనమఱఁదిగారిప్పుడు రెండురూప్యములు సమర్పించి తనపాదములకుఁ బ్రణమిల్లెను. ఆతనిపాదరక్షలు, ఆతనిపట్టుచొక్కా, ఆతనిపంచెలుఁ, దలపాగా, అన్నియుఁ జూచి యామె "వీఁడెట్లో భాగ్యవంతుఁ డయ్యె" నని యనుకొనియెను. కాళ్లతోను జేతితోను గదిపి, క్రిందనున్న రెండురూపాయిలుఁ దీసికొని, యామె చెంగున ముడిఁగట్టుకొనియెను. కాని చండి యంతటితో సంతుష్టుఁడు గాలేదు. జేబులోనుండి మఱిమూఁడురూపాయిలు పైకిఁ దీసి యాతఁడు—"వదినే, అమ్మాయి అబ్బాయి యెక్కడ నున్నారూ? వాండ్రకు సందేశములు కొనిపెట్టుము" అని యామూఁడురూపాయలుగూడ వదినెగారిసన్నిధి నుంచెను.

మరల మూఁడురూపాయలా! మరల నామూఁడురూపాయలు కూడ వదినెగారిచీరచెఱఁగునం దాశ్రయము కల్పించుకొనినవి. ఆమె యిప్పుడు—"చండీ, చాలనాళ్లకగపడినావు! కులాసాగానున్నావా? చిరకాలమునుండి, చండిపై సంసారభారముంచి నిశ్చింతిగా నుండవలెనని మేమిరువురముఁ గోరుకొనుచున్నామసుమా" అనియెను. మరల నామె "మఱఁదీ! ఎన్నాళ్లకుఁగనఁబడినావు! అయ్యో! నేఁడు నీకొఱకు మంచికూర లేమియు వండలేదు" అనియెను.

చండి—వదినే! సరిసరి. నాకొఱ కేమియుఁ జేయనక్కఱలేదు. కాశికిఁ బోవుచు నొకసారి పిల్లలను మిమ్ములను, అన్నగారిని జూచి పోవలయు నని యిట్లు వచ్చితిని. అన్నగారు బలవంతపెట్టి

ఈపూట ఆఁపివేసినారు. వండిన దేదియో యంతియే చాలును. వేగముగా భోజనము చేసి నేనిప్పుడే పోవలయును.

వదినె—సరిసరి. ఆలాగు వల్లగాదు. ఇన్నాళ్లకు వచ్చి నాలుగురోజులైన నుండకుండ వెళ్లుటయే? పిల్లలతో నాల్గురోజులు కులాసాగా నుండి తరువాత వెళ్లవచ్చును గాని యిప్పుడే పోఁగుదునను వెళ్లనీయను.

పిల్లయుఁ బిల్లవాఁడు నెక్కడనుండియో లోపలికి వచ్చి "అమ్మా! వంట నైనదా?" అని యడిగిరి.

అమ్మ వారిమాటకుఁ బ్రత్యుత్తర మీయకుండఁగనే చండినిఁజూచి "అదిగో మీ బాబయ్యగారు వచ్చినారు. వారికి ముందర నమస్కారము చేయుఁడు" అనియెను.

బాబయ్య యెవ్వరో వారెప్పుడు నెఱుఁగరు. బాబయ్యపేరైన వారెన్నఁడును విని యెఱుఁగరు. వారాశ్చర్యముతోఁ జండివంకఁ జూచుచు నిల్వఁబడిరి. చండి వారినాదరించి దగ్గఱగాఁ దీసికొనియెను. చిన్నబిడ్డను దొడపైఁ గూరుచుండఁబెట్టుకొనియెను. పెద్దబిడ్డచేయి పట్టుకొనియెను. ఇంచుకసేపటనుండి వారితో మాటలాడి యాతఁడు తరువాతఁ దనయన్నగారివద్ద కేగెను.

అన్నగారప్పుడే స్నానము చేసి మడిగట్టుకొనియెను. అప్పు డాతఁడు చండిని సమీపించి "తమ్ముఁడా, నీవు ప్రేమమునకు నెల్లమాట మఱచిపోవుచున్నావా! వెళ్లినచో బాబు నీవేళ ప్రయాణము కాకుండ నాఁపవచ్చును. ఆయనతో వ్యవహారము ప్రసంగించినచోఁ బదిరూపాయలసొమ్ము కన్నులఁ బడును. అందు కుపాయము చూడుము!" అనియెను.

చండి—అందుకొఱకు నీవు బెంగపెట్టుకొనకుము. అన్నా! నీకు

నాఁబడబ్బులు దొరకునప్పుడు నేనూరక పోనిచ్చెదనా?

చండికి స్నానము జేయుటయందుఁ జాలవైరాగ్యము; అతఁడు సేవించుపదార్థములకును స్నానమునకును అంతరంగికశత్రుత్వము కలదు. అతఁడు స్నానమువంకకుఁ బోలేదు. భోజనస్థానమునుండి వదినెగారు కేకవేసెను—“మఱఁదీ! మీయన్నగారిని దీసికొని భోజనమునకు రమ్ము” అని.

అన్నదమ్ములిద్దఱు నొకపంక్తిని గూరుచుండి భోజనములు చేయుచుండిరి. వారిజన్మలో నిదివఱకెప్పుడు నిట్టియదృష్టసంఘటనము కాలేదు. భోజనసదుపాయము చాల తక్కువగా నుండుటచే, వదినెగా రందులకు నానాకారణములను జెప్పుచు వడ్డన చేయుచుండెను. మఱఁదిగారికిఁ దగినవిందు చేయఁజాలనందు కష్ట[illegible] లామె యేకరువెట్టెను గాని వాని నన్నిఁటిని మనసున [illegible] చుకొనఁజొచ్చినచోఁ జాలకాలము పట్టును.

భోజనములైనతరువాత విలక్షణముగాఁ దంబాకు సేవించుకొనుచు రామచంద్రుఁడు కచ్చేరీవేషమును ధరించెను. వెళ్లఁబోవునప్పు డాతఁడు చండిని జూచి “తమ్ముఁడూ! నేను కచ్చేరిలోఁ బనియైనతరువాత స్టేషనునకు వచ్చెదను. సంగతులన్నియు మఱచిపోలేదుగాదా నీవు స్టేషనునకెప్పుడు వెళ్లెదవు?” అనియడిగెను.

చండి—నేనొక్కనిమిషము వెన్నువాల్చి లేచి నెమ్మదిగా స్టేషనునకు వెళ్లెదను. కాగితములకొఱ కాయన యిక్కడకే రాఁగలఁడు. నేనాయనకుఁ గాగితము లిప్పించి తీరెదను. ఆవిషయములో నీకేజోక్యము నక్కఱలేదన్నా!

అన్న నిశ్చింతగా “దుర్గా, దుర్గా” అనుచుఁ గచ్చేరికి సాగిపోయెను. కాని, చండి వెన్నువాల్చనేలేదు. అప్రయత్నమే నేయాలే

డు. అన్న కచ్చేరికి వెళ్లినతరువాత నాతఁ డింటిలోనికి వెళ్లెను. వెళ్లి చు "వదినెగారూ! భోజన మైనదా?" అని కేకవేసెను.

వదినె—ఆఁ. రెండుముద్దలు నోటవేసికొనినాను. నీకు మంచి తీర్థము కావలెనా?

చండి—మీదయ. మే మతిథులము. మీరేమి దయతోఁ బెట్టెదరో, అదియే మాకుఁ జాలును.

వదినె—అట్లనెద వేల? మఱఁదీ! నీవుమా కతిథివా? నీయిల్లు, నీసంసారము. నీవతిథి వెట్లగుదువు?

చండి—నామీఁద నీకెంతదయ యున్నదమ్మా! ఇన్నిదినములనుండి నేను దేశవిదేశములు తిరుగుచుండుటచే నెఱుఁగను గాని, మాయన్నగారికి రోజురాఁబడి యెంత, నీచేతిలో నేమైనఁ బదిరూపాయ లుంచినాఁడో లేదో చెప్పెదవా?

వదినె—అసంగతులు చెప్పి మరల నన్నేడిపింపకుమఱఁదీ! మీయన్నగా రెట్టిమనుష్యులో నీవెఱుఁగవా యేమి? రూపాయల మాట యటుండుము. ఒక్కరాగిపైసనైనను మీయన్నచేతితో నెప్పుడును నాకీయలేదు. మీయన్న కొకటియుండినఁగదా నాకిచ్చుట? కోఁజంతయు లంటాలు పడి భోజనమునకు దెచ్చుటయే చాలును.

చండి—ఈవిషయములో మాయన్నకు బొత్తుగా వివేకము లేదని చెప్పవచ్చును. నీవు గృహలక్ష్మివి—నీబోఁటివారు లక్షకుఁ గోటికి నొక్క రుందురు. నీకురోజు గడవకుండఁ జేయుట యాతనికన్యాయము. నిజము చెప్పఁబోయినచో మాయన్నయ్య యొకమాదిరిమనుష్యుఁడు సుమా! ఆతనిబుద్ధి యాతనికే బాగుగనున్నదిలెమ్ము.

వదినె—బుద్ధిమాటదాఁక పోనక్కఱలేదు. ఆముక్తిదారి యెట్లుచేయుచున్నారో వారికే తెలియవలెను. ఒక్కవ్యవహారములోను

డిస్నతనముు లేదు. ఒక్క వ్యవహారములోను జమాకర్చులు లేవు. అంతా మూర్ఖవ్యాపారమే.

చండి—బాగుగ చెప్పినావు వదినే? ఇప్పుడు నీకొకసంగతి చెప్పెదను విను. రామనగరపుదొడ్డమ్మ తనదగ్గఱదాఁచుచునుండుకాగితములకొఱకు నేఁడొకపెద్దమనుష్యుఁడు వెదకుకొనుచు వచ్చినాఁడు. ఇన్నాళ్లకు కాకాగితములయవసరము వచ్చినది గదా యని నేనాయనను అన్నగారియొద్దకుఁ దీసికొనివచ్చితిని. ఆయన, ఆకాగితములకు, అన్నయ్యకుఁ గొన్నిరూపాయ లిచ్చుటకుఁగూడ సమ్మతించినాఁడు; అయినను అన్న మాటలాడఁడు! విసిగివిసిగి యాపెద్దమనుష్యుఁడు వెళ్లిపోయినాఁడు. చూడు మాయున్నబుద్ధి! పాతతుక్కుకాగితములు పెట్టెలో మన్నైపోవుచున్నవి. అమట్టికి సొమ్ము వచ్చుచుండఁగాఁ బుచ్చుకొనుట లేదే? ఆపెద్దమనుష్యుఁడు వెళ్లిపోయినతరువాత నిప్పు డన్నయ్య, ఆతనిని దీసికొని వచ్చి కాగితము లిచ్చి, అడబ్బిప్పించుటకుఁ దగినయుపాయముఁ జూడుమని నన్ను బ్రతిమాలుచున్నాఁడు.

వదినె—అయ్యో అయ్యో! ఎంతదురదృష్టము! ఎంతనిర్భాగ్యత్వము! ఛీ-ఛీ-ఛీ, ఆకాగితములు పాతపెట్టెలో కట్టకట్టి పడియున్నవి. నేను వానిని చాలనాళ్లనుండి చూచుచున్నాను. ఉండుము అనీ! వానికి విరుగడ లేదా? నేను నీకాకాగితము లిప్పుడే తెచ్చియిచ్చెదను. నీవాపెద్దమనుష్యున కిచ్చి ఆసొమ్ము నాకుఁ దెచ్చి పెట్టలేవా?

చండి—తెచ్చిపెట్టలేకేమి? ఆయన సొమ్మిచ్చుటకు సమ్మతించియే యున్నాఁడు గాదా? అన్న యేమి కోపపడునో యనియే నాకు భయము.

వదినె—ఏమికోపము! ఆయనకేమియుఁ దెలియనే తెలియదులే.

చండి—తెలిసినచో, కచ్చేరినుండి వచ్చి కాగితములు వెదకి కొని కోపపడినచో, అప్పు డేమిచేసెదవు?

వదినె—తెలిసినఁ దెలియనిమ్ము. ఏమీ? సంసారము నాకు మాత్రి మక్కఱలేదా? ఏదో యుపాయమువలన నేనుమాత్రము రెం డుడబ్బులు జాగ్రత్తపెట్టఁగూడదా? నీవీపని యెట్లైనను జేసిపెట్టవలె ను. నాకు నాల్గుడబ్బు లెట్లయినను దెచ్చిపెట్టవలయును.

చండి—అది యొకగొప్పమాట కాదు. నిముసములోఁ దేఁగ లను. ఆపెద్దమనుష్యుఁ డిచ్చుటకు సిద్ధముగానే యున్నాఁడు. అది యును గాక నాయొద్దఁగూడ సొమ్మున్నది. కావలసినచో నీసొమ్ము నీకిచ్చి తరువాత నాయనవద్ద నేను మరల రాఁబట్టుకోఁగలను.

వదినె—మఱిదీ! ఇన్నాళ్లకు నీవు మాకు నిజమైనయాత్మీయుఁడ వని తెలిసినది. అయిన రమ్ము, ఇప్పుడే నీకాకాగితము లిచ్చెదను.

చండి—వదినే! మీకొఱకు నేనన్నియుఁ జేసెదను. ఏలాగున నైన నాల్గుడబ్బులు మీకు రావలయు ననియే నేను ప్రయత్నించుచు న్నాను. ఇది యొకయాశ్చర్యకరమైన మాటగాదు. ఎవ్వరియాత్మీ యులకొఱ కెవ్వరు తంటాలు పడరు? కాని, అన్నగారు కోపపడెదరో ఏమనెదరో యనిమాత్రము నాకు భయముగా నున్నది.

వదినె—నీవు చాల మంచివాఁడవు. ఆయన యేమైన ననిన నన్నవలయును; కోపపడినఁ నన్నుఁ గోపపడవలయును. నీవేమైనఁ గా గితములు దొంగతనము చేసితివా? నేను నీకు చేతులతోఁ గాగితము లిచ్చితిని. ఇందులో నీతప్పేమున్నది? నీవేమియు ననుకొనవద్దు.

చండి—అయినచో లెమ్ము.

వదినెగారు లేచి యింటిలోనికేఁగి యొక పాత ట్రింకుపెట్టెను

తీసి, యొకచిన్నకాగితపుకట్టఁజూచి యాకాగితములకట్టను దెచ్చి చండి చేతిలోఁ బెట్టి ,, ఏదీ! చదువుము చూతము. ఆకాగితములేమో" అనియెను.

చండి కష్టించి సృష్టించి యిట్లు చదువ మొదలుపెట్టెను. ,,కాశిలో నాకవితంతుపుత్త్రునకుఁ జెందవలసిన కాగితములు; శ్రీమతి గంగామణీదేవి దొడ్డమ్మగారిచే నీయఁబడినవి"

అతఁడు స్వర్గమెక్కిపోయెను. అతనియన్నగారు హారకుమార బాబే కాగితములకొఱకుఁ బిచ్చివాఁడై యిన్నినాళ్లనుండి యింతకష్టపడి తిరుగుచున్నాఁడో, ఆకాగితము లిప్పు డాతనిచేతికి దొరకినవి. ఆతఁ డిప్పుడు తనబోటిధన్యతముఁ డింక లేఁడని తెలిసికొనియెను. ఆనందముచే నాతనిదేహము కంపించిపోవుచుండెను. ఆతఁ డప్పుడు తన చేతిపెట్టెను దీసి దానిలోనుండి రెండునోట్లు పైకిఁదీసి వదినెగారిచేతిలోఁ బెట్టి ,, వదినా! ఇవి పుచ్చుకొనుము, నేనిప్పుడే మరల వచ్చెదను. అన్న వచ్చి వెదకునేమో యెవరెఱుఁగుదురు ?" అనియెను.

వదినె—ఆయన యిప్పుడు రారు. నీవు వెళ్లి వెంటనే రమ్మ.

చండి యత్యాతురతతో బయలుదేఱెను. అతఁడు నడచుచు ,, వదినెగారిదయవలనఁ గాగితములు సరిగానున్నవి" అనుకొనఁజొచ్చెను.

వదినెయు, నొక్కమాఱుగా నిరువదిరూపాయలు తనచేతిలోఁ బడినందుల కానంద మొందుచు వానికి పెట్టెలోఁ బెట్టికొని తాళము వేసికొనియెను.

ఎట్లో తొందరగాఁ గచ్చేరి పనులు చాలించుకొని రామచంద్రుఁడు స్టేషనువంకకుఁ బరుగెత్తి వెళ్లెను. [illegible] బండిగాని, బాబుగాని యాతనికిఁ గానుపింపనేలేదు. నాల్గుదిక్కులు వెదకఁజొచ్చె

ను. ఎక్కడను నెవ్వరు గనఁబడలేదు. అప్పు డాతఁడు రెండుచేతులతోఁ దనతలను మొత్తుకొనఁజొచ్చెను—తనయదృష్టమును నిందించుకొనఁ జొచ్చెను. అటుపిమ్మటఁగూడ నాతఁడు వెదకుట మానలేదు. దుకాణము లొక్కొక్కటే వెదకఁజొచ్చెను. చిట్టచివర కాదుకాణదారుఁ డాతనిజూచి "ఒకపెద్దమనుష్యుఁడు చాలసేపు నాదుకాణములోఁ గూరుచుండెను. ఫలాహారము చేసెను. ఆతరువాత నింకొకఁడు వచ్చి యాయనతో మాటలాడెను. పిమ్మట వారిరువురును గలిసి స్టేషనునకు వెళ్లిపోయిరి. వారు మరలఁ దిరిగి రాలేదు. తెలిసినదా, వారు వెళ్లిపోయిరి." అని చెప్పెను.

---

# దశమఖండము—స్వర్గము.




## మొదటిప్రకరణము.

### అసావధానత.

నేఁడు జన్మాష్టమి. ఏపుణ్యస్వరూపుఁడైన నారాయణుఁడు, ఈపాపతాపపరిపూర్ణమైన వసుంధరయం దవతరించి తనసంపూర్ణలీలను బ్రకాశింపఁజేసెనో, యెవ్వనియూహాజాల మదుఃఖతాపహమును, నిర్దోషమును సర్వాంగసుందరము నై యొప్పెనో, ఎవ్వఁడు మానవలోకమునం దుత్కృష్టధర్మమార్గమును జూపించుటకుఁ దాను స్వయముగా మానవుఁడై మానవవ్యవహారమున కధీనుఁడై జగమునందు సన్మార్గమున కత్యుజ్జ్వలదృష్టాంతమును సంస్థాపనము గావించెనో, ఎవ్వనిలీలలు చిరనూతనములును, అనంతరసమయములును, అజస్రప్రేమపూర్ణములును నైనవో, ఎవ్వఁ డీజగతిలోఁ బాపాత్ములకుఁదక్క మఱియెవ్వరికి నవజ్ఞ గావించియెఱుఁగఁడో, భార్యాపుత్రులు మొదలగు నెల్లరకు నెవ్వఁడు సమానమైన ముక్తిస్వరూపపరమపథమును జూపించెనో, ఎవ్వఁడు లోకహితముకొఱకు సకలకార్యసంపాదనము గావించెనో, ఎవ్వరిస్వార్థబుద్ధి కేవలపరార్థపర్యవసానము గలదయ్యెనో, శుద్ధనైతికమనుమానదండము, లేక మానవునిసామాన్యజ్ఞాన మను తులాయంత్రము, ఎవ్వనిమహామహిమమయ మగు కీర్తిశైలమును దాఁపినంతనే మటుమాయము లగుచుండెనో, ఎవ్వఁడు నిందాస్తుతులకుఁ దిరస్కార

పురస్కారములకుఁ జలింపక తనశుభసంకల్పపూర్ణములైన సత్కర్మస మూహములఁ గావించివేసెనో, ఎవ్వనిహృదయమందు నిల్చుకొనఁగల్గి నారు లేక యెవ్వనికీర్తిపర్వతమునం దొకభాగమైన దర్శింపఁగల్గినను మానవుఁడు చిరధన్యుఁడుఁ, గృతకృత్యుఁడుఁ గాఁగలుగుచున్నాఁడో, ఆవ్రజకిశోరమూర్తి, ఆశ్యామసుందరనటకుఁడు, ఆరాధికాహృదయరంజకనారాయణుఁడు, ద్వాపరయుగావసానమునఁ గలియుగప్రారంభమున నీపుణ్యతిథియందుఁ గంసకారాగారమున నావిర్భూతుఁ డయ్యెను. ఈ పవిత్రతిథి పుణ్యభూమియైన భారతవర్షమునందు మహోత్సవదినము. పిల్లలుఁ, పెద్దలు, స్త్రీలుఁ, పురుషులు, శాక్తేయులు, వైష్ణవులు నందఱు నేఁడు మహోత్సవమత్తులై యుండిరి. నృత్యగీతములతోను, వాద్యోత్సవములతోను, హరిద్రాక్షతాఫలపుష్పదధిఘృతాదులతోను, భోజనోపవాసములతోను, వ్రతకథాశ్రవణభగవత్పూజాదులతోను నేఁడు భారతభూమి మహోత్సవమయమై యుండెను. మనము ధన్యులము. ఆ నందనందనుని, ఆ వేణుగానలోలుని, ఆ మధుసూదనుని మధురమధురనామము నుచ్చరింపఁజాలిన యీపుణ్యదేశమున మనము మానవులమై జన్మింపఁగంటిమి. అతని ధ్వజవజ్రాంకుశచిహ్నితములైన పాదపద్మములచేఁ ద్రొక్కఁబడిన యీభవ్యదేశపవిత్రరజము మనదేహముల నలంకరించుచున్నది! జయజగన్నాథజనార్దనా! జయ సచ్చిదానందపురుషోత్తమా!

నేఁడు నీలరత్నబాబుమందిరమునఁ బూజ జరుగుచున్నది; రాత్రి జాగరణము, కొందఱకు భోజనములుఁ, గొందఱ కుపవాసములు, భిక్షాదానవస్త్రదానాదులు జరుగును. సాయంకాలమునుండి యుమాశంకరుఁ డుండుటచేఁ గలిసి యుత్సవాదులకు సహాయము, హరినామ సంకీర్తనము మున్నగునవి చేయు ననికూడఁ జెప్పుకొనుచుండిరి. అతఁ

తు, చాలవఱకుఁ గార్యభారమును వహించి, హృదయపూర్వకముగా, నిరవిశ్రాంతమును సాంతముచేయుటకు నీలరత్నబాబు ననుష్ఠానముల లో సహాయపడు నిమిత్తము ఘనానందస్వామిచే ననుజ్ఞాతుఁ డయ్యెను. వేకువజాముననే నీలరత్నబాబును నాతనిభార్యయు సోదరియు గంగా స్నానమునకు వెడలియుండిరి. అన్నపూర్ణ యొక్కతెయె మాత్రమింటివద్ద నున్నది. ఆమె యొకగదిలో శ్రీరాధాకృష్ణమూర్తిపటము నెదుటఁ దనచేలాంచలమును జెవరికుంత బిగియఁగట్టుకొని, సజలనయనయై, కృతాంజలిపుటయై కూరుచుండి యుండెను.

ఈయుత్సవసందర్భములోఁ గొందఱు పరమహంసలకు భోజనము పెట్టవలయు నని నీలరత్నబాబునకుఁ గోరిక గలిగెను. అందుచే వారి నాహ్వానముచేయుకార్యభార మాతఁడు ఉమాశంకరునిపైఁ బెట్టి యుండెను. ఎనమండుగురుసన్యాసులు నేఁటిమధ్యాహ్నము నీలరత్న బాబు గృహములో భిక్షచేయుటకు సమ్మతించిరి. ఈసంగతి నీలరత్న బాబుతోఁ జెప్పుటకై యుమాశంకరుఁ డుదయముననే నీలరత్నబాబు మందిరమునకు వచ్చెను. అతఁ డంతఃపురములోనికిఁ బోవుట కభ్యంతర మేమియు లేదు. దాసదాసీజను లందఱు నమస్కారములు గావించి నిల్వఁబడిరి. ఎవ్వరు నేమియు మాటాడలేదు. “అమ్మా! యెక్కడ నున్నారూ?” అని యుమాశంకరుఁడు లోపల కేగి పిలిచెను. ఎక్కడ నెవ్వరును లేరు. ఎవ్వరుఁ బ్రత్యుత్తర మీయలేదు. అన్నపూర్ణ కంఠ మేమియు వినఁబడనేలేదు.

ఉమాశంకరుఁ డొకయింటిలో నుండి యింకొక యింటిలోనికిఁ బోవుచుఁ గ్రమముగా నన్నపూర్ణ యేకాగ్రచిత్తముతో శ్రీకృష్ణునియుగళరూపమును సందర్శించుచున్న గదిలోనికి వచ్చెను. అతఁడు ద్వారమువద్ద నిలిచియుండియే యాబాలికామణి భక్తిసంప్లుతము నలౌకిక

శోభాసంయుక్తము నగు రూపరాశిని సందర్శింపఁజొచ్చెను. అప్పు డా తనిమనస్సులో శివమనోమోహినియైన శాంకరి తపోనిష్ఠయం దుండి తనకుఁ బ్రత్యక్షమైనట్లు తోఁచెను. అప్పు డాతఁ డేక దూరముగా నుండఁజాలక సంపూర్ణచిత్తముతో నడుగులు చప్పుడు గాకుండ నడచి వచ్చి యామెను సమీపించి యాశ్చర్యమగ్నుఁడై యాభక్తిమయదేవి మూర్తిని దదేకదృష్టితో దృష్టింపఁజొచ్చెను. యోగనిమగ్నయై యున్న యన్నపూర్ణభావములనుగూర్చి యాతఁ డెంతవఱకు నాలోచింపఁ జొచ్చెనో, యంతవఱకు నామెభావము లాతనికి బోధపడుచుండెను. అపరిమితపుణ్యఫలముచే నేఁ డాతనికి సాక్షాద్దేవీదర్శనము సంఘటిల్లినట్లు తోఁచెను; భక్తిప్రేమలచే నాతనిదేహ మంతయుఁ బులకాంకురితమైపోయెను. నయనము లానందాశ్రుపరిపూరితములై పోయెను. ఆతఁడు నీరవుఁడై నిష్పందభావముతో నిల్వఁబడిపోయెను.

ఆకస్మికముగా నన్నపూర్ణదృష్టి విచలితమయ్యెను. పటము నెదుటనుండి యామెదృష్టు లితరదిక్కునకు మరలక మునుపే యామెదృష్టిపథమునం దుమాశంకరుని దివ్యకాంతులు ప్రత్యక్షము లయ్యెను. అప్పు డామె చకితురాలై విస్మితభావముతోఁ దనశిరము ధరాతలమునకుఁ దాఁకునట్లు వంగి, యాదేవతాచరణములకుఁ బ్రణామము గావించి, యత్యాతురభావముతో నిట్లు పలికెను. "నాదేవుఁ డిప్పుడు నిజముగా నున్నాఁడు. నాసాధన యంతయు ధన్యమై తోడనే సిద్ధించినది! ఏదేవుని చరణములను ధ్యానించుచు నాకస్మికముగా సాక్షాత్కారమును బొందితినో, యాదేవునిదయనుండి నే నిఁక నెప్పుడును వంచితురాలను గాను."

నోటినుండి మాట లీవలఁబడిపోయెను. కాని, చాల పెద్దమాటలు మాటాడినది; ఇట్టిమాటలు మఱియొకప్పు డాబాలిక చెప్పఁజా

లియుండదు. భక్తిప్రేమములు హృదయపరిపూర్ణములై యుండెను. ఆకాంక్షచేతను నాశచేతను నంతఃకరణ ముద్వేలితమై యుండెను. ఇట్టి స్థితిలో నకస్మాత్తుగా నిష్టదేవతాసాక్షాత్కారము సంఘటిల్లెను. ప్రాణ మంతయు నెవ్వరిని గోరుచుండెనో, పటమునందలి దేవతామూర్తిలో నర్వత్ర మెవ్వరిని జూచుచుండెనో, వారి నెట్టియెదుటఁ జూడఁగల్గుటచే నోటనుండి యప్రయత్నముగా ననేకవాక్యము లీవలఁ బడిపోయెను. హృదయ మప్పుడు లౌకికనిబంధనల కధీనమై యుండలేదు. మాటలు రాకుండ నాఁపుట కప్పుడు సామర్థ్యమును లేదు. అందుచేతనే యిన్నిమాట లీవలఁ బడిపోయెను. కాని యాతరువాతనో? ఆతరువాత దారుణలజ్జ యావేశించి హృదయప్రాణములపై నధికారముచేయఁ జొచ్చెను. వదనమండల మంతయు రక్తమయమైపోయెను. దేహలత కంపించుచుండెను. సిగ్గుచే భూగర్భములోఁ దూఱిపోవలయు నని కోరి కప్పుట్టుచుండెను. స్థూలములైన ఘర్మబిందువులు లలాటమున ముక్తాఫలములవలె నావిర్భవించెను. సుందరీమణి నిశ్చేష్టయై యధోవదనయై నిల్వఁబడిపోయెను.

మఱి యుమాశంకరుఁడో? ఉమాశంకరుఁ డిట్లని భావించుకొనఁజొచ్చెను. "ఇట్టిమాట వినఁగల్గితినేమి? నిజముగా నీరాజనందిని, యీసుందరీశిరోమణి, యీనవీన నన్నుఁగూర్చి చింతించుచున్నదా? నిజముగా నే నీమెదేవతామూర్తినా? కాదు—కాదు. ఈయధముఁ డీమెకు దాసుఁ డగుటకుఁగూడఁ దగనివాఁడు." అని తన్నుఁ దాను శతధిక్కారములు గావించుకొని తనయనుమానహృదయమును దాను నిందించుకొనఁజొచ్చెను. "నవ్యాపిపాలితుఁడను, ఆశ్రయవిహీనుఁడను, భిక్షోపజీవిని, పితృమాతృహీనసన్యాసిని నైననాకిట్టియాలోచనము లజ్జాజనకమును, నసంగతమును. నిజముగా నేను వినుటలోనే పొరప

ము సంభవించెను. సుందరీమణి తనయభీష్టదేవతనుగూర్చి యూమకొనినమాట అన్నియు విని, నేనవి యన్నియు నన్నుఁగూర్చియే యని భావించుకొననేల? ఛీ, నే నెంతయు నిందనీయుఁడను" అని యాతఁడూహించుకొనఁజొచ్చెను.

ఉమాశంకరా! నీవు మహాపురుషునిశిష్యుఁడవును, సాధుగణసంసర్గపాలితుఁడవును; నిజముగా నీజ్ఞానగౌరవము లపరిమితములయ్యును నేఁడీస్థలమున నీవిట్లు మిక్కిలి విభ్రాంతిలోఁ బడిపోయితివి. నీ బోఁటినిర్మలస్వభావుఁడును, శాస్త్రార్థవేదియు, సంయతచిత్తుఁడును, జితేంద్రియుఁడు నైన మహాపురుషుని కిట్టిభ్రాంతి కల్గుట చూడఁగా మేము నవ్వనాఁపుకొనఁజాలకున్నాము. నీవు స్వయముగా నీనవీనురాలిప్రేమసీరములో నాకంఠనిమగ్నుఁడ వైతివి. ఈసుందరీమణియు, నీప్రేమశైలమున నత్యున్నతశిఖరము నారోహించెను. ఈకనఁబడుచున్న సత్యమును నీవు చూచియుఁ జూడకున్నావు; తెలిసియుఁ దెలియకున్నావు. ఇది నిజముగా నత్యంతకౌతుకావహము. నీవెంతగా నీప్రేమలతాబంధనములు ఛేదించుకొనుటకుఁ బ్రయాసపడియెదవో, అంతగా నివి నిన్నవి చుట్టుకొని బంధించివేయఁగలవు. నీవు వీని నెంతగాఁ ద్రోసివేయఁజూచెదవో, యంతకంటె నధికముగా నీహృదయమునందలి స్థాయీరూపముగా నుండఁగలవు. పంకములోఁబడిన వ్యక్తి పైకి లేచుట కెంతబలవంతముగాఁ బ్రయత్నము చేసిన, నంత యధికతరముగాఁ దత్పాదద్వయము నిమగ్నమైపోవును. నీప్రస్తుతస్థితి యిట్లున్నది. నీ వేసముద్రము నీఁదిపోఁజూచుచున్నావో, యాసముద్రములో మునిఁగిపోఁగల వని మే మూహించుచున్నాము.

అన్నపూర్ణ యీగదిలో నుండఁగాఁ జూచినప్పుడు, ఉమాశంకరుఁడు నన్యాసులభోజనముసంగతి చెప్పవలయు నని యనుకొనెను.

కాని, యిప్పు డిఁక నేమియు నాతనిమనస్సులో లేదు. కానిచో నిట్లు నిశ్శబ్దముగా నామెయెదుట నిల్వఁబడి యుండఁడు. ఏమిమాటాడవలయునో యాతనికిఁ దెలియుట లేదు. భాషలో శబ్దములు లేవా యేమి? అతికష్టముపై సాహసముతో నాతఁడు “ నీవు స్వర్గకన్యవు, నిన్ను నిరంతరముఁ జింతించుచుండినచో స్వర్గసుఖము లభించు నని తోఁచుచున్నది ” అనెను.

అన్న—నేను వెళ్లిపోయెదను. నాకుఁ బనియున్నది. మీరు కూర్చుండుఁడు.

ఉమా—ఉండను. నేనును వెడలిపోయెదను. మరల వచ్చెదను.

మెల్లమెల్లఁగా నన్నపూర్ణ వెడలిపోయెను. ఉమాశంకరునికన్నుల కీవిశ్వసంసార మంధకారమైపోయెను. ఆతఁ డొకదీర్ఘనిశ్వాసమును విడిచి యచ్చటనుండి బయలుదేఱెను. అప్పు డాతనికి సన్యాసిగణము భోజనములసంగతి జ్ఞప్తికి వచ్చెను. అవసరమైన యామాటను, అన్నపూర్ణకు ముఖ్యముగా జెప్పవలెను. అన్నపూర్ణ యప్పుడే యాతనిదృష్టిపథమునుండి దాఁటిపోయెను. తోఁచనిచిత్తముతో నుమాశంకరుఁ డీవలకు వచ్చెను. మరల నన్నపూర్ణాదేవిస్వర్గకాంతి యాతనికన్నులఁ బడియెను. అన్నపూర్ణ గదినుండి విస్తారదూరము వచ్చియుండలేదు. వెళ్లిపోవుటకుముం దింకొక్కమా ఱుమాశంకరునిఁ జూడవలయు ననుకోర్కెను దాఁటి యామె వెళ్లలేకపోయెను. అందుచే నామె గదిదాఁటి యీవలకు వచ్చి మెల్లమెల్లఁగా నడుగు లిడుచుండెను.

ఆమెను జూడఁగానే యుమాశంకరుఁ డించుకసే పనిమేషలోచనములతో నామె సౌందర్యసుధను గ్రోలఁజొచ్చెను. అన్నపూర్ణ మరల నిల్వఁబడియెను. ఉమాశంకరునిలోచనము లరమోడ్పులయ్యెను.

ఆనఁ డన్నపూర్ణతో— “నిన్నుఁ జూచి—కాదు, కాదు. ముఖ్యమైనసంగతి యొకటి చెప్పుట మఱచిపోయినాను. నీవు దయయుంచి బాబుతోఁ జెప్పవలయును.” అనెను.

అన్నపూర్ణ తలవంచుకొని తనసమ్మతిని సూచించుచుఁ దలయూఁచెను. ఉమాశంకరుఁడు సన్యాసిగణము భోజనములసంగతి యన్నపూర్ణ కెఱింగించి వెడలిపోయెను. ఆసందర్భములో నొకరికన్నులొకరికన్నులలోఁ గలిసిపోయెను. ఆభయముచే వారొండొరులను తిరిగి చూచుకొనుటకు సాహసింపలేకపోయిరి.

---

## రెండవప్రకరణము.



### జగన్మాత.

ఉమాశంకరుఁడు మిక్కిలి తహతహఁ జెందుచు మెల్లమెల్లఁగా నాశ్రమమునకు వచ్చెను. గురుదేవుఁడైన ఘనానందుఁ డప్పుడు యోగనిమగ్నుఁడై యుండెను. దూరమునందుండియే యాతనికిఁ బ్రణామము గావించి, యుమాశంకరుఁడు భిక్షాటనమునకు బయలుదేఱుట కుద్దేశించెను. కుటీరములోని కేఁగి యాతఁడు తనజోలెను. రుద్రాక్షశిరోవేష్టనమును దీసికొనియెను.

ఆకస్మికముగా వీణానాదమధురమైన ధ్వనితో నొకమాట యాతనిచెవులఁ బడియెను—“బాబా! యీప్రపంచములో నన్నియు సంభవింపఁగలవు. నీకోర్కి సిద్ధింపఁగలదు” అనియెను.

సవిస్మయుఁడై యుమాశంకరుఁడు తిరిగిచూచెను, ఆతనియెట్ట

యెదుట సౌదామనీవినిర్మితదేహమూర్తి! ఆమూర్తి యోగేశ్వరియే. అతులితానందముతో నుమాశంకరుని హృదయము మనస్సుం బరిపూర్ణములై పోయెను. ఆతఁడు భక్తిభావముతోఁ బ్రణామము గావించి యిట్లనియెను—“ ఇన్నిదినములైన తరువాత నీయధమసంతానమున కిప్పుడు దర్శన మొసఁగితివా, అమ్మా! ఇంత కఠినురాలైన జనని నింక నెక్కడను జూడఁబోను ”

యోగేశ్వరి ముందునకు వచ్చి సస్నేహముగా నుమాశంకరుని మస్తకమునందు హస్తముంచి యాతనిముఖమువంకఁ జూచుచుఁ జూచుచు “ కాదు బాబా! నిష్ఠురజనని నైనచో నిట్టిదేవసంతానము కలుగునా ? ” అనియెను.

ఉమా—అమ్మా! యీప్రపంచములో నాకిం కెవ్వరును లేరు. నిన్నుఁ గాంచియే నేను దల్లిని గాంచఁగంటిని. మాతృభక్తి నేర్చుకొంటిని. మాతృస్నేహసుఖ మనుభవించుచుంటిని. ఎప్పు డెక్కడ నెట్టికష్టము కల్గినను, అప్పుడే యమ్మానిన్నుఁ దలఁచుకొనుచుందును. నీయొడిలోఁ బడిన సకలదుఃఖములకు శాంతికాఁగల దని యనుకొనుచుందును. నాతల్లివిగదా, అమ్మా! సదా నీవు నాదగ్గఱ నుండవేమి?

యోగే—నేఁడు నీమనస్సులో ననేకములగు తలంపులు కలిగెను. అందుచేతనే నేను వచ్చియుంటిని. నీమనస్సులో నెట్టిదుఃఖము గాని, చింతగాని యెప్పుడు సంభవించునో, అప్పుడే నేను నీదగ్గఱకు వచ్చుచుందును బాబా!

ఉమాశంకరుఁ డించుకసేపు సవిస్మయుఁడై యాదేవి యలౌకికశక్తినిగూర్చి యాలోచించుకొనియెను. నిజముగా నేఁ డాతనిచిత్తములో నొక గురుతరమైన చింత గల్గిన దని యాతఁ డెఱుఁగును. ఆతఁ

డు—అమ్మా! లేదు. నేను నాకు నూతనమైన చింత యేదియుఁ గలుగలేదు. ఎఱుఁగను గాని, యేపాపముచేసెనో కొన్నిదినములనుండి యసంగతమైన యొకచింత నన్ను బాధించుచున్నది. ఆచింతయే నేఁడును గాదు.

యోగే—ఆచింతయే మఱియొక స్వర్గకన్యకనుగూడఁ బట్టి బాధించుచున్నది. కష్టములో భాగము పంచుకొనువారు కలిగినప్పుడు దాని కాఠిన్యము పోఁగలదు. నీచింత నిజముగా నసహనీయము గాదు.

అక్కడనే మృగచర్మముపై నుమాశంకరుఁడు కూరుచుండియుండెను. అతఁ డప్పుడు—"అమ్మా! నీమాట లెప్పుడు నసత్యములు గావు. ఇం కొకబాలిక నావలెనే చింతాకులితయై యున్నదని నేనను మానించియుంటిని. ఇప్పుడు నాయనుమానము సత్యమైనదే యని తెలిసికొంటిని. కాని, అమ్మా! నేను గఠోరహృదయుఁడనైన సన్యాసిని; ఈయసంగత చింతాక్రమణమునుండి ముక్తుఁడనైనను గాఁగలను. కాని, కోమలప్రాణమైన యాస్వర్గకన్య యీయసంగతచింత కాశ్రయ మిచ్చుటచే ముందుముం దపరిమితదుఃఖముల ననుభవింపవలసి యుండునుగదా! ఈసంగతియే నన్ను మిక్కిలి వ్యాకులపెట్టుచున్నది. అమ్మా! అమ్మా! నే నేమైనను సరియేగాని, యామె చిత్తసీమనుండి యీచింత యంతరించుట కుపాయములేదా?" అనియెను.

అప్పు డుమాశంకరునిదగ్గఱకు వచ్చి యోగేశ్వరీదేవి యాతని మృగచర్మముపై నొకప్రక్కను గూర్చుండి యాతనిమస్తకమును దన యుదరములోఁ జేర్చికొని యిట్లు చెప్పెను. లేదు బాబా! ఈచింత వినుచుటచేఁ బ్రయోజన మేమియు లేదు. ఎవ్వరు జేసిన మనోవ్యా

కార్యములనే చింతసేయుదురో వారు దానినే పొందుదురు. నీకే మియు భయము లేదు. నేనిమాట నీమనోరథసిద్ధి చూడవలెండ నేదూరదేశమునకును బోను.

అప్పు డుమాశంకరుఁ డత్యంతభక్తితో నమ్మపాదరజమును ఈ నశిరమున ధరించుకొనియెను. "అమ్మా! నే నింక భిక్షకుఁ బోయిన త్తువా?" అని యడిగెను.

యోగే—వలదు. నేఁడు నీకు భిక్షాటనమునకుఁ బోనక్కఱ లేదు—నేఁడు నీవు వ్రత మాచరింపుము. భోజనముచేయవలదు. మీ తండ్రికి నేఁడు వ్రతమేమియు లేదు. వారికిఁ గొంచెము భోజనము కా వలసినమాట నిజమే. దానిని నేను సంగ్రహించి యుంచెదను. ఇఁక నేను నీతండ్రి యేయేస్థలములం దిరుగాడు చుండునో, యాయాస్థల ములందలి ధూళిని భుజించి ప్రాణములను రక్షించుకొను చుండఁగల ను. నీవు నాయొడిలోఁ దలయుంచుకొని శయనింపుము. నేను బిడ్డ నొడిలోఁ బెట్టుకొని సుఖింతును.

అప్పు డుమాశంకరుఁడు దేవితొడపై మస్తక ముంచి శయనిం చెను. యోగేశ్వరి కన్నులు మూసికొని ప్రేమతో బిడ్డమస్తకము దన చేతితో నిమురఁజొచ్చెను. ఓహో! ఏమి యలౌకికశోభ! ఏమి య పార్థివాభినయము! పీనోన్నతవిశాలవక్షమైన యాదేవి యుదరదేశము నందలివస్త్ర మంతయు నప్పుడు తడిసిపోయెను. అవిరళధారలతో క్షీ రరాశి ప్రవహించుచు నామెవస్త్రమును, నక్కడి భూప్రదేశమును గూడఁ దడిపివేయఁ జొచ్చెను.

ఈసమయమునందు మునానందస్వామి కుటీరములోనికి వచ్చి యాదేవి యమానుషలీలలను జూచుచు విస్మితుండై పోయెను. ఆ ప్రేమస్నేహాప్రభృతుల ప్రాబల్యమునే నానందగా...

కితనై పోయెను. అప్పుడాగఁడు కృతాంజలిపుటుఁడై నిల్వఁబడి భక్తి గద్గదకంఠముతో నిట్లు స్తోత్రము గావింపఁజొచ్చెను.

"ఆధారభూతా జగత స్త్వ మేకా
మహీస్వరూపేణ యతః స్థితాసి
అపాం స్వరూపస్థితయా త్వయై త
దాప్యాయతే కృత్స్న మలంఘ్య వీర్యే
త్వం వైష్ణవీశక్తి రనంతవీర్యా
విశ్వస్య బీజం పరమాసి మాయా
సమ్మోహితం దేవి సమస్త మేతత్
త్వం వై ప్రసన్నా భువి ముక్తిహేతుః
విద్యాః సమస్తా స్తవ దేవి భేదాః
స్త్రియః సమస్తాః సకలా జగత్సు
త్వ యైకయా పూరిత మవ్య యైతత్
కా తే స్తుతిః స్తవ్య పరాపరోక్తిః.
సర్వభూతా యదా దేవీ స్వర్గముక్తిప్రదాయినీ
త్వం స్తుతా స్తుతయే కావా భవంతు పరమోక్తయః
సర్వస్య బుద్ధిరూపేణ జనస్య హృది సంస్థితే
స్వర్గాపవర్గదే దేవి నారాయణి నమోస్తుతే
కలా కాష్ఠాదిరూపేణ పరిణామప్రదాయినీ
విశ్వస్యోపరతౌ శక్తే నారాయణి నమోస్తుతే
సర్వమంగలమాంగల్యే శివే సర్వార్థసాధికే
శరణ్యే త్ర్యంబకే గౌరి నారాయణి నమోస్తుతే
సృష్టిస్థితివినాశానాం శక్తిభూతే సనాతనీ
గుణాశ్రయే గుణమయే నారాయణి నమోస్తుతే

శరణాగత దీనార్త పరిత్రాణపరాయణే
సర్వస్యార్తిహరే దేవి నారాయణి నమోస్తుతే.
(మార్కండేయచండి.)

ఘనానందస్వామి స్తోత్రపాఠములు ముగియఁగానే యోగేశ్వరి కన్నులు విప్పి యిట్లనియెను—“నారాయణసమ్ముఖే! నే నింతకాల మునుండియు నీకొఱకుఁ బ్రపంచపాలనము చేయుచుంటిని. కాని యిది నాకార్యమా? నీపని నీవే చేసికొనుము. నేను నీలీలలఁ గాంచి ధన్యురాల నగుదును.”

ఆతరువాత యోగేశ్వరి యుమాశంకరుని జూచి యిట్లు పలికెను—“నాయనా సౌమ్యా! ఈవిశ్వసంసార మెవ్వరి నాశ్రయించుకొని యున్నదో, నీవును నేనును సకలమును బరమాణువులవలె నెవ్వరిచరణతలము నంటుకొని యున్నారమో, ఎవ్వనికి భార్యాపుత్త్రులుఁ దల్లిదండ్రులు సర్వము సమానమో యాసనాతన పరమపురుషుఁడు మన సమ్ముఖమునకు వచ్చియున్నాఁడు. నీవాతనిసన్నిధికిఁ బొమ్ము బాబా!

ఉమాశంకరుఁడు లేచి నిల్వఁబడియెను. యోగేశ్వరి యక్కడ భూరజములోఁ బడి ఘనానందునకుఁ బ్రణామము లాచరించెను. ఉమాశంకరుఁ డప్పుడు ఘనానందుని జూచి—“తండ్రీ! నేనింతవఱకును విశ్వజననియైన పరాశక్తియొడిలోఁ జేరి యుంటిని. ఇది కల్పనాకథ గాదు. అనుమానమును గాదు. సకలజగజ్జననియిత్రియైన దేవి నన్ను స్వయముగాఁ దనయొడిలోఁ జేర్చికొనినది. నేను ధన్యుఁడ నైతిని. నా శాఁకలియు దప్పికయుఁ దీఱిపోయినవి. నాకోరిక లన్నియు ఫలించినవి. అలౌకికశాంతిచే నాహృదయము పరిపూర్ణమైపోయినది.” అని పలికెను.

ఘనా—వత్సా! నీమాట యొక్కటియు నసత్యము గాదు.

అనన్యాశ్రితపూర్ణముచే మనము పరమేశ్వరీసాక్షాత్కారమును బొందితిమి. ఈమె యొకచోట స్త్రీ, ఇంకొకచోట బురుషుండు, మఱి యొకచోట జనని, వేఱొకచోట జనకుండు, ఇంక నొకచోట సోదరుండు, నొకపతి సహధర్మిణి, ఒకయెడ బ్రహ్మణుండు, నొకచోటం జండాలుండు, నొకపరి యేనుంగు, నొకమాఱు దోమ, ఒకటూరి హిమాద్రి, ఒకసారి యిసుకరేణువు, ఒకవేళ సరిత్పతి, ఒకనాండు ఘటవారియునై ధరణియందంతటను విరాజిల్లుచుండెను. అమర, సనాతని, ప్రకృతిరూప, జగాతీత, జగన్మయి, చిన్మయియును నైన యీదేవి సాక్షాత్కారము లభించినది. రమ్ము కుమారా! గురుశిష్యలిరువురము సమస్వరముతో శ్రౌతమంత్రములచే నీదేవీమాహాత్మ్యమును గీర్తనమొనరించి జన్మపావనము గావించుకొందము.

అప్పుడు గురుశిష్యు లుభయులును మనోహరసమస్వరముతో వేదమంత్రములను గానము చేయం జొచ్చిరి.

" సహస్రశీర్షాః పురుషః, సహస్రాక్షః సహస్రపాత్
సభూమిం సర్వతో వృత్వా, అత్యతిష్ఠ ద్దశాంగులమ్॥
పురుష ఏవేదం సర్వం, యద్భూతం యచ్చ భవ్యమ్
ఉతామృతత్వస్యేశానో, యదన్నేనాతిరోహతి॥
సర్వతః పాణిపాదం తత్, సర్వతోఽక్షి శిరోముఖమ్
సర్వతః శ్రుతిమల్లోకే, సర్వమావృత్య తిష్ఠతి॥
సర్వేంద్రియగుణాభాసం, సర్వేంద్రియ వివర్జితమ్
సర్వస్య ప్రభు మీశానం సర్వస్య శరణం బృహత్॥
య ఏకో వర్ణో బహుధా శక్తియోగాత్
వర్ణా ననేకాన్ నిహితార్థో దధాతి

పిచ"తి చాన్తే విశ్వమాదౌ
సదేవః సనో బుద్ధ్యా శుభయా సంయునక్తు॥
తదేవాగ్ని స్తదాదిత్య స్తద్వాయు స్తదుచంద్రమాః
తదేవ శుక్రం తద్బ్రహ్మ తదాప స్తత్ ప్రజాపతిః।
త్వం స్త్రీ త్వం పుమా నసి త్వం కుమార ఉత వా కుమారీ
త్వం జీర్ణో దణ్డేన వంచసి త్వం జాతో భవసి విశ్వతో ముఖః॥
(శ్వేతాశ్వతరోపనిషత్.)

ఈపవిత్రసంగీతరస మాకాశము నలముకొని భాగీరథీపుణ్యజలముల భాసితమై వాయుమండలములోఁ గలిసి వసుంధరను బవిత్రతాపూర్ణము గావించుచుండెను.

---

## మూఁడవప్రకరణము.

---

### లంపటరాజు.

నీలరతనబాబుమందిరమునఁ జాలరాత్రి యగుచప్పటికి సంకీర్తనాదులు ముగిసినవి. ఉమాశంకరుఁ డప్పుడు శ్రీకృష్ణచరిత్రమునందలి నిగూఢతత్త్వములకు వ్యాఖ్యానముచేసి యుపన్యసించుచుండెను. దినమంతయు స్నానములు ధర్మములు సంకీర్తనములుఁ బూజలుఁ బఠనములు భోజనములు మున్నగువ్యాపారములతో భవనమంతయుఁ బరిపూర్ణమై యుండెను. ఆగంతుకు లందఱు నిప్పుడు తమతమస్థానములకుఁ బోయి యుండిరి. నీలరతనబాబును నాతనిభార్యయు సోదరియు నన్న

పూర్ణయు మాత్రము కూరుచుండి యుమాశంకరునిమధురమయవాక్యములను వినుచు, నడుమ నడుమ నొక్కొక్కప్రశ్న మాతని నడుగుచుఁ దమకుఁ దెలియఁదగిన సంగతులను వ్యక్తపఱచుచుండిరి.

ఒండొరులకుఁ జాలసేపు ప్రసంగము లైనతరువాత నీలరతనబాబు, ఉమాశంకరు నిట్లు ప్రశ్నించెను. “సాధారణముగా లోకములో శ్రీకృష్ణచరిత్రమునకు లాంపట్యము మొదలగు కొన్నిదోషము లారోపితములై యున్నవి. నేను వానినిగూర్చి నామనస్సులో నొకవిధమగు మీమాంస గావించుకొనియున్నాను. అయినను మీబోఁటి పరమభక్తు లావిషయమున నేమి మీమాంసించెదరో వినవలయు నని కోరిక కలదు. ఇప్పు డావిషయమునుగూర్చి ముచ్చటించుటకు మీకే విధమైన యభ్యంతరము లేనిచో మీరావిషయములను వ్యక్తపఱచి సంతుష్టిఁ బొందింపవలయును.”

ఉమా—నే నందులకుఁ దగనివాఁడను. అతిదీనుఁడను. నే నాపరమపురుషుని చరిత్రములో నేయంశమునకైనను వ్యాఖ్యానము చేయఁజాలను. అయినను మీయాజ్ఞచే నావిషయములో నే నెఱింగినదించుక మాటలాడెదను. తల్లి సోదరి మొదలగువారి సమక్షమున నిస్సంకోచముగాఁ దెలుపఁగూడని సంఘటనములు శ్రీకృష్ణచరిత్రమునం దెక్కడను లేవు. కావున మీసమ్ముఖమునం దాతనికథ లేమిచెప్పుటకును నభ్యంతరము లేదు. శ్రీకృష్ణుని లాంపట్యదోషము మిక్కిలి గురుతరమైనదియు, బహువ్యాపకమైనదియుఁగా నున్నది. నిజముగా నాతఁడు లంపటుఁడే. కాని యాలాంపట్యము స్ఫురణకు వచ్చినచో శరీరము రోమాంచితమై, హృదయము భక్తిభారముచే నవనతమై యాలాంపట్యలీలాస్థలమునందలి ధూళిరాశిలో మునుఁగుటకై వ్యాకులపాటు నుదయించును. ఆలంపటరాజు కథ యటుండనిచ్చి యాతనిప్రేమ

కుఁ బాత్రలైన యాదేవీమూర్తుల చరణరేణువులు ప్రాప్తించినను గృతార్థుల మగుట సత్యము. శ్రీకృష్ణుని యాపరదారాసక్తి యంతయు వివరించి చెప్పవలసి వచ్చినచో నీయసమయమునందు మీకు విరక్తియుఁ గలుగఁగలదు. దినమంతయు నలసియుండుటచేఁ బటుత్వము లేకున్న నారసజ్ఞ యాప్రకృష్టమైన వ్యాఖ్యానమును జేయనుజాలదు. కావున నేఁ డొకటిరెండువిషయములను మాత్రమే ముచ్చటించెదను. మఱియొకసమయమునం దావిషయమై విపులముగా సమాలోచనము చేయవచ్చును. శ్రీకృష్ణునివిషయమున శాస్త్రాదులనుబట్టి మనకేమి తెలియుచున్న దనఁగా— నాతఁడు పదునొకండువత్సరములవఱకు బృందావనమునందుఁ దనలీలలను బ్రకాశింపఁజేసినట్లు తెలియుచున్నది. ఈసమయములోనే యాతని బృందావనలీలలును సాంగము లయ్యెను. తరువాత నాతఁ డక్కడిస్త్రీపురుషులతో సంబంధమును బరిత్యజించి ముందుగా మథురానగరమునకును దరువాత ద్వారక మొదలగుస్థానములకును వెడలిపోయెను.

నీలర— ఇట్టి వయసునందు లాంపట్య మసంభవము. అందుచేత నీయుక్తిని జెప్పినచో నాతని యీయపవాదము ఖండితము గాఁగలదు.

ఉమా— (సవినయముగా) చిత్తము. అట్లు గాదు. ఈయుక్తి నాశ్రయించినచో శ్రీకృష్ణునివిషయమై యేమియుఁ దెలియలే దనియే చెప్పవచ్చును. ఇట్టితెలియనితనముతోడనే ప్రస్తుతకాలమునం దనేకులు శ్రీకృష్ణచరిత్రమును విమర్శింపఁజొచ్చిరి. వా రాపరమపురుషుని క్రియాకలాపములనుగూర్చి కొన్ని సంగతము లనియుఁ గొన్ని యసంగతము లనియుఁ, గొన్ని సంభవము లనియు, మరికొన్ని యసంభవము లనియు విమర్శించి కొన్నిటిని గ్రహించిరి. కొన్నిటిని బరిత్యజించిరి.

తమస్వల్పమైన జ్ఞానమునకును, క్షుద్రములైన విద్యాబుద్ధులకును నను రూప మగుకొలబద్దతో వారు శ్రీకృష్ణుండను నగాధజలధిని గొలవఁ జొచ్చిరి. దానిఫలము మిక్కిలివిషమయము. భగవంతుని యవతార మూర్తియైన శ్రీకృష్ణుఁడు జన్మముతోడనే పరిపూర్ణుఁడై జన్మించెను. పుట్టిననాఁడే పురిటింటిలోఁ దల్లితో నెవ్వఁడు మాటలాడెనో, పుట్టిన నాఁడే తండ్రియొడిలోనుండి యమునాజలముల నెవ్వఁడు దాఁటెనో, ఎవ్వఁడు శైశవమునందే పూతనావధను—యమలార్జునభంజనమును గావించెనో, యాదామోదరుఁడు, అన్నివయస్సులయందును—అన్ని యవస్థలయందును బరిపూర్ణుఁడే. ఏవిధముగా నాతఁడు మనుష్యోచిత లీలలను గావించినను గావించుఁగాక. ఆతనిపరిపూర్ణత యాతని నొక ప్పుడును విడువలేదు. అందుచేతనే యాతనిచరిత్రములో నేభాగము నందును నసంగతముగాని, యవిశ్వాస్యముగాని లేదు. కనుక నాతని పక్షమునఁ బదునొకండేండ్లలో లాంపట్య మసంభవముగాఁజాలదు. నిజముగా గోపాంగనలు జారభావముతోనే శ్రీకృష్ణుని సేవించిరి. శ్రీ కృష్ణుఁడు వారిమనోనిశ్చలతను సవిశేషముగాఁ బరీక్షించి, వారిప్రస్తా వమునకు సమ్మతించెను. ఇంతవఱకును శ్రీకృష్ణుఁడును గోపాంగనలు ను మనుష్యాచారమునందు నిందనీయులు కాఁగల రనుట నిజమే; కా ని యాప్రేమయొక్క పరిగాఢత, రహస్యములు, భావములు మున్నగు వానినిగూర్చి చక్కఁగా నాలోచింపఁగల్గినచో మన కాప్రేమయు, నా ప్రేమ కాప్రేమికులును, నాసంఘటనమునుగూడ నలౌకికము లని వెంటనే బోధకాఁగలదు.

నీల—ఎట్లు బోధకాఁగలదు?

ఉమా—అదియును మనవిచేసెదను. గభీరరాత్రియందు ఘా తుకమృగసంకులమైన యరణ్యములో శ్రీకృష్ణుఁ డొకఁడును దిరుగాడు

చుండెను. ఎవని కాంతి శుభ్రవర్ణముసు దాల్చియుండెను. వసుంధరా దేవి పండువెన్నెలవెల్లువలో మునుంగుచు మధురమారుతతరంగముల లోఁ దేలియాడుచుండెను. ఇట్టి యనుకూలసమయమునందు గోపికాంగనలు శ్రీకృష్ణునిసన్నిధి కరుదెంచి యాతనిప్రణయమునకుఁ బ్రార్థించిరి. శ్రీకృష్ణుఁడప్పుడు వారినింపసేయుటైన సంకల్పమును దొలఁగించుటకుఁ దగినరీతి ననేకవిధములుగా వారితోఁ బ్రసంగముచేసెను. కాని గోపాంగనలు—"శ్రీకృష్ణా! గృహము, పతి, పుత్రులు, సంసారధర్మములు, నేమియు మాచిత్తములయందు లేవు. ధర్మమును, సంఘమును, లజ్జను, భయమును, సమస్తమును మేము పరిత్యజించితిమి. మాకు నీ వొక్కఁడవుమాత్రమే శరణ్యుఁడవును, వరేణ్యుఁడవు నై యుంటివి. నీవు మమ్ములను బరిత్యజించితివో మేము నీసముఖముననే యాత్మత్యాగము గావించుకొనఁగలము. నీవు విశ్వపతివి, విశ్వమయుఁడవు, విశ్వనాథుఁడవు. కావున నీవు మమ్ముఁ బరిత్యజింపఁజాలవు. ఒకవేళ నీవు మమ్ముఁ బరిత్యజించినను మే మీభక్తవత్సలములైన పాదములను విడువఁజాలము." అని పలికిరి. అయినను శ్రీకృష్ణుఁడు వారి నానిందితపథమునుండి మరలవలయు నని చాల నిరోధించెను. కాని చిట్టచివరకు వారిచిత్తములను ద్రిప్పఁజాలక నారాయణుఁడు వారిని జూచి యిట్లనియెను—"మీరందఱును నేఁడు మీమీయిండ్లకు వెడలిపొండు. సంసారధర్మముపైఁ జిత్తమును నిల్పుఁడు. ఎప్పటివలెనే నియమముగాఁ గులధర్మమును బరిపాలింపుఁడు. అపిమ్మట రేపు మీ మనోభావము లెట్లుండునో పరిశీలించుకొని నాకుఁ దెలియఁజేయుఁడు."

ఈవిధముగా గోపాంగనలు శ్రీకృష్ణునిచే మరలమరలఁ బరీక్షింపఁబడిరి. కాని యావ్రజపంచదీపముల కేకాంతభావమున శ్రీకృష్ణుని చరణము లాశ్రయించుటకంటెఁ బ్రాణరక్షోపాయము లేదని యా

నికిఁ దెలియఁబడియెను. అప్పుడు శ్రీకృష్ణుఁడు గోపికలతో రాసక్రీడా ప్రసక్తుఁడగుటకు సమ్మతించెను. ఎందఱెందఱో గోపికలు కృష్ణప్రేమవిహ్వలలై యాతని ధ్యానించుచు జీవన్ముక్తలు కాఁగల్గిరి. ఎందఱెందఱో నిమీలితలోచనలై యీజగత్తునకుఁ బరబ్రహ్మమైన యాతనిని చింతించుచు శ్వాసల బంధించి విగతజీవలు సద్యోముక్తలు నైరి. ఇది యంతయు నేకాంతభక్తి కుదాహరణము. ఇట్టిసంఘటనము, నిట్టి పరిస్థితియు నైనతరువాత శ్రీకృష్ణుఁడు గోపికలకుఁ దనచరణసేవయం దధికారము నొసఁగి ధన్యలను, జరితార్థలను గావించెను. మనుష్యచరిత్రమునం దాలోచించి చూడఁగా నిట్టిసంఘటన మెక్కడను గనఁబడదు. ఎట్టిదేశముల, నేకాలములలో, నెట్టిస్థితిగతులయందు, నేమనుష్యుఁడు, నిట్టిదేవభాగ్యులు దేవాంగనాసదృశలు నగుకామినీగణము నీవిధముగాఁ బడయఁజాలఁడు. విశేషించి యిట్టిసుందరీబృందము సమావేశమువలనఁ దన్నుఁ బరమభాగ్యవంతునిగా భావించి తత్క్షణమే వారివలన మోసపోయి వారిని మోసగించును. శ్రీకృష్ణుని లాంపట్యమాత్రనిదానత్వమునే తెలియఁజేయుచున్నది. మఱియు భక్తాగ్రేసరీమణులైన యాకామినీమణుల కృష్ణభక్తియు నలౌకికమైనదియే. ఆకృష్ణగతప్రాణులైన గోపాంగన లొకప్పుడు తమనారీభావమును మఱచిపోయి యెవరిమట్టుకు వారే, తమ్మే శ్రీకృష్ణునిగ భావించుకొనఁజొచ్చిరి, మఱియు వారిలోఁ గొందఱు నిజముగాఁ దాము గోవర్ధనపర్వతము నెత్తితి మనుకొని వ్రేపల్లెవారి కభయప్రదానము చేయఁజొచ్చిరి. కొందఱు తర్జనగర్జనములతోఁ గాళియమర్దనమునకు బయలుదేఱిరి. కొందఱు గోబృందమును మేపుటకుఁ దోలఁజొచ్చిరి. మఱికొందఱు భుజాస్ఫాలనము లొనరించుచు వ్రేపల్లెలో శత్రుసంహారమున కుద్యుక్తలైరి. ఏమి యీయద్భుతాశ్చర్యకరమైన తన్మయత్వము! ఏమి యీయేకాం

కోపించి తననికుంజమునుండి జగన్నాథుని ద్రోసిపుచ్చినచో, నావిశ్వ
రూపుఁడు వివిధములైన మాయవేషములను ధరించి తనప్రాణప్రియ
నెట్లో దర్శింపకుండ నుండలేకుండెను. వారిప్రేమప్రవాహములో య
మునాప్రవాహ మెదురీఁదఁజొచ్చెను. పశుపక్ష్యాదు లాహారాదికముల
ను మఱచి వారిప్రేమలీలల సందర్శింపఁగడఁగెను. వసంతము చిరవిరా
జితమై వారిప్రేమలీలలను బెంపొందించుచుండెను. భ్రమరములు ని
యతకూజనము లొనరించుచు వారికి వినోదములు గొలుపుచుండెను.
కోకిలము లన్నిఋతువులలో నాపుణ్యక్షేత్రమున ఝుంకారములు
చేయుచుండెను. మయూరీమయూరములు పింఛములు విప్పికొని యా
శిలాస్థలమున నృత్యములు సలుపుచుండెను. లతావృక్షాదు లవనత
మస్తకములై యచ్చటిభూరజమును దలఁదాల్చుచుండెను. ఏ కవికల్ప
నకును, ఏ ప్రేమాభినయమునకును, ఈయపూర్వలీలల సమీపించుట
శక్యము గాకపోయెను. అతరువాత నాకర్తవ్యనిష్ఠుఁడై శ్రీకృష్ణునిదగ్గఱి
కు, అక్రూరుఁ డరుదెంచి కంసునియాహ్వానమును లీలామయుఁడు
నైనభగవంతునకు గురుతరకర్తవ్యము స్ఫురణకువచ్చెను. అప్పు డాప్రే
మబంధనము లేమయ్యెనో, ఆయాకర్షణములు నామధురలీలలు నెక్కు
డనుఁ బోయెనో! అన్నిటి నుపేక్షించి యాకంసారి మథురాయాత్రకు
బయలుదేఱెను. సుందరీబృందముల కన్నీటికాలువలును, ప్రేమకాగ
ణముల హాహాకారములును, దక్కినవారి నిషేధవాక్యములును, నన్న
యు నాతనిఁ గర్తవ్యపథమునుండి యణుమాత్రమైనఁ జలింపఁజేయలేక
పోయెను. క్షుద్రమానవుని మానదండ మీప్రేమపరిమాణమును నిర్ణ
యింపఁగలదా? మనుష్యుఁ డొకసామాన్యవేశ్యయం దింద్రియవికారజ
నితమైన యాసక్తిచే నభిభూతుఁడై సర్వము సమాజనింద, విత్త
నాశనము, బంధువైముఖ్యము, మాతాపితృరోదనము, ధర్మపత్నిప్రా

ణహాత్మ్య మొదలగు నేకారణములు కల్గినను గులటాసంసర్గము పరిత్య జింపఁజాలకున్నాఁడు. ఇఁక నిచ్చటనో గోవిందుఁ డీయలౌకికప్రేమబంధనమును, గురుతరకర్తవ్యపాలనానురోధముచే నవ్వుచునవ్వుచు ఛేదించివేసినాఁడు. ఇట్టియమానుషికవ్యాపారము కేవల మాసచ్చిదానంద పరమపురుషోత్తమునకె చెల్లునుగదా. వ్యభిచారనిరతుఁడైన యాపురుషునియందును, నాతనినారీగణచరణములయందును నామతి యవిచలితమై యున్నది.

నీల:—వత్సా! శ్రీకృష్ణుని కృపాతిశయముచే నీవు శ్రీకృష్ణుని యథార్థముగాఁ దెలిసికొంటివి. అమృతోపమానములైన నీపలుకులచే నేఁడు మేమందఱముఁ బరమానందభరితులము కాఁగల్గితిమి.

ఉమా:—నేను మిానమతిమునం దాప్రేమమయుని ప్రేమలీలల నించుకయు వ్యక్తీకరింపఁజాలకుంటిని. అవి యనంతములు; నేను క్షుద్రకీటకమాత్రుఁడను. నేటి రాత్రి తెల్లవాఱవచ్చుచున్నది. నే నిప్పటికి సెలవుగైకొందును. అదృష్టమున్నచో సమయాంతరమున శ్రీకృష్ణకథ లభివర్ణించుకొని జన్మసార్థకము గావించుకొందము.

ఆనందమయిూ! తెల్లవాఱుచున్నమాట సత్యమే; మిారిప్పుడు వెడలవలసియుండుటయు నిజమే. కాని యీామధుమయములైన కథలను దివారాత్రము లాహారనిద్రలు త్యజించి యాకర్ణించుచున్నను మాకుఁ దృప్తితీఱదు.

అన్నపూర్ణ యస్ఫుటస్వరముతోఁ గాళీతారను జూచి అత్తయ్యా! యోగేశ్వరిదర్శనము మరల నెప్పుడైన లభింపఁగలదేమొ, అడుగుము" అనియెను.

కాళీ:—అమ్మా! నీవు ఉమాశంకరునితో మాటాడవాయేమి? నీవే యడుగరాదా?

అప్పుడామె యేమియు ననఁగలేకపోయెను. నేఁటియుదయమున జరిగిన కథ స్మరణకు వచ్చుటచే నామె యధోవదన యైపోయెను. మిక్కిలి లజ్జితురా లయ్యెను. కాని, యిఁక నచ్చట నుండవలసినపని లేదనుకొని యామె యచ్చటనుండి బయలుదేరెను.

ఉమా:—అమ్మను నీవు ప్రార్థించుచుంటి వని నే నామెవల ననే వినియున్నాను. ఆమె కరుణామయి, అప్పుడ నీప్రార్థనము సఫలము గావింపఁగలదు.

ఆతరువాత నుమాశంకరుఁడు పెద్దలకుఁ బ్రణామము గావించి వెడలిపోయెను. అతఁడు కర్తవ్యనిష్ఠుఁడు, కార్యావసరముపట్టి యతఁడు వెడలవలసివచ్చిన మాట సత్యమే, కాని యాతనియంతఃకరణము మాత్ర మాతనికించుక విరోధముగా నున్న దనియే తోఁచుచున్నది.

---

# ఏకాదశ ఖండము — నవకము.

## మొదటిప్రకరణము.

### రూపాంతరము.

సౌధమాలాసమాకీర్ణమై యున్నకాశీనగరములోఁ బాండవఘట్టమునకు సమీపమున, గంగాతీరమునందలి యొకగొప్ప సౌధము బహుజనసమారంభముతో నుండెను. ద్వారములయందు ద్వారపాలకులు కాచియుండిరి, దాసదాసీజనులు తిరుగాడుచుండిరి, పండ్లు గూరలు మున్నగు మంచిమంచి పదార్థములతో నింపిన పెద్దపెద్ద తట్టలు పట్టుకొని కొందఱు లోనఁ బ్రవేశించుచుండిరి, గొప్పగొప్పవర్తకులు విలువగలనగలుఁ గాశీచీరలు మున్నగువానిని దీసికొనివచ్చి ద్వారముకడ వేచియుండిరి. ఇంట నెచ్చటఁ జూచినను సకలవస్తువులు సమృద్ధిగా నుండెను. వంగదేశమునుండి యెవ్వరో యొకరాణివచ్చి యీయింటఁ బ్రవేశించె నని యందఱును జెప్పుకొనుచుండిరి.

రాణి యగుఁగాక; రాజకన్యయే యగుఁగాక, [illegible]తో నెడఁబాయక ద్వారపాలకులు ద్వారములఁ [illegible] గృహమధ్యముఁ బ్రవేశించుట కెవ్వరికైన [illegible] లేకుండును గాక, అమ్మ సర్వ[illegible] గలుగు [illegible] సృష్టిచేసిన దరిద్రులు గ్రంథకారులుమాత్రము మాఁగన్నైనఁ జొరజాలని ప్రదేశమునందుఁ గూడ స్వేచ్ఛగా ననాయాసముగాఁ బ్రవేశింపఁగలరు. పుణ్యాత్ముల పవిత్రనికేతనములయందు, పాపపంకిల దుర్గంధమయమైన నరకములందు, విలాసవంతుల రమ్యోద్యానములయందు,

సన్నిటియందుఁ గవుల కన్యాహాతమైనగతి గలదు.

సరస్వతీమాత యొసఁగిన యీవరమువలని ప్రభావముచే మన మీనూతనాగతురాలైన రాణిమందిరమునం దొకమాఱు ప్రవేశింతము.

గృహమునం దెచ్చటఁ జూచినను గృహస్థులు క్రొత్తగా దిగిన జాడలు కనఁబడుచుండెను. క్రిందియంతస్తునం దొకగదిలో నిద్దఱు దాసీవనితలు ఱాతిపలకలపై మసాలా నూరుచుండిరి, మఱియిరువురు నీరు మోయుచుండిరి. ఇఁక నిద్దఱు బ్రాహ్మణులు వంటలు చేయుచుండిరి. క్రిందియంతస్తంతయు మహాసంరంభముగానుండెను. రెండవయంతస్తునందు గడబిడ లేమియు లేవు. కాని యంతయుఁ జెల్లాచెదరుగా నుండెను. వరాండాలోఁ గొన్నితివాసులును గొన్నికంబళులును బడియుండెను. ఒకగదిలో గొన్నిట్రంకుపెట్టెలును గొన్నిదేవదారు పెట్టెలును, మఱియొకగదిలోఁ గొన్నిబస్తాలును, అందొకచోటఁ గొన్నిపఱుపులును, నీవిధముగా సామాను లెక్కడివక్కడ నెల్లోపడియుండెను. మూఁడవయంతస్తంత విశృంఖలముగా లేదు. ఆయంతస్తునందు గఱగకెదురుగా నున్నయొకగదిలోఁ బఱుపుపై దెల్లనిప్రక్క పఱచఁబడియుండెను. ఆప్రక్కపైఁ రాణి యనిపిలువఁబడుచున్న యామె యొంటరిగాఁ గూరుచుండి యన్యమనస్కయై యేమో యోజించుచు గవాక్షద్వారములనుండి గంగానదివంకఁ జూచుచుండెను.

రాణియనఁగా మఱియెవ్వరును గారు—శ్యామలాలుని వివాహితవనిత, హరిచరణుని ప్రణయిని, పాపాత్మురాలైన విధుముఖి ధనసంపదనుబట్టి విచారించినచో విధుముఖి సమకాలీనులైన రాజరాణులకంటె మిక్కిలి గొప్పదనుటకు సందేహములేదు.

ప్రాణబంధువైన హరిచరణుని పరామరికవలన సకలసదుపాయములతో విధుముఖి పశ్చిమవాయుసేవనమునకై వచ్చియుండెను. అనేక

బాధల ననుభవించుచు లాహోరుపర్యంతము ప్రయాణముచేసి యిప్పు డీపుణ్యవతి పుణ్యతీర్థమైన కాశీనగరమునకు వచ్చి యధిష్ఠించె ను. ఇట్టి సంవత్సరములలోఁ గాశీధామపురముయొక్క యుదారత యపరి మేయము. పాపుల కాశ్రయ మిచ్చుటకును, పాపపంకమును శరీరము న దంటించుకొనుటకును, వారణాసి యేమియు సంకోచింపదు. ఇం దుచేతనే యీపవిత్రతీర్థక్షేత్రమునందు దుష్టపిశాచ నృత్యములును, అపవిత్రుల యాటోపములును, పరిదృశ్యము లగుచున్నవి. సతీశిరో మణి యైన భవాని యీప్రియనికేతనమునందు—యోగీశ్వరుఁడైన మహేశ్వరుని యీసనాతనపురమునందు, ఈరాక్షసుల, ఈయసురుల, యవిధేయమైన యీయభినయమా! అహో కాలమా! నీమాహా త్మ్య మెంతప్రబలమైనది.

విధుముఖి యిప్పుడు మునుపటివలె లేదు. ఆమె వెనుకటిసౌం దర్యము, ఆశోభ, ఆయుజ్జ్వలత, ఆప్రఫుల్లత, యిప్పుడు కోలుపోయి యుండెను. ఆమె సువర్ణవర్ణశరీర మిప్పుడు అరకూటచ్ఛాయ నవఘ ళించుచుండెను; ఆమె యాయుజ్జ్వలలోచనములు గుంటలు వడి ప్రభా శూన్యములై యుండెను; ఆమె జీవకళలును ప్రఫుల్లితయు నపగతము లై పోయెను; ఆవిలాసప్రియతయు నావేషభూషలు నిప్పు డించుకయు ను లేవు. బిరుసైనయామె దీర్ఘకేశరాశి జడవీడి ప్రక్కకైఁ బడి దొర్లు చుండెను. ఆమె యిప్పు డొక సామాన్యవస్త్రమును సామాన్యరీతిని గట్టుకొని యుండెను. అలంకారము లేమియు లేవని యిదివఱకే చెప్పి యున్నాము. ఎవ్వరును జెప్పకున్నచో నిప్పుడు విధుముఖి నానవాలు పట్టలేరు. ఆమె కిట్టి మార్పేలగల్గెను? ఆమెమార్గమున కనేకములై ననియమభంగములును బ్రతికూలములును గష్టములును గల్గుటచే నా మె కిట్టి పరివర్తనము సంఘటిల్లెనా యేమి? కాదు. దారుణమైన మాన

సికకష్టముచేతనే సుందరి క్లిష్టమార్గాంతముఁ గన్గొ

ఎవ్వతె సుఖమార్గము నిష్కంటకము నవ్యాహతము నై యుండెనో, ఎవ్వతెను జీవనమార్గము స్వాధీనము నిర్బాధకము నై యుండెనో, ఎవ్వతె కోరిక లీడేరుటకు సర్వోపకరణములు సంసిద్ధము లగుచుండెనో, ఎవ్వతె తృప్తిసంతోషమును సంపాదించుకొనుటకు స్వయముగాఁ గష్టపడ నవసరము లేకుండెనో, ఎవ్వతె కావ్యకలాపములు మంచిచెడ్డలకును పాపపుణ్యవిచారమునకు నధీనములు గాకుండెనో, యట్టియామె మనస్తాపముచేఁ బీడితురా లగుటకుఁ గారణ మేమియుఁ గనఁబడదే! అతులనీయసంపత్తి కధీశ్వరినై యుండియుఁ బ్రాణబంధు నైన హరిచరణు నహర్నిశ లెడఁబాయకుండియు నామె కీకష్ట మెందులకు? అన్నియు నున్నమాట నిజమే, అయినను గష్టముతప్ప లేదు. విధాత యెట్టి దుర్జ్ఞేయసూత్రముచే సుఖదుఃఖములు ముడివెట్టెనో యెవ రెఱుఁగుదురు! దేనివలన సుఖము గలుగుచున్నదో, దానివలననే కష్టము సంభవించుచున్నది. దేనివలన దుఃఖ మగుచున్నదో దానివలననే సుఖమును లభించుచున్నది. దేనివలన నొకవిధ మగుసుఖ ముండునో దానివలననే యింకొకవిధమైనదుఃఖము; దేనిచే నొకరీతిదుఃఖము కలుగునో దానివలననే యింకొకరీతిసుఖము. ఇందుకొఱకే జ్ఞానులు సుఖదుఃఖముల కతీతు లగుచున్నారు; ఇందుకొఱకే సుఖదుఃఖరాహిత్యభావము నుస్థిరప్రజ్ఞకు లక్షణమని వచింపఁబడినది.

విధుముఖి మాయావిని. ఏహరిచరణుఁ డామెసకలసుఖములకుఁ గేంద్రస్థానమై యుండెనో, యాహరిచరణుఁడే యామె కిప్పు డీవిషమదుఃఖమునకుఁ గారణ మయ్యెను. ఆమె హరిచరణుని హృదయపూర్వకముగాఁ బ్రేమించెను. హరిచరణునికొఱ కామెధర్మధనమునకు జలాంజలి యిచ్చివేసెను. సమాజము తలపైఁ గాలితోఁ దన్నివేసెను; హ

రిచరణునితోఁడిసుఖానుభవముకొఱకు నిరుపమానసంపత్తి నాతనిచరణములకర్పించివేసెను. మనస్సుచేతను, గార్యములచేతను మన్నింపకుండుట యటుండనిచ్చి, యట్టియనుమానముగూడ లేకుండుటకై భర్తను దూరముగాఁ దరిమివేసెను; ఆహరిచరణుఁడు—ప్రాణముకంటెఁ బ్రియమైనయాహరిచరణుఁడు మనసులో నామెను బ్రేమించి యుండలేదు. ఇదియే యామె కిప్పుడు హృదయగతమైనది. ఆమె యిందుల కనేకదృష్టాంతములను జూచెను. వివిధరీతుల నావిషయమును గూర్చి పరీక్షించెను. నిజముగా దుఃఖవార్తయే.

మొట్టమొదట సుహాసిని యనునొకసుందరీరత్నమును హస్తంగతము గావించుకొనుటకై హరిచరణుఁ డనేకప్రయత్నములు ననేకక్రియలు, నత్యంతవ్యయమునే గాక నరహత్యలును గావించెను. ఆసుహాసిని తొలుత శ్యామలాలునిహృదయము నాకర్షించెను; కాని యాసతి తనధర్మమును గాపాడుకొనుటకై పలాయితమై స్థానాంతరమునందు దాఁగికొనియెను. హరిచరణుఁ డామెనిమిత్త మత్యంతప్రియుఁడై యామెను వెదకుచు విశేషకౌశలముతో నామెను జేఁజిక్కించుకొనుటకై యాలోచించియుఁ జివరకుఁ గృతకృత్యుఁడు కాలేకపోయెను. ఇఁక రెండవసంగతి,—హరిచరణుఁ డీపశ్చిమదేశయాత్రాసమయమునఁ దనకు సోదరి యనిచెప్పుచు నింకొకయువతిని వెంటఁబెట్టుకొని వచ్చెను. క్రమముగా విధుముఖి యావృత్తాంత మంతయుఁ దెలిసికొనియెను. అతఁ డామెను స్వతంత్రముగా నొకచోట నుంచెను. మూఁడవసంగతి, హరిచరణునియదృష్టముచే నాతని కొకదాసీవనితతోడి స్నేహముగూడ లభించెను. ఆదాసి మఱియెవ్వతెయుఁ గాదు—శారద. విధుముఖి కొకరోజునఁ గోపము వచ్చి శారదను వెడలఁగొట్టించెను. హరిచరణుఁడు దాని నొకప్రత్యేకస్థలమునం దుంచెను. ఇఁక నాలుగవ

సంగతి, హరిచరణుఁడు కాశికి వచ్చినతరువాత "దిల్‌జాన్" అను నొకయవనవేశ్యను మోహించి యున్నవాఁడై యుండెను. దేయుంబ వద్ద దానియింట సురాపానాదికార్యములతో నాతని కిప్పు డెడతెరపి లేదు.

హరిచరణుఁ డిప్పుడు విశేషధనమునకధీశ్వరుఁడు. విధుముఖి దయచే నాతఁడు చాలవిత్తమును సంగ్రహించుకొనియెను. అతఁడు కూడఁబెట్టుకొనినధనమువలన జీవితకాల మంతయు విశేషభాగ్యముతోఁ గడపవచ్చు నని యాతఁడు నిబ్బరపడియుండెను. నిజముగా నాతనిభోగరసికభ్రమరము, ఒక్కవిధుముఖీకమలమునందే యాబద్ధమై యుండుటవలనఁ బ్రయోజన మేమియుఁ గనఁబడదు. హరిచరణుఁ డిప్పుడు విధుముఖిదయకుఁ బాత్రుఁడై యుండవలసిన బికారి కాఁడు. హరిచరణుఁడు హృదయహీనుఁ డని విధుముఖి మునుపే విని యుండెను. కాని, యాతఁ డిప్పు డనేకకారణములచేఁ జాల జాగరూకతతో మసలుకొనుచుండెడివాఁడు. దేశపర్యటనమునకై యాతఁడు బయలుదేరినతరువాత హరిచరణుఁ డొకనాఁ డకస్మాత్తుగాఁ దనవిషయపత్రము లన్నియుఁ దీసి పాఱిపోయెను. ఇప్పు డాతఁడు విధుముఖి నన్నివిధములు నుపేక్షించుచుఁ దనవిలాసవిహారమున కారంభించెను.

విధుముఖి మొదటఁ గోపము, తరువాతఁ దిరస్కారము, నాతరువాత నభిమానము, నాపిమ్మట రోదనము, నావెనుక వినయమును జివరకుఁ బాదక్రాంతపర్యంతము గావించి చూచెను. కాని హరిచరణుఁడు త్రినాపరివర్తనములచే నెప్పుడును విధుముఖి కోరినయాదరమైనను జూపియుండలేదు; నిందలుఁ, దిరస్కారములుఁ దక్క మఱియేమియుఁ గనఁబడవు. అతని కిప్పుడుకొన్నైన సిగ్గుబిడియము లున్నట్లు తోఁచుటలేదు. విధుముఖి, హరిచరణుఁ డిఁకఁ దనవాఁడు గాఁడనియుఁ, దనవాఁ

కైనను దనవద్ద నుండఁదనియు గ్రహింపుకొనియెను. ఆతరువాత నా
మె క్రమముగా మంచముపట్టెను.

హరిచరణుఁ డిఁక విధుముఖకడ కంతగా వచ్చుటలేదు. వచ్చి నను విధుముఖ నంతగాఁ జూచుటలేదు. చూచినను మాటలాడుట లేదు. ఒకవేళ మాటాడినను విధుముఖ సరిగాఁ బ్రత్యుత్తరము చెప్పుట లేదు. చెప్పినను వానిని దనవద్దనుండి పొమ్మనియు, నెప్పుడును రావలదనియుఁ జెప్పుటకంటె మఱేమియుఁ జెప్పుట లేదు. హరిచరణుఁ డిప్పుడు విధుముఖకు నేత్రశూలము. ఆతనియాకారప్రకారములు, నాతనిసంభాషణములు నన్నియు నిప్పు డామె కపరిమితజ్వాలాకరములు. ప్రేమను భయానక మైనయత్యాచారమా!

విధుముఖకిఁ గొంచెముగా జ్వరము వచ్చుచుండెను. నిద్ర పట్టుటలేదు. తినుట కిష్టము లేదు. తినుటయే లేదని చెప్పవచ్చును. ఆమె కను బలహీనముగా నుండెను. శరీరములో నించుకయు రక్తము లేదు.

ప్రపంచములోఁ దనవారన్నవా రొక్కరును లేరు. ఎవ్వరికొఱకేమి చేయవలయును? ఈలోకములో నన్నిటికి నాకేఁ డొక్కఁడే తన వాఁడని యెవ్వని కామె తనసర్వము సర్పించెనో, యాతఁ డిప్పు డామెకు నితరుఁడై పోయెను. ఇతరుఁడైనను మంచిదే. ఏమన, నితరులను జూచినచోఁ గష్టము గలుగదు. కాని యాతని జూచినచో మనస్తాపము పుట్టుచున్నది. ఆతఁ డిప్పుడు శత్రువు.

దాసీజనులు పరామర్శించి, గుమాస్తాలతోఁ జెప్పి వైద్యుని బిలిపించిరి. వైద్యుఁడు విధుముఖకి బలము గలిగించుసాధనముల నిచ్చెను. కాని దాసీజను లెన్నివిధములఁ దంటాలుపడినను విధుముఖచే నించుకనైన నౌషధము మ్రింగింపఁజేయలేకుండిరి. తరువాత వారిందుకొఱ

కీ.క నెంతపరిచర్యను జేసినను లాభమేమియు లేదని యూరకుండిరి.

దాసదాసీజను లందఱిలో "కాళిదాసి" యనుపేరుగలదాసి యొకతె గలదు. అది కొంత నేర్పరురాలు. కొంచెము ధర్మభీతురా లు. అంతగా నాడంబరము లెఱుఁగనిసామాన్యురాలు. విధుముఖ యీయవస్థను జూచి దానిహృదయ మింత కరఁగినట్లు కనఁబడుచున్న ది. అందుచే నది తక్కినదాసదాసీజనులవలె ముఖముముం దేవో మంచిమాట లాడి తరువాతఁ గనఁబడకుండఁబోవునది గాదు; పైపై సానుభూతి కొంతచూపి యంతతో నూరకుండునది గాదు; బుడిబుడి దీర్ఘములు తీయుచు నిష్ఠురముగా మాటలాడునది గాదు; కష్టముమీఁ ద నవ్వాపికొనుచు గంభీరస్వరముతోఁ గొన్నిమరియాదమాటలఁబరా మర్శచేయునది గాదు; దానిస్వభావ మట్టిదో, లేక దానికి విధుముఖ యందు భక్తిశ్రద్ధలు గలవో కాని, యీదాసిమాత్రము రేయుఁబవ ళ్లు నానావిధముల రోగగ్రస్తురాలైన విధుముఖికి శుశ్రూషలు చేయు చుండెను.

చాలసేపు గవాక్షద్వారములనుండి గంగాదేవిని జూచిచూచి యలసి విధుముఖ తరువాత పక్కపైఁ బరుండెను. అప్పుడు కాళీ దాసి వచ్చియామెను జూచి "అమ్మా! కొంచెము పాలు ద్రావుదు వుగాని లెమ్మా" అనియెను.

విధుముఖ పరుండియుండియే "వద్దమ్మా! ఏమియుఁ బుచ్చు కొనవలెనని యిచ్చలేదు. నేను లేవలేను" అనియెను.

కాళీ—అట్లనకమ్మా, అట్లనిన నెట్లు? ఎలాగో కష్టపడి కొం చెము లోనికిఁ బుచ్చుకొనవలెను. నేను పాలగిన్నె నోటి కందించెద ను. ప్రాణమును రక్షించుకొనుము.

విధు—ఎందులకు?

కాళీ—సరిసరి. అదియేమిమాట! ఇప్పుడు నీకీవైరాగ్య మెం దులకు? వయసు లేదా? రూపము లేదా? చాలినంతధనము లేదా? ఏమిటికు నీకీవైరాగ్యము?

విధు—అంతయు నిజమే. కాని, కాళీదాసి, ఏమి యుం డినదానికిఁ బరిపూర్ణసుఖ ముండునో చెప్పుము!

కాళీ—ఉండవలసినసకలసుఖములు నీకిప్పు డుండనేయున్న వి. ఈయన్నిటికిని మెఱుఁగువెట్టిన ట్లొక్కమగబిడ్డఁ డున్నచో నీకింకే మియు నక్కఱలేదు. దేవుఁడున్నచోఁ దప్పకుండ నదియు లభించును.

విధు—అంతే? ఇంకేమియు నక్కఱలేదా?

కాళీ—అదృష్టవంతులైనమనుష్యుల కెన్నిసుఖము లుండునో అన్నిసుఖములు నీకిప్పు డున్నవి. నీకిప్పు డేమియు గొఱఁత లేదు. ఇం కేమియు నక్కఱలేదు.

విధు—(ఒకనిట్టూర్పు విడిచి) పెనిమిటి—పెనిమిటివలన సుఖ ములేనియాఁడుది బ్రతికి యెందుకు?

కాళీదాసి చాలనాళ్లక్రిందటనే వితంతువై యుండెను. అయి నను గొంతెత్తి ధైర్యముతో నిట్లు చెప్పెను. "అది నిజమే; కాని నీకాదుఃఖము లేదు. నీవు వానినిగూర్చి యేమియు విచారింపకుండ, ఏమియు మాటాడకుండ వచ్చివేసితివి. అందువలన నీవు తలంచుచున్న ట్లు నీపెనిమిటి యిక్కడకే వచ్చియుండెను."

తత్క్షణమే యావ్యాధిగ్రస్తురాలు అశక్తురాలు పక్కపై నుండి యాతురతతో లేచి కూరుచుండి ససంభ్రమముగా "వచ్చి యుండెనా? ఎక్కడ నున్నారు?" అని యడిగెను.

కాళీ—వచ్చెను గాని, ద్వారపాలకులు లోనికి రానీయకుం డుటచేఁ జాలసేపు కనిపెట్టుకొని యుండి యుండి యాతఁ డెక్కడకో

వెడలిపోయెను.

విధుముఖి దీర్ఘనిశ్వాసమును విడిచి మరల శయ్యపై నొరగి "ఎంతదూరము వచ్చినా? —నన్నుఁజూచుటకింతదూరము వచ్చెనా? ఈనాఁడు జాలకష్టపడి వచ్చెను గాఁబోలు. ఇఁకఁ జూచుట కష్టము. మూఁడుమాసముల బాగుగనుందును—అయ్యో! ఇఁకఁ గార్యము లేదు." అని కొసరెను.

కాళీ—అతేఁ బోవుము. ఎప్పుడు వచ్చినాఁడో, అప్పుడే మరల వచ్చితీరును. నిన్నుఁ దప్పక చూచితీరును.

విధుముఖి యేమియు మాటాడకుండఁ బ్రక్కపైఁ బరుండి యిట్లు చింతింపఁజొచ్చెను—"ఏభ్రమలోఁ జిక్కితినో యాభ్రమలోనుండి విడివడుటకుపాయము లేదు. ఏగోతిలోఁ బడితినో యాగోతిలోనుండి లేవఁగలుగుటకాశ లేదు. భగవంతునిదయవలనఁ గొదవ లేమియు లేవు. అఖండైశ్వర్యము నాపాదములకడ నుండెను; అపరిమితసౌందర్యము నాదేహము నాశ్రయించియుండెను; శరీర మెప్పుడు నారోగ్యముగా సుఖముగా నుండెను. అయినను ఘోరమనస్తాపముచే నెడతెగని దుఃఖము గలిగి యిప్పుడు చావుటకు సిద్ధముగా నున్నాను. ఇట్లేల కావలెను? పాపముచే మత్తురాలనై నేను సకలసుఖములను బోఁగొట్టికొంటిని. బుద్ధిదోషముచే నేనన్నిటిని గోల్పోయితిని. ఇంద్రియభోగలాలసత్వముచే సకలము విసర్జించివేసితిని. 'ఏది సుఖమని భావించి మత్తురాలనైతినో, ఇప్పుడు చూడఁగా నది కేవలము నసుఖమై పోయినది—అది యెంతయు నసారము! పాపము—పాపము! నామనశ్శరీరములు పాపముచే నపవిత్రములై పోయినవి. గర్వించి నేనే నా సుఖపథమును బాడుచేసికొంటిని. నేను నాసకలసుఖోపాయములను గాలితోఁ దన్నివేసికొంటిని. సతూబకుఁ జితిప్రియురాలే రమణీయసాధ

సము. నేనాధనలాభముకొఱకుఁ బ్రయత్నింపనైతిని. నిజము చెప్పవలసినచో నాతఁడు నన్నెప్పుడు నాదరింపలేదు. అయిన నేమి, అందుకొఱకు నాచిత్తము చలింపకున్నచో నాకు సకలసుఖములు నిలిచి యుండును. ఆతఁడు స్త్రీలోలుఁడై కాలము గడపినది నిజమే కాని నాకందువలన నష్ట మేమి వచ్చినది? ఇంద్రియసుఖవాంఛలు త్యజింపఁగల్గినచో నాకాతఁడే సర్వస్వమునని తెలిసికొని యుందును. అట్లయినచో నాతఁ డెప్పటికైన నాకు స్వాధీనుఁడై యుండెడివాఁడే గదా. అట్లు గాకున్నను నాచిత్తశాంతికి భంగము లేకుండును. ధర్మమునకు హాని లేకుండును; పాపములచే బాధలేకుండును; అన్నచే నంతర్దాహము కలుగకుండును; ఇట్టి సర్వనాశన మెప్పుడును సంఘటింపకుండును. ఆనాఁడు—ఆనాఁ డాతఁడు నారూపమును జూచి మోహితుఁడై నాపాదములపై నెప్పుడు పడెనో, అప్పుడైనను దెలివి గలిగి నేను వాని బ్రేమశృంఖలములచే బంధించివేయవలసినది గదా. ఇప్పుడు చేయునదేమున్నది! అంధకారము! సర్వము గాఢాంధకారము! ఇఁక నుపాయ మేమున్నది! మరణ మాసన్నమై యున్నది. మృత్యువే నాకిప్పుడు కావలసినది. ఆయనను నేనిఁకఁ జూడఁజాలను; ఈపాపపుముఖ మాయనకుఁ జూపఁజాలను. ఆయన వచ్చుటవలన మేలేయయ్యెను. ఆయనయాస్తి యంతయు నాయన కిచ్చివేసెదను. ఇప్పుడే గుమాస్తాను బిలిచి పత్రము వ్రాయించి వేసెదను.” అని మరల నిట్లనుకొనియెను—“నిష్ప్రయోజనము. నేను మరణించినపిమ్మట నంతయు నాయనకే యగును; ఏవిధముచేతనైన నాస్తియంతయు నాయనకే చేఁజిక్కవలయును. చూచుటయే! ఆయన నింక నేఁజూడఁజాలను. నేను చేసినయన్యాయమున కాయన నన్ను క్షమించినను, నేను దానికి సంతోషింపఁజాలను. క్షమింపఁగోరను. క్షమించుటకందని పాపమును

11

జేసితిని. నా పాపాగ్నిలో నేనే భస్మమయ్యెదను. ఆయగ్నియే పరలో
కములో నాకుఁ దగినశిక్ష చేయఁగలదు. క్షమవలనఁ గార్యము లేదు."

ఇట్లనుకొనుచుండఁగా టక్కుటక్కుమనుచుఁ జెప్పులకాళ్లతో నెవ్వరో నడచివచ్చుచున్న చప్పుడు వినఁబడఁజొచ్చెను. వెంటనే, మిలమిలలాడువేషభూషలతో, రక్తచక్షువులతోఁ జంచలగతులతో హరిచరణమూర్తి వరాండాలోఁ బ్రత్యక్షమయ్యెను. ఆతఁడొయ్యారముతో విధుముఖిగదిలోఁ బ్రవేశించి యిట్లనియెను. "ఏమి? పండుకొంటి వేమి? రాత్రి చాలసేపటివఱకు "విస్కీ" సేవించి-ట్లు తోఁచుచున్నది. అది మంచిపనే, కాని యీచోటనుకూలముగా లేదు. నాతో రమ్ము. "దిల్ జాన్" ఇంటిలో నుండువుగాని, అక్కడఁ జాల బాగుగనుండును. నేనక్కడనుండియే వచ్చితిని. నీవు దానియింటివద్ద నున్నచో, నేను వచ్చుచుఁ బోవుచుండుటకును వీలుగా నుండును.

విధుముఖి యేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. హరిచరణుఁడు మరల నిట్లనియెను— "ఏమి, మాటాడవేమి? రావా? ఎందులకు రావు? ఆమెతో మాటలాడుటవలనఁ జాలసుగుణములు నేర్చుకొనవచ్చును. తెలివితేటలు గలిగి నీవును బేరుప్రసిద్ధులు గలదాన వయ్యెదవు. నీకట్టియదృష్ట ముండవలదా?"

విధు—కాళీదాసీ! ద్వారపాలకుల నిద్దఱఁ బిలుచుకొని రమ్ము. కొంచెము పని యున్నది.

కాళీదాసి "చిత్తము" ని వెళ్లిపోయెను. హరిచరణుఁడు మరల నిట్లనియెను— "ఏమి బీబీ! ఇప్పుడు ద్వారపాలకులతో స్నేహము చేయుచున్నావా యేమి? అదియే మంచిపని."

విధుముఖి యిప్పటికిని మాటాడలేదు. కాళీదాసితో వెంటనే విశాలవక్షులగు ద్వారపాలు రిద్దఱు వచ్చి వసారాలో నిల్చఁబడిరి. విధు

ముఖి యప్పు డాకస్మికముగా నతిశక్తితో లేచి నిలువఁబడి యుచ్చస్వరముతో నిట్లనియెను. "మీరు తక్షణమే యీనిర్భాగ్యుని మీమాటుజోళ్లతోఁ జితుకఁదన్నుచు నాయింటినుండి యావలకు వెళ్లఁగొట్టుఁడు. మీరింకేమియు మాటాడఁగూడదు. ఇట్టి నీజీవచ్ఛవము నాయింటిసామీప్యమునకైన రాఁగూడదు. వచ్చినచో మీకు శిక్ష కాఁగలదు."

తక్షణమే ద్వారరక్షకు లిరువురును వచ్చి హరిచరణుని రెండు బాహువులును దొరకఁబుచ్చుకొని "పద నిర్భాగ్యుఁడా, పద" యని ఈడ్చుకొనిపోఁజొచ్చిరి.

అప్పుడు హరిచరణునకు నోట మాటలేదు. ఆతఁడు నేఁటిపత్నికను విధుముఖి నెంతయుఁ జుల్కనగాఁ జూచుచుండెను. కాని విధుముఖి యాతనికడ వినయమునే యభినయించుచు వచ్చెను. హరిచరణునకు జాగరూకతగా మాటలాడవలసినయావశ్యక మెప్పుడును గలుగలేలేదు. ఆతనియజాగ్రత్తవలనిఫల మీవిధముగాఁ బరిణమించెను. ఇట్లగునని యాతఁ డెప్పుడు ననుకొనలేదు. ఇప్పు డాతఁడు తనకెంతటి యాపద తటస్థించెనో తెలిసికొనియెను. ఆతఁడు విధుముఖిని జూచి— "నీకుఁ బిచ్చియెత్తినదా యేమి విధూ! ఇంకముందు నాతో సంబంధము వదలుకొంటివా?" అనియెను.

విధుముఖి క్రోధకంపితస్వరముతో— "నీతో సంపర్కమా? నీవు నానౌకరువు. నేను నిన్ను దూరముగాఁ దరిమివేయఁగలను. నీ పాడుముఖమును రెండుచేతులతో మోదుకొనుచు నేడ్చుచుఁ బొమ్ము." అనియెను.

ఇంతపెద్దయుద్ధ మెప్పుడు జరిగినదో, యప్పు డిఁకనీమెతో సంపర్కము తనకు వదలిపోయిన దని హరిచరణుఁ డనుకొనియెను. ఇప్పు డీమె నెదిరించినచో సర్వనాశ మగుననియు నాతఁడు తెలిసికొనియెను.

అతఁడు పోవుచుఁ బోవుచు నిట్లనియెను. "మంచిది నేను పోవుచున్నా
ను. కాని, కాగితము లన్నియుఁ గచ్చేరీలో నున్నవి."

విధు—ఛీ, గాడిదా! నోరుమూసికొని దూరముగాఁబొమ్ము.
నిన్నిప్పు డెవ్వరును లెక్కచెప్పుమని కోరలేదు. నీవు మాసర్వస్వము
నపహరించితి వని నేనెఱుఁగుదును. తరువాత నీసంపత్తి యంతయు
నెవ్వరికిఁ జేఁజిక్కునో వారే యది యంతయు నిష్టమువచ్చినట్లు జాగ్ర
త పెట్టుకొనఁగలరు. నేనీజన్మములో నిఁక నీముఖముఁ జూడను. నీపే
రు వినను. ఈయడవిపంది నిప్పుడే దూరముగాఁ దరిమివేయించెదను.
ఇఁక మాటాడవలదు.

ద్వారపాలకులు తీవ్రముగా నాతనినావలికి లాగికొనిపోయిరి.
అతఁడు వెలుపలనుండియే "విధూ" అని యొకమాఱు పిలిచెను.

ద్వారపాలకులు నోరుమూయుచు "మాటాడకుము. నోరు
మూయుము! నోరెత్తిన నోటిలోఁ బొడిచెదము" అనిసడిపింపఁజొ
చ్చిరి. హరిచరణుని లాగుకొని వారావలికిఁ బోయిరి.

అత్యుద్రేకముచేతను, నతిపరిశ్రమముచేతను విధుముఖి య
లసటఁజెంది పడిపోయెను. అప్పు డామె కాతరభావముతో మంచము
పైఁ బడియుండెను. రెండుచేతులతోఁ దలఁ బట్టికొని—"నరక మిట్టి
దని యెఱుఁగను, కాని యీసాదురవస్థకంటె నరక మెప్పుడును భయం
కరమైనది గాఁజాలదు. అదృష్టము, అదృష్టము, అదృష్టము!—" అని
యనుకొనియెను.

---

## రెండవప్రకరణము.

—·—

### దీక్ష.

విధుముఖియవస్థ బొత్తుగా బాగు లేదు. నిన్నటియుదయమున హరిచరణుని దరమంగొట్టించి మూర్ఛితురాలై పడిపోయినతరువాత విధుముఖి మరల మంచముపైనుండి లేవనేలేదు; బలహీనత యధికమైపోయెను.

ఉదయ మెనిమిదిగంటలవేళ యయ్యెను. విధుముఖి యాశయ్యపై నట్లే పరుండి యుండెను. కాళీదాసి సామీప్యమందే కూర్చుండి యామెవీడిపోయిన తలవెండ్రుకలను గోళ్ళతో దగ్గఱగా దువ్వుచు నెమ్మదిగా నొక్కమాఱు లేచి కూరుచుండుమని యామెను బ్రతిమాలుచుండెను.

విధుముఖి తనలో నిట్లనుకొనుచుండెను. "నిన్న నిట్టివేళకే వచ్చినారు; నేడును రాఁగలరేమో. వచ్చిన రావచ్చును. కాని నే నాయనముఖముఁ జూడఁజాలను. ఆయనధనము, ఆయనయిల్లు, ఆయనసామగ్రి, ఆయన వెండిబంగారములు, సకలము నాయనది. ఆయన యేల రాకుండఁబోవును? నేఁడాయన రాఁగలిగినచో గుమాస్తాలు నౌకరులు నాయనను గౌరవింతురు, వృత్తాంత మంతయుఁ దాము తెలిసికొని యాయనకు వినిపింతురు. ఆయనయాస్తి యంతయు నాయన స్వాధీనము చేసికొనును. కాని నేన ట్లాయనను జూడఁగాలను. ఏమని చూడఁగలను? నేనాయనకు భార్యను గాను; దాసిని గాను; ప్రియురాలను గాను; ఆయన నేమని చూడఁగలను? ఇప్పుడాయనతోఁ బ్రియాలాపము లాడఁబోవుట కేవలము నపహాస్యము చేసినట్లు

గా నుండును. ఇంతవఱకు నత్యాచార మొనరించి మరలఁ బ్రియము లాడుటకు నోరెట్లు చెల్లును? హత్య గావించి శవమున కభ్యంగన ము చేయుట పరమమూర్ఖత గాదా. పాపము చేతనే భాసిల్లితిని; పా పముచేతనే ప్రియపడితిని; పాపతాపమందే మరణించెదను. ఈపాపము విమోచన మగునది కాదు. ఈపాపము సంపూర్ణభావముతో నాతో నచ్చినదియే. ఇప్పు డీపాపకూపములో నొకబిందువైన నింకిపోదు."

ఈసమయమునందు మేడక్రిందిభాగమునుండి, కోకిలస్వరమును, ధిక్కరించి చెడికంఠస్వరముతో నొకసంగీతరవము బయలుదేఱి విధుము ఖికర్ణపుటముల నించెను. ఆమెహృదయమున కాసంగీతరవ మమృత స్పర్శమువలె సోఁకెను. వ్యాధిచేతను, చింతచేతను బాధితురాలగుచు న్నయామెవదనమునం దానందచిహ్నము ప్రకటిత మయ్యెను. సుఖము గా నాగానము వినవలెనని యామె మెల్లగా శయ్యపై లేచికూరుచుం డెను; తరువాత నెమ్మదిగా మంచము దిగి గోడలు పట్టుకొని నడచుచు వసారాలోనికి వచ్చెను.

ప్రక్కగదిలో నొకదాసి యుండెను. విధుముఖివరాండాలోనికి వచ్చుటఁ జూచి యది తొందరగా నామెసమీపమునకు వచ్చెను. వి ధుముఖి దానిని జూచి ‹‹సంగీతము పాడుచున్నయామనుష్యుని లోనికిఁ దీసికొనిరమ్ము" అని యాజ్ఞాపించెను.

దాసి వెంటనే వీథిలోని కేగి మరలఁ బరుగుపరుగునఁ దిరిగి వచ్చి విధుముఖితో ‹‹అమ్మా! ప్రత్యక్షమైన సదాశివమూర్తి వలె వె లిఁగిపోవుచున్న యొక సన్న్యాసిబాలుఁ డాసంగీతముఁ బాడుచున్నాఁ డు. ఆయన యంతఃపురములోనికి రాఁగూడదఁట, అందుచే నిక్కడ కు రామన్నారు." అని చెప్పెను.

విధుముఖి దుఃఖస్వరముతో—‹‹ఆయన సంగీతము పాడుచు

న్నాఁ డెందులకు? భిక్షకొఱకు సంగీతముఁ బాడవలయునా?" అని యెను.

దాసి "చిత్త" మని నవ్వెను.

విధు—నీవు మరల నాయనదగ్గఱకు వెళ్లుము. ఆయనకోరిన దానికంటె నధికభిక్ష యొసఁగుదుమనియుఁ, దయగలిగి నాకు దర్శనమి మ్మనియుఁ జెప్పుము.

దాసి—నేనామాట నప్పుడే చెప్పితిని. ఆయనకోరినభిక్ష గొప్పదికాదు. అరసేరుబియ్యముకంటె నాయన యధికముగా నేమియుఁ బుచ్చుకొనరట.

విధుముఖి—ఆయన మహాపురుషుఁడు. నీవు మరల వారిసన్నిధి కేగి దయగలిగి కొంచెమునే పాఁగవలయునని చెప్పి ప్రార్థించిరమ్ము. మరల నిద్దరో ముగ్గురో నాచేతులు పట్టుకొని నడపించుచు నన్నుఁ గ్రిందికిఁ దీసికొనిపొమ్ము. నేనాయనకుఁ బ్రణామములుగావించుకొందును.

దాసి—ఆయనతో నట్లు చెప్పను. మీరు చాల నిస్త్రాణగా నున్నారు. వారిని జూడవలయునని కోరుచున్నారు. ఈసంగతి యాయనకు నివేదించెదను. దయగలిగి యాయనయే యిటకు రాఁగలరు.

దాసి మరల వెడలిపోయెను. తిరిగి కొంచెముసేపటిలోనే దేదీప్యోజ్జ్వలకాంతిసంపన్నుఁడైన యొకనవీన సన్న్యాసిని వెంటఁబెట్టుకొని యది యచ్చటికి వచ్చెను. ఆసన్న్యాసి యుమాశంకరుఁడు. ఆయనను జూచినతోడనే విధుముఖి తనమనసులో నీతఁడు సామాన్యమానవమాత్రుఁడైనసన్న్యాసి గాఁడు" అని నిశ్చయించుకొనియెను. ఆమె దగ్గఱనున్న కాళీదాసిని మఱియొకదాసిని జూచి సన్న్యాసికిఁ బీఠము వేయుమని సంజ్ఞచేసెను.

ఉమా:—గృహస్థుల యాశ్రమములలోఁ బిక్షమును స్వీకరించుటయును, అంతఃపురములలోనికిఁ బోవుటకును మాకనుజ్ఞలేదు. అమ్మా! నీబలవంతముచేతను, విశేషించి నీవు వ్యాధిపీడితురాలవై యుంటివని వినియు నేను నియమభంగము గావించుకొంటిని. గురుదేవుఁ డీయము లకు నన్ను క్షమింపఁగలఁడని నాకు ధైర్యము గలదు. కాని అమ్మా! ఇంకొక నియమమునుగూడ భంగము గావించి యపరాధినిగాఁజాలను.

విధు:—మీరు నిలుచుండి యున్నారు; నేను నిల్వఁబడలేను; సరిగదా యిట్లు కూర్చుండుటకుఁగూడ సామర్థ్యము చాలకున్నది.

ఉమా:—అమ్మా! నీవు కూరుచుండనక్కఱలేదు, నీవు చాల దుర్బలురాలవుగాను, గాతరురాలవుగాను గనఁబడుచున్నావు. నీవు పరుండి యుండుము. నేను నిరభ్యంతరముగా నీయెదుట నిలువఁబడి యే మాటలాడెదను. దినమంతయు నిలువఁబడియున్నను భిక్షుకసన్న్యాసి కేమియుఁ గష్టముండదు.

పంకుకొనుమని యుమాశంకరుఁడుపదేపదే బలవంతపఱచుట చే విధుముఖి విధిలేక పక్కపై నొరఁగెను. పీడితురాలగువిధుముఖిని జూచుచు నుమాశంకరుఁడు నిల్వఁబడియెను. ఇంతటికఠినవ్యాధిబాధ చేఁ గాంతి దరిగియుండియు నిప్పటికిఁగూడ నీస్త్రీ యెట్టియసామాన్య సౌందర్యమును గల్గియున్నదో యని యాతఁడు తనలో నాశ్చర్యము నొందుచు నామెనుజూచి „అమ్మా! నీకు వ్యాధియెట్టిది?”అని యడిగెను.

విధు:-నాకుఁ గఠినవ్యాధియే సంభవించినది. అదియిప్పుడు ముదిరియున్నది. నీవు దేవుఁడవు, నీకుఁ దెలియని దేముండును! నాపాపము లన్నియుఁ బండి నాకీయవస్థ సంభవించినవి. అందుదాని కేపాపను సంఘటిల్లినచోఁ సర్వనాశ మగునునో యాపాపమే యీపాపాత్మురాలికి

సంభవించినది. ఆపాపప్రాబల్యముచేనే ననేకదుష్కర్మము లాచరించి తిని. వానిలో ముఖ్యమైనది—ఆదుష్ప్రాణమున కే. గణ్యమైనపతిదేవ తయెడలఁ జేసిన కల్పనాతీతమైనదురాచరణము. నాపాప మనంతమైన దనియు, నప్రియమైన దనియు నేను మును పెప్పుడనుకొని యుండలే దు. కాని కొన్ని దినములక్రిందటనే యాకస్మికముగా నీరెండుసంగతు లున బోధపడినవి. నాపాపమున కెట్టిప్రాయశ్చిత్తమును లేదని నేను తెలిసికొంటిని. నాకిప్పుడు కాల మాసన్నమైనది. నీవు దేవుఁడవు. నేనీ యవస్థలోఁ జేయవలసిన దేమైన నున్నదోఁ కృపగలిగి నీవు నా కటిం గించి దక్షిణను యిల్లుచేయుటకుఁ బ్రయత్నించెదను.

ఉమా—: నీవృత్తాంత మంతయు వినుటవలన విచారమగుచు న్నది. అమ్మా! కాని, ప్రాయశ్చిత్తముకొఱకు నీవు వ్యాకులపడవలదు. నీహృదయ మనుతాపముచే నెప్పుడు దగ్ధముగాఁ జొచ్చెనో, యప్పుడే దై వనియోగముచేఁ గడపటిప్రాయశ్చిత్తము జరుగుచున్న దని తెలిసికొన వలయును. ప్రస్తుతము నీవితరచింత లన్నియుఁ బరిత్యజించి మురళీధ రుఁడైనశ్యామసుందరుని జింతించుచుఁ గాలము గడపుమని నీకుపాయ ము చెప్పుచున్నాను. అందుచేత నీదేహపీడ లన్నియు దూరములై పోఁగలవు. అంతఃకరణమును శాంతిని బొంది ప్రసన్నము కాఁగలదు. ఆతనికృపవలననె పాపపంకము లన్నియు విధౌతములు కాఁగలవు; కా వున మనోవాక్కాయములను నీవు కేవల మాతనినే చింతించుకొను చుండుము.

విను—చిత్తము. నేనెప్పుడు నీదీక్షయు నెఱుఁగను. నేఁడు నాకు దీక్ష లభించినది. మీరు నాకుగురుదేవులు. మీకుఁ బ్రణామము గా వించుకొనుచున్నాను.

ఉమా—భగవంతునకు నమస్కరింపుము ; ఆతఁడు నీమనోర

ధను లీడేర్పఁగలఁడు. నీవు విశేషధనవంతురాలవని వినియున్నాను. నీతో నీభాగ్యము లెవరున్నారు ?

విధు— ఈసంపద నాది గాదు. నాభర్త యైశ్వర్య మంతయు నాతనిని వంచించి నేను స్వాధీనము చేసికొంటిని. ఈలోకములో నాకు భర్త తక్క యాత్మీయులెవ్వరును లేరు. నేను స్వతంత్రురాలనై యాతనిని బరిత్యజించినాను. ఆయన యిప్పు డన్నవస్త్రములకొఱ కిబ్బందిఁ జెందుచు, నాసాహాయ్యము కోరి యింతదూరము గష్టపడి వచ్చియున్నా రని వింటిని. కాని, నాద్వారపాలకులు నాపూర్వప్రకృతి నెఱింగినవా రగుటచే నాయనను లోనికి రానీయక యవమానించి వెడలఁగొట్టిరి. ఆయనదర్శనము నాకింక లభింపదు; చేయరానిపాపము చేసి నేనిప్పు డాయనదర్శనము కోరుట విడంబముకాదా! నాకింక నే కోర్కె లేదు. కాని, యీయన యెక్కడ నుండెనో వెదకి పట్టుకొని యీయనసంపత్తి యాయన కిచ్చివేయవలయు ననిమాత్రము నాకిప్పుడు గాఢమైనకోరిక కలదు.

ఉమా— వంగదేశమునందు మీనివాసస్థల మేది ?

విధు— సోనాపురము.

ఉమా— నీవు విచారింపవలదు. నీస్వామిని నేను వెదకెదను. మరల నేఁటిసాయంత్రమే యిచ్చటికి వచ్చెదను. పాపపథమునుండి తొలఁగుటలో విచిత్ర మేమియు లేదు; కాని యెవ్వరు త్వరలోఁ దమభ్రాంతిని దెలిసికొని పాపములను బరిత్యజించి, చేసినపాపముల కనుతాపమును బొందుచున్నారో, వారలిహపరములు రెండిటియందును శాంతి నందుట కర్హు లగుచున్నారు. నీవు సకలవిధముల నీపాపములను దెలిసికొంటివి. ఇది యత్యంతశుభలక్షణము. ఇప్పుడు పాపము నీకధీన మయ్యెను, నీవింకఁ బాపమున కధీనురాలవు గావు. నీస్వామిఁ

చుటచే నానందితుఁడ నైతిని. భగవత్కృపచే నీవచిరకాలములోనే సకలవిధముల శాంతి నొందఁగలదానవు గావలయు నని ప్రార్థించుచున్నాను. అమ్మా! నేనిప్పటికి సెలవు పుచ్చుకొందును.

విధు—(కన్నీటితో) ఇట్టియమృతమయమైనప్రసంగము నీజీవితమునం దెప్పుడును వినియెఱుఁగను. ఇప్పుడే నాచిత్తము చాలఁ బ్రసన్నమైనది. నేఁడు నాకు సుదినము. ఈదేవతాదర్శనము మరల నాకెప్పుడు లభింపఁగలదో?

ఉమా—అమ్మా! నేను సాయంత్రమే మరల వచ్చెదను. నీ వెప్పుడును శ్రీకృష్ణచింతనము విడువవలదు.

విధు—అట్లు కాదు. నాపాపముల కెట్లు పరిమితిలేదో, అట్లే నీదయాసముద్రమునకు మేరలేకున్నది. అందుచేతనే నాహసించి మరల దర్శనమును బ్రార్థించుకొంటిని.

ఉమా—నీవందులకై చింతింపవలదు. నీస్వామిని వెదకికొని మరల సాయంత్రమే వచ్చి నీకు వర్తమానము చెప్పెదను.

విధుముఖి ప్రణామము గావించెను. ఉమాశంకరుఁడు వెడలిపోయెను.

సన్న్యాసి వెడలిపోయినతరువాత విధుముఖి యీవిధముగా భావించుకొనఁజొచ్చెను. "ఇట్టిరూప మెప్పుడును జూడలేదు. ఇట్టిమాట లెప్పుడును వినలేదు. నాహృదయభార మెంతయో తిందుపడిపోయినది. శ్రీకృష్ణు నేల చింతింపవలయును? వలదు. ధర్మముతో నాకేమి పని? పాపాత్మురాలికి మరల ధర్మమా? పాపములు నన్నంటియే యున్నవి. పాపములు నావెంటనే రాఁగలవు. పాప మనుభవింపక తీరదు. శ్రీకృష్ణుఁడు ప్రేమమయుఁడు, శాంతిమయుఁడు, సుఖమయుఁడు. నేనో? ప్రేమహీనను, శాంతిహీనను, సుఖహీనను. నేనాత్మ

ను. నేనాతనిని భావింపఁజాలను. ప్రేమతోను, శాంతిసుఖముతోను నా బ్రతుకునకుఁ గాని, చావునకుఁ గాని వియుదలమైనది. శ్రీకృష్ణుని జింతించెద నని సన్యాసినమక్షమునం దంగీకరించితిని. అతనిసన్నిధి నసత్యవాదిని నగుదును. అయిన నేమి? జీవితమునం దెప్పుడు నసత్య వ్యవహారము చేయనేలేదా? ఇంతవఱకును జేసిన వన్నియు నన్యాయ ములే, అన్నియుఁ గపటములే, అన్నియు నిస్సారములే. ఇఁక నొక్క యసత్యమునకుమాత్రి మిప్పుడు భయమేల? మిథ్యాసముద్రములో నింకొకమిథ్యాబిందువు."

---

## మూఁడవప్రకరణము.

### అధముఁడు.

ఉమాశంకరుఁ డత్యంతదుఃఖభావముతో విధుముఖి మందిరము నుండి బయలువెడలెను. పాపపుణ్యములు, ధర్మాధర్మములు మొదల గు ననేకవిషయములైనచింత లాతని చిత్తముపై నధికారము చేయు చుండెను. ఆతఁడు తనమనసులో "మానవసమాజము పురుషునిమ హాపరాధము లనేకశతములైనను సులభముగా క్షమింపఁగలదు. కాని స్త్రీయపరాధ మొక్కటియైనను క్షమింపఁదలఁపదు. శిక్షాధర్మముల బలముచేఁ జరిత్రకుఁ బలము కలిగినది. స్వభావముచే స్త్రీ దుర్బలచి త్తురాలు. దానికిఁ దోడుగా మనుష్యసమాజము స్త్రీలకు సుశిక్షయు, సునీతియు లభించుటకు మంచియనుకూల్యముల నొసంగుటలేదు. అయినను వారిసన్నిధినుండి యాసించునవిమాత్ర మనేకములు. వారి మూఁపుపైఁ బెట్టిన బాధ్యత మిక్కిలి కఠినమును భయానకము

మైనది. ఇంతకంటె వేఱొక సమున్పాయమును నిర్ణయించువిషయము లో నుదాసీనతను దాల్చి, కేవలము నొక్క కఠోర మైన యవరోధపద్ధతి పై నాధారపడి సమాజస్వామి నిశ్చింతుఁడై యుండెను. ఇఁక నేయు పాయము నైన చింతించుట యనుచితమాయేమి? ఇది గొప్పవిషమ సమస్య అని యనుకొనియెను.

ఆతరువాత నాతఁడు ''ఈస్త్రీ వృత్తాంత మేమియు నెఱుఁగను. ఈమె ధనవతియు, యువతియు ననుట ప్రత్యక్షము. ఈమె కీ సర్వనాశ మెట్లు సంఘటిల్లినదో తెలియదు. భర్తయుపేక్షయే యీమె యీయధోగతికిఁ గారణమై యుండును. కాని యాభర్తమాత్రము సహస్రపాపములు చేసియు సమాజమునం దాదరింపఁబడి స్వేచ్ఛగాఁ గాలము గడపుచుండవచ్చును; కాని మానవసమాజమునం దీసుందరి కిఁక నిలువ నీడలేదు. ఏకారణముచే సర్వనాశము సంభవించినను ప్రస్తుతమం దీస్త్రీ దయాపాత్రురాలై యున్నది. ఒకవంక నీమెరోగస్థితిఁ జూడఁగా నీమె జీవిత మింక నెన్నిరోజు దినములు నిలుచునట్లగపడదు. ఆతరువాత నీమె మనోభావముల మాఱుపాటును, నీమెయనుతాపము సు నిజముగా నీమెను దయాపాత్రురాలిని జేసినవి. ఎట్టివారికైనను దయచూచుట ధర్మము. ఈదుఃఖిని దయాపాత్రురా లేల కాఁగూడదు? నేనీమెపతిని వెదకి సాధ్యమగునంతవఱకు జ్ఞానబోధఁ గావించి యీమెను లోకముతోఁచి పాటిదానిగాఁ జేయుటకుఁ బ్రయత్నించెదను.'' అని నిశ్చయించుకొనెను.

తరువాత మరల నాతఁడు ''ఏమియు పాపముకు చేతనైన నీమెపై నిమిత్తి నీమెకుఁ జూపఁగల్గితినేని పుణ్యమే గాని పాపము గాదు. కాని కాశీనగర మొకమానవారణ్యము; ఈపట్టణమునం దాతని వెదకి పట్టుకొనుట యంత సులభము గాదు; అయినను బ్రయత్నించెదను. నీల

రతనబాబుతోను మఱికొందఱితోను జెప్పెదను. ముఖ్యముగా వెదక వలయును. ఈసమయమునందు హారకుమారబాబు బిచ్చట నున్నచో ననేకోపాయములు గావించి యుండును. సాయంత్రిమే మరల రావల యును. ఈమె భర్తృవృత్తాంత మంతయుఁ గష్టపడి తెలిసికొనవలయు ను:" అనుకొనెను.

ఇట్లనేకవిధములుగా నాలోచించుకొనుచు నుమాశంకరుఁడు మెల్లమెల్లఁగా దలవంచుకొని ముందుకు నడచుచుండెను. మార్గమధ్య మునం దొకచోట బహుజనులు గుంపుగూడి యుండిరి. అందుఁ గొం దఱు "పట్టుకొనుఁడు, పట్టుకొనుఁడు" అనియు, గొందఱు "ఏమిచేసెనాఁ డు?" అనియుఁ గేకలు వేయుచుండిరి. మరికొందఱు "అయ్యో, చావఁ గొట్టినాఁడు" "లేదు. జోడుతో రెండే దెబ్బలు కొట్టినాఁడు" "ఎందుకుఁ గొట్టినాఁడు" "దొంగఁ గాఁబోలును" ఈవిధముగాఁ జెప్పుకొనుచుండిరి.

ఆకోలాహలముఁ జూచి యుమాశంకరుఁ డొకని నింకొకఁ డె వ్వఁడో కొట్టినాఁడని తెలిసికొనియెను. రక్షింపఁగల్గినచో నందులకుఁ బ్రయత్నించుట యావశ్యకమని యాతఁడాజనసమూహములోఁ జొరఁ బడియెను. కాశిలోఁ జాలమంది యాతని నెఱుఁగుదురు. చాలమంది యాతనిని సన్మానించుచుందురు. అందుచే నచ్చటివా రనేకులు ప్రక్కపక్కలకు జరిగి యాతనికి దారి నిచ్చిరి.

ఉమాశంకరుఁ డచ్చట నొకవికారరూపుఁడు, స్థూలకాయుఁడు నగు నల్లనిమనుష్యుఁడొకఁ డసహ్యాకరముగాఁ జింకిగుడ్డలతో నిల్వఁబడి యుండుటఁ జూచెను. అతఁడు తొడుగుకొనిన చొక్కాయి రెండు మూఁడు చోటులఁ బెద్దపెద్ద మట్టిడాగులు పడియుండెను. పెద్దవిలా సపురుషవేషముతోను విలువఁగల దుస్తులతోను నలంకరించుకొనిన వే ఱొకపురుషుఁ డు డప్పొకటి చేతఁ బట్టుకొని యాతని కెమరుగా నిలు

యుండి యీ వ్యవహారము జరుగుట జూచుచుండెను. ఆమనుష్యుని భావ భంగులను జూచి యాతఁడు శోకయుక్తుఁడై యుండవలయునని యుమాశంకరుఁ డనుకొనియెను.

ఉమాశంకరుఁడు తనదగ్గఱ నున్నయొకనిజూచి “ఏమిజరిగినది?” అని యడిగెను.

అతఁ డిట్లుచెప్పెను. ఈపెద్దమనుష్యుఁ డీదరిద్రునిఁ గాలిజోడు పుచ్చుకొని కొన్నిదెబ్బలు గొట్టినాఁడు. ఎందులకో తెలియదు. అంతకంటె నేనేమియువినలేదు. నేను వినినదేమనగా—ఈపెద్దమనుష్యుఁ డాతనిఁజూచి “మరలఁ గాశికి వచ్చినావా ఫాజీ? నీవిక్కడకు వచ్చుటచే నాకు సర్వనాశ మైనది. నిన్ను నేఁడో రేపో, యెముకలూడఁదీయించెదను చూచుకొమ్ము” అనియెను. ఆదరిద్రుఁడును వానికిట్లు సమాధానము చెప్పెను. “మనుష్యుఁ డెంతవఱకు సర్వనాశము గాఁగలఁడో నీవు నన్నంతవఱకును జేసితివి. నేను నీకెప్పుడు నొక్కయనిష్టమైనను జేసి యెఱుఁగను. చేయుటకు నాకు సామర్థ్యమును లేదు.” ఈవిధముగా రెండుమాటలు జరిగినతరువాత నీపెద్దమనుష్యుఁ డీతని జెప్పుతోఁ గొట్టెను.

ఉమాశంకరున కాదరిద్రునియవస్థ చూడఁగా నించుక కష్టము తోఁచెను. ఆతఁ డవమానితుఁడై యధోముఖుఁడై నీరవుఁడై నిలువఁబడి యేమోకొంత చింతించుచుండెను. ఉమాశంకరుఁ డాతనిని సమీపించి యిట్లనెను—“మహాశయా! ఆతఁడు నిన్నుఁ గొట్టెనా?”

ఆవిలాసవేషి సన్యాసిని జూచి “ఓహో! నీవెవ్వరవయ్యా? తలకు రుద్రాక్షలు చుట్టుకొని, జోలి చంకఁబెట్టుకొని తగవుదీర్చుటకు మధ్యస్థుఁడవుగా సిద్ధమైనావా? నిన్నెవరు పిలిచినారు? నీవు సన్యాసివి గాదా? పొమ్ము. నీదారి నీవు చూచుకొమ్ము” అనియెను.

అనంతపు సురాపాయి యని యుమాశంకరుఁడు గ్రహించుకొని యిట్లనియెను. "నేను మిమ్ముల న్యాయపుసంగతు లేమియు నడుగలేదు. నీవీతనినిగొట్టకుమని. అతఁడు కొట్టినాయనిమాత్రము నేనడిగితిని. ఇంత మాత్రమునకే నీవుకోపము చేసెద వేల?

విలాసపురుషుఁడు—నీకు లోకవ్యవహారములతోఁ బనిలేదు గదా! నీకీసంగతు లన్నియు నెందులకు? మాలోమేము కొట్టుకొందు ము, తిట్టుకొందుము. నీకేల?

ఉమా—నీమాట సత్యమే. కాని మహాశయా! అన్యాయ ముగా నౌకరిపై నౌకరు దుండగము చేయుట నియమవిరుద్ధము. నీవు నన్నేమనినను నాకు బాధ లేదు. కాని యిట్టిపని నీకు మంచిదిగాదు.

విలా—నీవు నిర్భాగ్యునివలె నున్నావే. నీకుఁగూడ దెబ్బలు వ్రాసియున్నవి! నాపని మంచిదో చెడ్డదో నిర్ణయించుటకు నీ వెవఁడవురా?

ఇట్లనుచు నాతఁడు తనచేతిలోనిపాదరక్షతో నుమాశంకరుని గొట్టెను. తత్క్షణమే యచ్చటివా రనేకులు వచ్చి వాని నాక్రమించిరి. వెంటనే ఛడావులు, బూట్సులు, పైజార్లు మొదలగుపాదరక్షలతో వా నిపై దెబ్బలవర్షము గురియఁజొచ్చెను. వాఁడు నేలపైఁ బడిపోయెను. అతనివిలువఁగలవేషభూష లన్నియు జనులపాదరక్షలచే నెక్కడికో యెగిరిపోయినవి. ఒంటి నంటుకొనియున్నపట్టుచొక్కాయి తునుకతు నుకలుగాఁ జినిగిపోయెను. తలబ్రద్దలై రక్తము ప్రవహింపఁజొచ్చెను. ఉమాశంకరుఁడు వారందఱను చేతులు పట్టుకొని బతిమాలుచు నా తని నట్లు కొట్టవలదని నివారింపఁజొచ్చెను.

ఆవిలాసపురుషుఁడు తనకోపముఁ దనప్రతాపము నిచ్చటఁ జెల్ల వని తెలిసికొని మెల్లమెల్లఁగా లేచి యొడలిదుమ్ము దులుపుకొనుచు

నప్పుడే యందఱు వెడలిపోయిరి..

ఉమాశంకరుఁ డప్పు డాదరిద్రుని సమీపించి యిట్లని యడిగెను. "మీ రెవ్వరు? ఎందుల కాయన మిమ్ముఁ గొట్టినాఁడు?"

దరి—నే నెవ్వరినో చెప్పుటవలన నేమియు లాభములేదు; చెప్పుటకు హితము లేదు. నేను నిర్భాగ్యుఁడను. ఒకఁ డొకప్పుడు నాకు సేవకుఁడుగా నుండెను. తరువాత నాతఁడు నన్నుఁ గ్రమముగా సర్వనాశనము గావించి వీధిబిచ్చగానిని జేసివేసెను. నేనిప్పు డాతనికి మరల నెదుటఁ బడితిననుకారణము తక్క నింకేమియుఁ గారణములేదు. నన్నిప్పుడు నిష్కారణముగానే యాతఁడు కొట్టినాఁడు. నాయదృష్టము నన్నిట్లు గన్నది. నానిర్భాగ్యత్వము తలమునుకలుగా నున్నది. ఇంకను నేమికానున్నదో యెఱుఁగను.

ఉమా—మీ రీయూరిలో నెక్కడ నుంటిరి?

దరి—బిచ్చమెత్తుకొనుచు నెక్కడనో యొక్కడఁ గాలక్షేపము చేయుచున్నాను.

ఉమా—మీరు నాతో రావలయును. మీభోజనాదికములకు నేను సదుపాయము గావించెదను.

ఇరువురును వెడలిపోయిరి.

ఇందాఁకటివాఁడు హరిచరణుఁ డనియు, నీతఁడు శ్యామలాలని యుఁ బాఠకులు గ్రహించియే యుందురు. శ్యామలాలిప్పుడు బిచ్చగాఁడై పోయెను. విధుముఖిహరిచరణులు పశ్చిమయాత్రకు బయలుదేఱినతరువాత శ్యామలాలు కష్టములు పూర్తిగను వర్ధిల్లఁజొచ్చెను. క్రమముగా నాతఁడు తిండికి గుడ్డకుఁ గూడఁ గష్టపడఁజొచ్చెను. ఒక్క పైసైనఁ జేతిలోఁ బడుట కుపాయములేదు. విధుముఖిహరిచరణులధనసామగ్రియు, నల్పకాలములోనే వారు నశించిపోయెనని చెప్పఁజాలము; ఏమన? వారు బ

యులు దేఱుటకుముందు ధనపత్రము లన్నియు జాగ్రత్తపఱచుకొని నలు గురుద్వారపాలకులనుమాత్రము గృహములోఁ గావుంచి తక్కినసేవ కులందఱను దీసివేసి వచ్చినను శ్యామలాలుని భోజనమునుగూర్చి యే ర్పాటుచేయుటమాత్రము వారు మఱచిపోలేదు. శ్యామలాలునకు రెండుపూటలును నాల్గేసిమెతుకులు పెట్టునట్లుగా నొకబ్రాహ్మణు నే ర్పాటుచేసి మఱియు వచ్చిరి. అతఁ డెప్పుడును హీనముగా భోజన ము చేయుట యభ్యాసము లేనివాఁడగుటచే నాబ్రాహ్మణుఁడు పెట్టు చుండెడి దరిద్రభోజనము శ్యామలాలునకు మిక్కిలి కష్టముగా నుండె డిది. కాని యదియును గ్రమముగా దొరకుట కష్టమైపోయినది. శ్యా మలాలునికి భోజనము పెట్టుటకు విధుముఖీహరిచరణులచే నియోగిం పఁబడిన బ్రాహ్మణుఁడు శ్యామలాలునిఁ జూచి, డబ్బంతయు నైపోయి నదనియు, బీదబ్రాహ్మణుఁడను నేను నీకెక్కడఁ దెచ్చిపెట్టఁగలనని యుఁ జెప్పుచు నచిరకాలములోనే యాతనికి భోజనము పెట్టుట మా నివేసెను. ఆహతభాగ్యుఁడై నశ్యామలాలుఁ డప్పుడు నిరుపాయుఁడై హ రిచరణున కుత్తరము వ్రాసికొనుచు విధుముఖిని గొంతధనమునకు యా చించెను. ఆయుత్తర మాతని కందెనో లేదో దైవమునకే తెలియును. కాని శ్యామలాలున కెట్టిప్రత్యుత్తరమునుమాత్రము రాలేదు. అతని విషయములో నింక నెట్టియేర్పాటును జరుగనులేదు. శ్యామలాలు కట్టుగుడ్డ లన్నియు నమ్ముకొనియెను. కాలిజోళ్ళన్నియు విక్రయించు కొనియెను—అత్యంతకష్టముతో దినములు వెళ్లఁబుచ్చుచుండెను. చిట్టచివర కొనరాధముఁడు తాను వరుండెడిశయ్యను విక్రయించుకొని పదిరూప్యములు సంగ్రహించుకొనియెను. కాని హరిచరణుఁడును విధుముఖియుఁ గాశికి వచ్చినారని విని, కాశీపట్టణమునకుఁ బ్రయాణ ము చేసెను. కాశికి వచ్చి కొన్నిమాసములకే యాతఁడు దేహము విడు

డెను. ఒకనాఁడు విధుముఖిదర్శనము చేసికొనుటకు కాతఁడు ప్రయత్నము చేసెను ; కాని ద్వారపాలకులు విధుముఖియంతఃపురములోఁ బ్రవేశించుటకు శ్యామలాలున కధికారము లేదని యెఱుఁగుదురు గనుక నాతని నంతఃపురములోనికిఁ బోనీయక యవమానించి వెడలఁగొట్టిరి. ఉదయమునందే యీకథ యంతయు జరిగినది. అయినను హతభాగ్యుఁడు, నిస్తేజుఁడు, నవమానితుఁడు నై నశ్యామలాలిప్పుడు మరల విధుముఖియింటికి బయలుదేఱెను. ఎట్లయిన నొకమాఱు కబురంపి, యెట్లయిన నొకమాఱు దర్శనము చేసికొని విధుముఖ యనుగ్రహము సంపాదించుకొనఁగల ననియే యీహతభాగ్యుని కాశ. అలఁ డాయుద్దేశముతోనే బయలుదేఱెను. మార్గములో హరిచరణునిదర్శనము దొరకెను. ఆతని జూడఁగానే యీనవదమీపుఁగ్రై నశ్యామలాలున కమితాహ్లాదముదయించెను. ఇఁక నేమైనను గాకపోయినను ప్రస్తుతము హరిచరణుఁడు విధాయకముగాఁ దనకొక్కింతధనసహాయము చేసెదరుని యాతఁడు తనలో నిశ్చయించుకొనియెను. ఆతఁడు హరిచరణునిధనసహాయముకొఱకుఁ బ్రార్థించెను. ఆతరువాత నేమేమి జరిగినదో పాఠకమహాశయులకుఁ దెలియకపోలేదు. హరిచరణుని కాలిచెప్పులతో దెబ్బలుతినుటకుఁ గూడ నాతనియదృష్టములో నున్నది. అదియు నైనది.

హరిచరణుఁ డుదయమున విధుముఖిచే మిక్కిలి యవమానము, ననాదరముఁ బొందినాఁడు. ఇప్పుడుగూడ నాతఁడు మిక్కిలి యనాదరము నవమానముఁ బొందినమాట నిజమే కాని యాతని కది యంత బాధాకరముగా లేదు. ప్రొద్దుట జరిగినవ్యాపారమే యాతనికి గురుతరమైనహృదయశల్యముగా నున్నది. తనకు విధుముఖిసమాగమ మంతయు నేటితోఁ జెల్లిపోయిన దనియు, విధుముఖితోడిసంపర్క మంతయు నేటితో వదలిపోయిన దనియు నాతఁడు నిశ్చయించుకొనియెను.

కాని విధుముఖితో సంబంధ మొక్కమాఱుగానే విడిపోవుట యాతనికి సమ్మతము గాదు. నిజము చెప్పఁబోయినచో నాతఁడు చక్కఁగాఁ బదియాకలు జాగ్రత్తపెట్టుకొనియెను. కాని యాతనికి వ్యయము విస్తారము. విధుముఖి తనచేతిలో నున్నచోఁ గర్చునకు దిగులుండదు. దివాన్గిరీ చలాయింపవచ్చును. సకలసుఖములు ననుభవింపవచ్చును. విధుముఖి కీపరివర్తన మాకస్మికముగాఁ గలుగలేదు. చాలదినముల నుండి విధుముఖి ధర్మాధర్మములనుగూర్చి ప్రసంగింపఁజొచ్చెను. చాలదినములనుండి యామె మనోభావములేమొ మార్పుచెందుచుండెను అనేకదినములనుండి యామె మాటిమాటికిఁ దనభర్తనుగూర్చినమాటలను, భర్తయెడలఁ గావించినయన్యాయములును జెప్పుచుండెను. అనేకదినములనుండి హరిచరణుఁడు హీనమానవుఁడని గ్రహించుకొనియెను. చాలదినములనుండియు హరిచరణుని దుర్వ్యాపారములనుగూర్చి పర్యాలోచించుచుండెను. ఇది యాతఁడు జూచి హరిచరణుఁడు విధుముఖి మనసు పాడైపోయిన దని భావించుకొనియెను. విధుముఖి నాతఁడు "వైష్ణవివై పోయెదవా యేమి? హరినామస్మరణను చేయుచుఁ దంబురా పుచ్చుకొని తిరుగుచుందువు." అని వేళాకోళములు చేయఁజొచ్చెను. అంతియేగాని యామెమనస్సింకను నెంతవఱకుఁ బాడైపోవునో యనిమాత్రము హరిచరణుఁ డొకమాఱును నాలోచించుకొనలేదు. ఇప్పు డాతఁ డిట్లనుకొనియెను—"విధుముఖి బంగారురూపమంతయుఁ భగ్నమైపోయెను. ఇంతమార్పు—ఇంతభయానకమైనమార్పింతలో నేల కలిగెను? ఏమైననుసరే, మనసులోని యాశల నెవ్వరు సులభముగా విడిచిపెట్టఁగలరు? ఒక్కమాఱుగా నేను నాయాశలన్నియు విడుచుకొనలేను. ఆమెమనసు మరల నెందులకుఁ దిరుగదో చూచెదను. కోపావేశముచే విధుముఖి నన్నిట్లు దయుమఁగొట్టించి యుండు

ను. కాని కోపము క్రమముగా నదియే చల్లారిపోఁగలదు. అదియెట్లు వచ్చునో అట్లే పోవును." ఈవిధముగా నాతఁడు ధైర్యముఁ దెచ్చుకొనుచు గుండె దిటవుపఱచుకొనుచు నాతఁడు మరల విధుముఖిం గాంచుటకై యొకమాఱు పోవలయు నని బయలుదేఱి వెళ్ళెను. కాని ద్వారపాలకులు వానిని లోపలికిఁ బోనీయరైరి. అక్కడఁ గాచుకొనియుండుటకుఁగూడ వారు సమ్మతింపరైరి. అవమానకరము లైనమాట లనేకము లాడుచుఁ, దక్షణమే యటనుండి వెడలిపోకున్నఁ జావమోఁదెదమని బెదరింపఁ జొచ్చిరి. ఎంతవఱకు సర్వనాశము గావలయునో, యంతవఱ కైనదని హరిచరణుఁడు తలఁచుకొనియెను. ఆశ లన్నియు హతమై పోయినవి. ఆతఁ డప్పుడు విధుముఖిమీఁదను, హరిచరణుని మీఁదను, ద్వారపాలకులమీఁదను మర్మాంతికమైన మహాక్రోధముతో వెడలిపోవలసినవాఁ డయ్యెను. మార్గమధ్యమునం దాకస్మికముగా శ్యామలాలుని జూచినప్పు డాసురాపాయి దగ్ధహృదయములో, నీశ్యామలాలుని రాకవలననే తనకు సర్వనాశనము సంభవించిన దని తోఁచెను. ఆతరువాత శ్యామలాలు సహాయముకూడఁ గోరెను. మర్మాహతుఁ డైనహరిచరణున కామాట వేఁటకోలమువలెఁ గనఁబడియెను. ఆతఁ డప్పుడు కోపావేశముచేఁ గాలిజోడు తీసి శ్యామలాలునకుఁ బ్రహారము లర్పించెను. ఆహా! ఒకానొకకాలమం దెవ్వఁడు తనయజమానుని సంతోషపఱచునిమిత్తమై యెట్టినీచకృత్యము లాచరించుట కైనను వెనుకంజ వేసి యెఱుఁగఁడో, వాఁడు నేఁడు స్వేచ్ఛగా, ఆయజమానుని దనపాదరక్షలతో మోఁదినాఁడు. ఒకానొకసమయమునం దెవ్వఁడు తనజీవనమున కివ్వానియనుగ్రహము ముఖ్యాధారమని భావించుకొని యుండెనో, వాఁడు నేఁడాతని, జనాకీర్ణమైనరాజవీథిలోఁ బాదుకలచేఁ బ్రహరించెను!

తెప్పనగాది ? శ్యామలాలు, వినుము, హరిచరణుఁడు, నీముగ్ధ రిపోని యధికాపరాను లెవ్వరు ? ఎవ్వరియపరాధ మధికమైనదో కాని, శ్యామలాలూ ! న్యాయస్వరూపుఁడైన భగవంతుఁడు నీయత్యాచారములకును, అవివేచనాసమూహములకును, యథేష్టముగా నుచిత శాంతిని సంఘటించినాఁడు, సందేహము లేదు. ఎందులకు నీవు నిర్భాగ్యుఁడవై పరస్త్రీలను సర్వనాశము చేయుటకే సదా పాటుపడుచుండెడివాఁడవు ? నీధర్మపత్నియైన వనితను నీవొక్కమారైన నెందులకుఁ గన్నెత్తి చూచెడివాఁడవు గావు ? ఎందులకు నీవామెతో నొక్కనాఁడైన నోటిమాటయు నాడెడివాఁడవు గావు ? ఒకప్పుడైన నామె నెందుల కించుకయు నాదరించెడివాఁడవు గావు ? నీపాపమున కంతములేదు. దానిశాంతియు భయానకమైనదే. కాని యింతటితో నీకుఁ బాపము శాంతించునా ? ఎవరు చెప్పఁగలరు ?



---

## నాలుగవప్రకరణము.

### నిరుద్దేశము.

అపరాహ్ణకాలమునం దాపాండవఘట్టములో, నాసౌధమున, నాగదియం దాశయ్యపై శయనించి విధుముఖి తలగడచే మోము గప్పికొని యేడ్చుచుండెను. పాపములరాపిడిచేతనో, యనుతాపముల ప్రాబల్యముననో, కాక యేకారణమువల్లనో గాని సుందరడెందము వ్రయ్యలై కన్నుల నీరు ప్రవహించి తలగడను దడిపివేయుచుండెను. ఆమెయొద్ద నింకెవ్వరును లేరు. చాలసేపీవిధముగా నామె రోదనము చేసెను. అకస్మాత్తుగా ప్రాంతశాలలో నెవ్వరో నడచుచున్నట్లు చప్పుడు

పిలంబడి, యామె పక్కనుండి యొత్తిగిలి యాపంకకుఁ జూడఁగలిగెను. ఎట్టయెదుట శాంతిపూర్ణము, నానందపూర్ణము, తేజఃపూర్ణము నైన యుమాశంకరుని దేవమూర్తి యామెకుఁ బ్రత్యక్షమయ్యెను. అతి కష్టముపై నామెలేచి యాయనకుఁ బ్రణామము గావించి యిట్లనియె ను. "ఇప్పుడే మీదర్శనము లభించుట నాపరమభాగ్యము."

ఉమా:—అమ్మా ఇదియేమి? ఏడ్చుచుంటి వెందులకు? నీవు కాతరత నొందుచుంటి వేమి?

విధు:—కాతరత్వమా! ఎందులకు? క్రొత్తగాఁ గాతరత్వ మేమి యు లేదు. నాశరీర మంతయు, హృదయమంతయు నపవిత్రము—పాపతాపపరిపూర్ణము. కాతరత్వము కేవలము నాకు సహచారిణి. ఇఁక రోదనమా! రోదనమే యిప్పుడు నాకు బత్తెము. చేతిలోనిలక్ష్మిని గాలితోఁ దన్నుకొన్నవా రెవ్వరో, స్వేచ్ఛగాఁ దమపాదములనుదామ కత్తితో ఖండించుకొన్నవా రెవ్వరో, పాపమునందుఁ బ్రమత్తులై స్వర్గసుఖమునకుఁ బదాఘాత మిచ్చినవా రెవ్వరో, వారు దుఃఖింపకున్న నింకెవ్వరు దుఃఖించెదరు?

మరల విధుముఖకన్నులనుండి బాష్పధార లురులఁజొచ్చెను. మరల నామెకన్నులు తుడిచికొని యిట్లనియెను. "నాదుఃఖమును మీరు పరిగణింపవలదు. నేటితోను, రేపటితోను, మరి పదినాళ్ళతోను దుఃఖము నాకు సమాప్తము కాఁజాలదు."

ఉమా:—రోదనము చాల శుభలక్షణమమ్మా! చిత్తమున కత్యంతకోమలత్వమును, దీనత్వమును గలిగినప్పుడుగాని దుఃఖము క నంబడదు; అశ్రుధారలు కేవలము నధికకోమలత్వసూచకములు. అహం కారము, తేజము, పాపప్రాబల్యము, అధర్మకాఠిన్యము మొదలగు ల క్షణములచే హృదయ మెప్పుడు నేకాంతకోమలత్వము, నత్యంతదీన

త్వముఁ బొందఁజాలరు. మంచిమార్పునకు సూచనలు చేరువగుటచే నే నీకుఁ గన్నీరు జాఱుచున్నది; అదియే యంతరంగమునఁ బ్రేమ, క్షమయు, పుణ్యబుద్ధియు నావిర్భవించినట్లు తెలియఁజేయుచున్నది. అమ్మా! అందుచేతనే రోదన మత్యంతమంగళజనకమైనది. ధైర్యముఁ దెచ్చుకొనుము. ఈయశ్రువారి నీహృదయప్రదేశమునందలి పాపపంకమును ప్రక్షాళితము చేయుచుఁ బ్రవహించుచున్నది.

విధుముఖి యాలావణ్యవిహీనమైన—యావ్యాధిపీడితమైనవదనమునుండియొక్క విషాదమందహాసము ప్రకటితమైనది. ఆమె యామాశంకరునిఁ జూచి యిట్లనినది—"నాయీరోదనము నాకొకశుభసూచకమగునో కాదో నాకుఁ దెలియదు; కాని జీవనమునందును, ఆతరువాతనుగూడ రోదనమే నిరంతరము నన్ను వదలనిదని నాకుఁ దెలియును. నాజీవన మింకఁ గొలఁదిదినములకంటె నధికముగా నిలుచునది గాదు. ఇది నాకు నమ్మకమే. ఈకొలఁదిదినములదుఃఖముతోనే నా దుఃఖము సమాప్తి కాదు. మరణము తరువాతఁ గూడఁ గొన్నియుగములవఱకు గొంతయసంఖ్యాకమైనకాలము నేనిట్లే నిరంతరము నేడ్చుచుండెదను. మీరు నాకు గురువులు. మీవద్ద నసత్యము చెప్పఁజాలను. నేను పాపపుణ్యములను, స్వర్గనరకములను, ధర్మాధర్మములను గొంచెమైనఁ బాటించి యెఱుఁగను. ఈదేహములో నీదేహముకంటె వేఱైనవేఱొకస్థిరపదార్థము కలదు. ఈసంగతి నేనెప్పుడును గ్రహించి యుండలేదు. ఎప్పుడును సుఖమునందే లక్ష్యముంచితిని. ఈవర్తమానసౌఖ్యము మఱిమఱియు ననుభవించునిమిత్త మేమిచేయుటకైనను సిద్ధమైతిని. ఆకస్మికముగా మీదర్శనము లభించినప్పటినుండియుఁ గ్రమముగా నాచిత్తమునకు మార్పు గలుగుచువచ్చినది. ఈస్వల్పకాలములోనే నేను నాభ్రాంతినిమార్చి తెలిసికొనఁగలిగితిని. ఈదేహముతోడి

సంబంధము మిక్కిలి యస్థిరమైనదనియు, క్షణికమైనదనియుఁ దెలిసి
కొంటిని; ఈజన్మముతోడనే మనకుఁ బరిసమాప్తి కానేరకుండుటఁ దెలిసి
కొంటిని. మఱియు హితాహితకర్మజనితములైన ఫలములు మనల నె
ప్పుడును విడుచునవి కావనియు గ్రహించుకొంటిని. "ఇట్లుండుటచే
తనే రోదనము చేయుచుంటిని. మఱియు ననంతకాలము రోదనము
చేయుచుండఁగలనని స్థిరపఱుచుకొంటిని."

ఉమా—జయ్ శ్రీహరి. మోక్షసిద్ధిముం దెట్టితెలివి కలుగఁగ
లదో, అదియే నీకుఁ గల్గినది. జ్ఞానోదయ మెప్పు డగుచున్నదో య
ప్పుడే చిరసంచితపాపరాశి భస్మీభూతమై పోవుచున్నది. నీహృదయ
మునందు జ్ఞానోన్మాదము కల్గినది. ఈజ్ఞానము ప్రసరించినకాలందిని
నీవు పరమపుణ్యవతివై దేవత్వము బొందఁగలవు. ఇఁకఁ బాపము నీస
మీపమునందును నుండఁజాలదు. నీవు కృష్ణచింతన మొనరించుచుం
టివా?

విధు—లేదు. శ్రీకృష్ణచింతన మెందులకు? నీవే పురుషోత్త
ముఁడ వని నేను నమ్మితిని. ఇఁక నాకు శ్రీకృష్ణచింతనముతోఁ బ్రయో
జన మేమున్నది? నేను మనోవాక్కాయములచే నిన్నే పరిపూర్ణబ్ర
హ్మముగా గ్రహించి చింతించుచున్నాను.

ఉమా—నేను క్షుద్రమానవుఁడను. నన్ను దేవతగా భావిం
చుటకు నేను దగినవాఁడను గాను. అయినను నీవు నన్నుఁ బూర్ణబ్ర
హ్మముగా భావించి చింతించుచున్నావు. అట్లయినను నీకు ఫలప్రా
ప్తి గల్గుట కభ్యంతరము లేదు. ఈవిశ్వమునందలిసమస్తవస్తువులును
బ్రహ్మమయములే. మనుష్యులు, దేవతలు, స్థావరములు, జంగమము
లు నన్నిటియందు నాపరమపురుషుఁడు విరాజిల్లుచున్నాఁడు. బ్రహ్మ

పరోధముకొఱకుఁ బ్రథమాధికారి యాపద్ధర్మము నవలంబించినను హానిలేదు.

సి.ధు—నీవు క్షుద్రమానవుఁడ వైనను నిన్నుఁ బూజ్యపురుషుఁ డని నేను దెలిసికొంటిని. నాకుఁ దెలియదని నేను స్వప్నమందైనను నమ్ముదునా? నేను నేఁటిమధ్యాహ్నకాలమునం దత్యద్భుతమైనకలఁ గంటిని—భయంకరులైన నలుగురు దొంగలు నన్నుఁ గాలుసేతులు పట్టుకొని యొకనల్లనిఘోరసముద్రములోఁ బడవేసిరఁట. నేను క్రమముగా నాజలములలో మునిఁగిపోయితిని. ఆజలము లెంతో లోతుగా నున్నవి. నేను జాలసేపటి కాజలమునం దడుగుముట్టితిని. ఎప్పుడు నెఱుఁగని—సహింపఁజాలనియాతన ననుభవించుచు నేనప్పుడు స్పృహ లేకుండ నుండి యాచెప్పనలవిగాని భయంకరఘోరబాధ యధిక మగుటచే నేనప్పుడు జలించిపోవుచు మృతప్రాయురాలనై పోయితిని. నాకప్పుడు మృత్యువొక్కటే కోరఁదగినదిగాఁ దోఁచి యేకాంతచిత్తముతో మృత్యువున కెదురుచూచు చుంటిని. ఈఘోరయాతనలో నుండి బయలుపడుట యసంభవమనియు, నసాధ్యమనియు నేను దెలిసికొంటిని. ఇట్టియవస్థలోఁ బరమశోభామయుఁడును, తేజోవిరాజితశరీరుఁడును, బ్రసన్నవదనుఁడు నైనమహాపురుషుఁ డొకఁడు, భయంకరమైనయాజలరాశిని భేదించుకొని నాదగ్గఱకు వచ్చెను. అట్లు వచ్చి యాతఁడు తనహస్తమును నామస్తకమునం దుంచి తనకుడిచేతిని జాచి నాకు జలరాశిని దాఁటి యావలికి రాఁగలమార్గమును జూపించెను. వెంటనే యానందముతోను, సంతోషముతోను నాహృదయము నిండిపోయెను. నేననుభవించుచున్న దావాగ్నివంటి నాబాధ యప్పుడు చల్లారెను. ఎప్పుడు ననుభవించి యెఱుంగని శాంతిసుధచే నాచిత్తము తటాకించిపోయెను. తరువాత నామహాత్ముఁడు చూపినమార్గమును

బట్టి నడచుటను లేచితిని—నిద్రాభంగ మయ్యెను. అప్పుడు నానిత్య సహవాసినులైన యాపరితాపము, నాయాతనయు వచ్చి నాపై నధికారము చేయఁజొచ్చిరి. స్వప్నములోఁ దోఁచినక్షణికసుఖమును దలఁచుకొనుచు నేనప్పుడు రోదనము చేయుచు నీరోదనముతో నాకెడతెగనిసంబంధ మున్నదని నేను దెలిసికొంటిని. దానికేమి గాని, నాస్వప్నములో దర్శనమిచ్చినమహాపురుషుఁ డెవ్వరో మీరు చెప్పఁగలరా?

ఉమా—అతఁడు దేవుఁడు.

విధు—అయిన నాదేవుఁడవు నీవే. నేను స్వప్నమునందు నిన్నే దర్శించితిని. కనుక నీప్రత్యక్షదేవతను వదలి యన్యదేవతను జింతించుటవలనఁ బ్రయోజన మేమి? ఇఁక నేను నిన్నే నిరంతరము ధ్యానింతును. నాయంతరంగదుఃఖము శాంతించుకొఱకు నీచరణద్వయముపై వ్రాలియే దుఃఖించెదను.

ఉమా—భగవంతుఁడు నీకు నిశ్చయముగా శాంతిసుఖము నొసఁగఁగలఁడు. ఇప్పుడు నేను నీభర్తను గలిసికొంటిని. ఆయనకు భోజనాదిసముపాయములు కనుకూలమగుచోటఁ దగినయేర్పాటు గావించితిని. నీసమ్మతి తీసికొని యాయనను నీవద్దకుఁ దీసికొని రాఁగలను.

విధు—ఆయనదర్శనము చేయుటవలన నాకుఁ బ్రయోజనమ్ము లేదు. మీరనుగ్రహించి యాయనను గృపమాచు చుండవలయును. ఆయన విషయలోలుఁడు, బుద్ధిహీనుఁడు నైనవిలాసపురుషుఁడు. మీరాయనయెడల దయ యుంచవలెను. ఎప్పు డాయనకు మీదర్శనము లభించినదో యప్పుడే యాయన బాహ్యాంతరకష్టములన్నియుఁ దీఱిపోయినవి. మీరాయనతో "మీపాపాత్మురా లైనభార్య మీముఖ మింకఁ జూడఁజాల" దని చెప్పఁగోరుచున్నాను. నేనిప్పుడు మునుపటి యంతదుర్బలురాలను గాను. నాప్రాణ మాకస్మికముగాఁ బోవునచో

నాయనధనసంపత్తి యంతయు నాయనకుఁ దిరిగి వ్రాసియిచ్చివేయు చున్నాను. ఈధనసంపత్తి యంతయు నాయనది. ఆయన యున్నవ స్త్రములను గైకొనుటకుఁగాని యాయనధనమును వెచ్చించుటకుఁగాని నాకేమియు నధికారము లేదు. అందుచే నేనింక నన్యేమియుఁ జేయఁ జాలను. నేనొకవేళఁ జాలదినములు జీవించి యుండవలసినచో మీచ రణధ్యానము గావించుకొనుచు భిక్షాటనము చేసికొందును. పతిదేవత సన్నిధిని నేనింకఁ గోరవలసిన దేమియు లేదు. నీదయవలన నాకు మానసికశారీరకవ్యాధులు క్రమముగా నివారణము లగుచున్నవి. అ పార మగునీకృపనుండి నన్నిప్పుడు వంచితను జేయవలదు. నన్ను నీపాదసన్నిధిచేఁ గృతార్థురాలిని గావింపుము.

ఇట్లనుచు వ్యాధిపీడితురా లగువిధుముఖి లేచి వచ్చి యుమా శంకరునిపాదధూళిని దీసికొని శిరమున ధరించుకొనినది. ఉమాశం కరుఁ డామెను జూచి—“భగవంతునికృపవలన నీమనోరథము సిద్ధిం పఁగలదు. నేనిప్పుడు పోయి వచ్చెదను. నీభర్తయభిప్రాయముఁ దెలి సికొని నీకు మరల త్వరలోనే తెలిపెదను.” అనియెను.

ఉమాశంకరుఁడు వెడలిపోయెను. మఱునాటి యుదయమున శ్యామలాలును వెంటఁబెట్టుకొని యుమాశంకరుఁడు విధుముఖిమందిర మునకు వచ్చెను. విధుముఖిసౌధమునందుఁ బోలీసువారును గ్రామస్థు లును భయానకముగా మూఁగియుండిరి. ‘పోలీసుసూపరింటెండెంటు, ‘ఇ నస్పెక్టరు’ ‘హెడ్డు’ ‘కానిస్టెబిలు’లు మొదలగు రాజకర్మచారులును, ఇతరజనులు నాస్థలమును జనారణ్యము గావించిరి. ఉమాశంకరుఁ డ క్కడఁ దానెఱిఁగియున్న యొకపెద్దమనుష్యునివలన సకలవృత్తాంతముఁ దెలిసికొనియెను. కడచినరాత్రి రెండుజాములవేళ విధుముఖి యంత ర్ధానము నొందెను. కాశీవాసికి రెండుజాములవేళ నిద్ర మెలఁకువ వ

చ్చుటచే నది యప్పుడు లేచి విధుముఖి కేమి కావలయునో యని యామెశయ్యవంకఁ జూచెను. శయ్య వట్టిదిగాఁ గనఁబడియెను. అది వెంటనే లేచి యిల్లంతయు వెదకి యామె కనఁబడకుండుటచేఁ దక్కినదాసివాండ్రందఱను నిద్రలోనుండి లేపెను. వారందఱును లేచి నానాస్థానముల వృథాన్వేషణము గావించుచు ద్వారపాలకులుమొదలగువారందఱను నిద్రనుండి లేపిరి. ఎవ్వరు నేవిధమైనజాడయుఁ గానలేక, ఇఁకఁ జేయునది లేక పోలీసువారికిఁ దెలియఁజేసిరి. పోలీసువారును యథావిధిగా వెదకిరి. అయినను నీవంగదేశపురాణి వారి కెక్కడను గనఁబడలేదు. ఇప్పుడు పోలీసుకచేరినుండి సూపరింటెండెంటుగారు స్వయముగా వచ్చి వ్యవహార మంతయు జరిగినది జరిగినట్లుగాఁ దెలిసికొని సంగ్రహము చేసికొనియెను.

ఉమాశంకరుఁడును శ్యామలాలును వృత్తాంత మంతయు విని విస్మితులు గాఁజొచ్చిరి. అప్పు డేమిచేయవలయునో స్థిరపఱుపఁజాలక యుమాశంకరుఁ డనేకవిధములఁ జింతించుచుండెను. ఈలోపున సూపరింటెండెంటు పనిపూర్తియగుటచే నాతఁడు తనకర్మచారులను దీసికొని వెడలిపోయెను. అప్పు డుమాశంకరుఁడు శ్యామలాలును వెంటఁబెట్టుకొని తలవంచుకొని మెల్లమెల్లఁగా నాసౌధములోఁ బ్రవేశించెను. సౌధద్వారములో నొకపోలీసుపెద్దయుద్యోగస్థుఁడు నిల్వఁబడి యుండెను. అతఁడు శ్యామలాలుని, ఉమాశంకరుని జూచి గౌరవించి, శ్యామలాలునితో నిట్లనియెను— “ అమ్మగారు సకలధనసంపత్తియు మీపేర నొకదానపత్రము వ్రాసియుంచిరి. ఆదానపత్ర మిక్కడ నేమూల నున్నదో మీరు ప్రస్తుతము వెదకవలయును.”

శ్యామలాలీమాటల కేమియుఁ బ్రత్యుత్తర మీయలేదు. ఉమాశంకరుఁ డాకర్మచారిని బిలిచి యనేకసంగతులు ప్రశ్నించి యడి

గెను. ఆతరువాత నాతఁడు స్వయముగా సౌధ మంతయు నానాప్రకారములఁ బరిశోధించెను. కాని ఫలిత మేమియు లేకపోయెను. అత్యాశ్చర్యకరమైనయీనిరుద్దేశవ్యాపారమును విధుముఖ యెందులకుఁ జేసియుండునో యని యుమాశంకరుఁడు చాలసే పాలోచించెను. కాని యాతని కేమియుఁ దోఁచలేదు. "ఎవ్వరైన నామెను హత్య గావించిరా? అయిన శవమేది? ఆమె స్వేచ్ఛగా గృహత్యాగము గావించెనా? గృహము విడిచిపోయిన నేదారిని బోవును? ఏద్వారమున కా ద్వారమునే ద్వారపాలకులు కాచుకొనియుండిరి." అని యాతఁ డను కొనఁజొచ్చెను. ద్వారపాలకు లాతనిఁ జూచి యిట్లుచెప్పిరి. "ఆమె వెచ్చటను గనఁబడలేదని వెదకుచుండుసమయములో నిప్పుడే యీ ద్వారము తెఱవఁబడినది. అంతకుముం దీపెద్దగుమ్మము ఇనుపగొలుసులతో బిగింపఁబడి యున్నది. అట్టిజబ్బుస్థితిలో నున్నయామె నడచి పోవుట యెట్లు? ఎవ్వఁడో దొంగగాని, దుర్మార్గుఁడుకాని పాపబుద్ధితో నామె నెత్తికొనిపోయి యుండునేమో? ఏవిధముగా నెక్కడికి కెత్తికొని పోయియుండును? ఇంటిలోని వెండిబంగారములు గాని ధనము గాని యేమియుఁ జెక్కుచెదరలేదు. కేవలము రాణిమాత్రమే యంతర్ధానమయ్యెను. చాల నాశ్చర్యకరమైనసంగతిగా నున్నది.

---

## ద్వాదశ ఖండము—శేషము.

### మొదటిప్రకరణము.



#### సంబంధము.

హారకుమారబాబు కాశికిఁ దిరిగివచ్చెను. ఆయనతోఁ జమంది కూడ వచ్చిరి. ఆస్త్రీపురుషు లందఱకును బస లేర్పాటుచేయుటకై హారకుమారబాబు తనగృహమునకుఁ బ్రక్క నున్న యింకొకగృహమును బాడుగకుఁ దీసికొనియెను. నవాగతు లందఱు సమపాయములు చూచుచుండుటచే హారబాబున కాత్మీయులతోఁ గలిసికొనుట కింకను నవకాశము చిక్కలేదు. కాని యాతనియాత్మీయులు బంధువులు ననేకు లాతనిఁ జూచుట కాతనిగృహమునకే వచ్చుచుండిరి.

మధ్యాహ్నపువేళ సార్వభౌమమహాశయుఁడు హారకుమారుని యింటి కరుదెంచెను. హారకుమారుఁ డావృద్ధునకు భక్తితోఁ బ్రణామముచేసెను. తరువాత సార్వభౌమచక్రవర్తి హారకుమారునితో నిట్లనెను. "ఇన్నిదినములవఱకు నాలస్యమైన దేమి? మాకందఱకు నేమియుఁ దోఁచుటలేదు. శరీరములో సుఖముగా నున్నదా?

హార—మీయాశీర్వాదముచే సుఖముగానే యున్నాను. చాలఁ బనులు పెట్టుకొని తిరుగుచుండుటచే నాలస్యమైనది.

సార్వభౌమచక్రవర్తి యొకమాఱు తలఁ దడవికొని, యెడమభుజముపై నున్న యుత్తరీయమును గుడిభుజముపై వేసికొని రొండినున్న

పోవుముగాను పైకిం దీసెను. తరువాత నాతఁడు పోవుముక్కుపొడి పదేపదే పీల్చుచు నిట్లనియెను. “ఏమో, నీపనులన్నియు నీకే తెలియును. సరేకాని చెప్పినపను లన్నియు సానుకూలము లైనవా?”

హ—మీకృపచే మాకు సకలకార్యములు ననుకొనినదాని యగ సఫలము లైనవి.

సార్వ—(ముక్కుపొడి పీల్చుకొనుచు) మంచిది! మంచిది! అవి సఫలములైన వంతియే చాలును. ఇప్పుడు నీకొఱ కొకముఖ్యకార్య మాటంకపడియున్నది. నీవు నేఁడు చాలఁ దొందరగా నున్నట్లగపడుచున్నావు. నేఁటి కది కాఁజాలదు. రేపు చూచుకొందము. అది చాల ముఖ్యమైనకార్యము.

హరి—నేను దొందరలో నున్నమాట నిజమే. కాని మీయుత్తరకార్యములనుగూర్చి వినవలసివచ్చినప్పుడుమాత్రి మీలోకములో నెట్టితొందరపను లైన నన్నాతంకపఱుపఁజాలవు.

అప్పు డక్కడ నున్న యొకపీటపైఁ గూరుచుండి మరల నస్యము బీల్చుచు సార్వభౌమచక్రవర్తి హరకుమారునిఁ జూచి “సంగతి వినియెదవా? నవీనచంద్రునివివాహనుగూర్చి” అనియెను.

హర—చిత్రము. ఆతనికి మరలవివాహ మేమి? కోడలివిషయమున నేమైన నశుభము వినఁబడియెనా యేమి?

సార్వభౌముఁడు మిక్కిలి విరక్తిభావముతో మరల నొకమాఱు నస్యమును బీల్చుచు—రాధాకృష్ణ! ఆమె శుభాశుభములనుగూర్చి యేవర్తమానమును దెలియలేదు. తెలియవలెనను కోరికయు లేదు. ఆసంగతి యేమైనను సరియే. అది వ్యభిచారిణి. చండాలునితో వెడలిపోయినది. ఛీ! ఛీ! ఆమాట చెప్పికొనినను బాపము వచ్చును.

హర—చిత్తము.

సార్వ—పిల్లవాఁ డనుకూలుఁడు, శిష్టుఁడు, శాంతుఁడు, పండితుఁడు. ఇట్టికొడుకు భార్యావిహీనుఁడై యుండుట చూడఁజాలకున్నాను.



హర—చిత్తము.

సార్వ—త్వరలోఁ బిల్లవానికి వివాహముచేయ నెంచియున్నాను. ఇక్కడ నొకసంబంధము వచ్చినది. సాంప్రదాయకులు. పిల్ల చక్కనిది. కొంచెము కలిసివచ్చు ననునాశ కూడ నున్నది.

హర—చిత్తము.

సార్వ—ఇప్పుడు నీవు సమస్తము పరిశీలించి శుభకార్యము జరిగింపవలయును. అంతయు నీయిష్టానిష్టములలో నున్నది.

హర—కాశీపట్టనములో నికన్యను వివాహముచేసికొనుటలోఁ జాల నాలోచింపవలసియుండును. ఇచ్చట వేశ్యలు తమకన్యలను మర్యాదకుటుంబములలో నివారిని మోసముచేసి యంటగట్టుచుందురని వాడుక.

సార్వ—ఏమి? కృష్ణ, కృష్ణ! ఇంతదుర్న్యాయమా! వేశ్యాకన్యకను శిష్టులకును వివాహసంబంధములే! కులములు కూలిపోవలసినదే! ఎంతభయానకమైనసంగతి!

హర—చిత్తము. ఇట్టిభయంకరవ్యాపారములే యిక్కడ నిత్యము జరుగుచుండును. నాకన్నులయెదుటఁగూడ నట్టివి కొన్నికార్యములు సంఘటించినవి. చివరకు జాతిమతములకు భ్రష్టులై యనేకులు చెడిపోయినారు.

సార్వ—ఎంతఘోరము? కాని, బాబూ ఈక్షేత్రములో నన భేదము లేమియు లేనేలేవేమో?

హర—అట్లయినను మంచిదే. కాని యిచ్చటివా రెవరిని మట్టి

యాకస్మికముగా నమ్ముటకు వీలులేదు. మొట్టమొదట నే నొకవివాహము జూచితిని. సలక్షణముగాఁ బెండ్లి యంతయు జరిగిపోయినది. ఆ వెంటనే సాంకర్య మంతయు బయలుపడి పెద్దగోలమైపోయినది. పాపము శిష్టకుటుంబము వారొకరు భ్రష్టులై పోవలసివచ్చినది.

సార్వ—ఇప్పు డుపాయ మేమి?

హార—కుమారునకు వివాహము గావించుట యావశ్యకమని నేను దెలుఁగుగును. దేశములోనికి వెళ్లినప్పుడు నే నీవిషయమును మఱచిపోయి యుండలేదు. నే నొకయనుకూలురాలైన పిల్లను జూచి వచ్చితిని. కులము, శీలము, రూపము, గుణము నన్నియుఁ గలవు. సకలవిధముల నాబిడ్డ సార్వభౌములకుఁ గోడలు గాఁదగియున్నది. సలక్షణముగాఁ బదిరూపాయిలు కలిసివచ్చుమార్గమును గలదు.

సార్వభౌముఁడు లేచి నిల్వఁబడియెను. అత్యాతురతతో నాతఁడు హారకుమారుని జూచి—ఏమది చెప్పుము. నీ వెప్పుడును నా హాముశుభమునే కోరుచుందువు. నాకు మేలుచేయుచుండుటయే నీ కిష్టమైన వ్యాపారము. సరియే. అది మనకు సంధాన మగుటయెట్లు?

హార—ప్రస్తుతము మన కించుక లాభ మున్నది. అదియైనను స్వల్పము గాదు. ఒక వేయిరూప్యములయలంకారములు పిల్లకుఁ గలవు. తరువాత వంగదేశములో నొకగొప్పసంసారి పిల్లకు ముఖ్యుఁడగును. ఆయనవలన ముందుముం దనేకోపకారములు జరుగఁగల వని ముఖ్యముగా నాశ యున్నది పిల్లకుఁ దండ్రిలేఁడు. తల్లి మాత్రమే యున్నది. ఆతల్లికూడఁ గొంతయాస్తి గలది. అది యంతయుఁ బిల్లదే.

సార్వ—మంచిది, మంచిది. నీబుద్ధికి సాటియైన వస్తువులేదు. చాలమంచిసంబంధమునే నీవు స్థిరపఱచినావు. ఇఁక నెన్నిదినములలో

శుభకార్యము కాఁగలదు?

హర—శుభకార్యము జరుగుట కాలస్వభావముచేత గలదు. కాని యిప్పుడే మీకుఁ జెప్పవలసిన దొకసంగతి గలదు. ఇంతకు ముందు పెండ్లికుమార్తె వయసువచ్చినపిల్ల. కులీనకన్యక, సత్కుటుంబమువారి తోఁ గాని వివాహము కాఁజాలదు. మీరును వారికి దగినసత్కుటుంబులు.

సార్వ—ఉత్తమ మైనమాట! కుటుంబమును, కులము సర్వము నీవే యెఱుఁగుదువు. నీవు సర్వముఁ బరిశీలింపకుండ సంబంధము స్థిరపఱతువా? పిల్ల పెద్దదని చెప్పియుంటివి. అది సంతోషకరమైన సంగతియే. ఈస్థితిలోఁ బెద్దపిల్లయే మనము కోరఁ దగినది గదా.

హర—కుటుంబ ముత్తమకుటుంబము. అసందర్భముగ జాగుగాఁ దెలిసికొనకుండ నేను వివాహముసంగతి తలపెట్టుదునా? మీకు నిప్పుడు సమ్మతమైనచో, అప్పు డుభయులకు సంధానముగావించెదను.

సార్వ—ఆలస్యము వలదు. కాని, బాబూ! దేశములోనుండి పోయియే పిల్లవానికి వివాహముచేసికొనవలయు నని నాకొక కోరిక లేదు. ఇప్పుడు దేశములోనికిఁ బోయినను ప్రయోజనము లేదు.

హర—ఎందులకు? మీయనుగ్రహమువలన నిక్కడనే పెండ్లి చేయఁగలను.

సార్వ—నిజము, నిజము! నీ కసాధ్య మేమియు లేదు. నీవు తలఁచుకొన్నచో నీకుఁ జేయఁజాలనిది గలదా? కాని, నాయనా! అట్లయినచో వధువు నిచ్చటికుఁ బిలిపింపవలయునుగాఁబోలును. కాని, విలంబము గాకుండునట్లు నాలోచింపుము. ఇంక నా మనసు ఆమెను పిలిపించుటకు వ్యవధిలేనట్లు తోఁచుచున్నది.

హర—మీచిత్త మెట్లో యట్లే చేయఁగలను. కుమారునకు

స్త్రీచేతే వివాహము కావలయునని మీరు కోరినచో సన్నీ చేయఁ
గలను.

సాధ్వీమణి యాశ్చర్యముతో హారికుమారునివీపుపైఁ జేయి వైచి తట్టుచు " అట్లు చెప్పరేమీ! అట్లయినచోఁ బెండ్లికుమార్తె యిప్పటనే యున్నదా ?" అనియెను.

హార—మీ శిష్యుని వధువును జూచి యాశీర్వదింపవలె నని తలంచుచున్నారా ?

సాధ్వి—అయినచో నాయనా! పెండ్లికుమార్తెను వెంటఁబెట్టుకొనియే వచ్చితివా ?

హార—మీయాశీర్వాదముచే నేను గార్యమునం దేమియు గొంటుచేసికొనిరాలేను. పిల్ల పరమసుందరి యనియు, నించుకవయసు వచ్చినదనియు, గొంచెము మాస్తితో గాఁగల దనియు, సత్కుటుంబ [illegible] చెప్పఁగా తెలిసికొంటినో యప్పుడే నే నీబిడ్డను సవీశ [illegible] బెండ్లిగావించిన బాగుండు నని యెంచుకొంటిని. దేశములోనికిఁ బోయి వివాహముచేసికొనుట యెట్లును గుదుర దని నేనెఱుఁగనా? దుష్టపథములచేతను యోగ్యమైన యీసంబంధమును విడిచిపెట్టి వెళ్ళినచోఁ దరువాత నేమగునో యని భయపడి నేను వధువును, వధువుతల్లినిగూడ నాతో వెంటఁబెట్టుకొనియే వచ్చితిని. నేఁడే వివాహమునకు మంచిముహూర్తము కలదు. మనకు విశేషాడంబరములతోఁ బనిలేదు. ఎట్లో యిరువురకుఁ బాణిగ్రహణము గావించుట ముఖ్యము.

సాధ్వి—నాయనా! అందుల కభ్యంతర మేమి? అట్లే కానిమ్ము! నీబుద్ధి యసమానమైనది. నీవివేచనము ధన్యమైనది! నీ వేలో ఇంత స్థిరపడితివో ఆరోజుననే వివాహము కాఁగలదు. అయినచో, "శుభస్య శీఘ్రం" మన్నారు. అట్లే కానిమ్ము.

హర — అది యంతయు నేను సిద్ధముచేయించెదను. రెండు మూఁడురోజులలోఁ బనులన్నియుఁ బూర్తి కాఁగలవు. ప్రస్తుతము తా మొక్కమాఱు వధువును స్వయముగాఁ జూడవలదా?

సార్వ — నాయనా! ఏమియు నక్కఱలేదు. నీ వెవ్వాని సమ్మతించితివో అప్పుడే సర్వసమ్మతము. కాని నీవు చెప్పుచున్నావు గనుక కా దనకుండ, నొకమా ఱట్లే చూచెదను.

హరకుమారబాబు సార్వభౌముని వాకిటఁ గూరుచుండఁబెట్టి తా నంతఃపురములోనికి వెడలెను. మరల నాతఁడు వెంటనే తిరిగివచ్చి సార్వభౌమునిఁ దీసికొని యంతఃపురములోనికిఁ బోయెను. అక్కడ నొకవిశాలమైనపీఠముపై సార్వభౌమునిఁ గూరుచుండఁబెట్టెను. తరువాత నొకపరమసుందరీమణి యైన యువతి యించుక మేలిముసుఁగుతోఁ దలవంచుకొని యింకొకరితో మెల్లమెల్లఁగా నడచుచు వచ్చి యత్యంతకోమలభావముతో నాతనికి నమస్కరించెను. లావణ్యరాశి యైన యాబాలిక నడతయుఁ గోమలభావములును, జంపకసదృశమైన శరీరవర్ణమును, అంగసౌష్ఠవమును జూచి సార్వభౌముఁడు నిశ్చేష్టుఁడై పోయెను. ఆసుందరీమణి మేలిముసుఁగుతో దల బొత్తుగా వంచుకొని నిలువఁబడియెను; అందుచే సార్వభౌమచక్రవర్తి కామెముఖము పూర్తిగాఁ గానుపింపలేదు. అయినను నాతఁ డామెసౌందర్యమునకుఁ బరిపు సంతుష్టుఁ డయ్యెను. ఒకమాటయైనఁ బలుకరింపకుండఁ బెండ్లికుమార్తెను జూచుట నియమవిరుద్ధ మని యెంచి యంతఁ డామె నిట్లు పలుకరించెను. "నీపేరేవరమ్మా, తల్లీ"

ఆతల్లి కప్పుడు కన్నుల నీరు నిండిపోయెను. కంఠస్వరము గద్గదిక మయ్యెను. వికృతస్వరముతో నామె "సతి" అని యుత్తరము చెప్పెను.

సార్వ — ఆహా! ఏమిమాభాగ్యము! రూపరేఖలు చూడఁగాఁ గేవలము సాక్షాత్కరించిన సతీదేవియే యనవచ్చును. నామనస్సున కెంతో సంతుష్టి మైనది.

సతి వెంట నున్న స్త్రీలతో మెల్లమెల్లఁగా వెడలిపోయెను. ఈసమయమునందే యింటిలోనుండి శంఖనాదమును మంగళధ్వనులును వినఁబడెను.

సార్వ — అనిర్భాగ్యురాలుగూడ నిక్కసుందరియే గదా.

సార్వభౌమమహాశయునితో సెలవునకు వచ్చుచు హరకుమారబాబు "అన్నా! మీరేమియుఁ నాలోచింపవలదు; భారమంతయు నాపై నుంచుఁడు, మీగృహవ్యాపారము లన్నియు నేను జక్కఁబెట్టెదను" అనియెను.

సార్వ — నాభారము లన్నియు ముఖ్యముగా నీపైనే నిలిచియున్నవి. ఈవిషయములో నీ వేమి చేసిన నట్లే యగును. ఇందును సందేహ మేమున్నది?

సార్వభౌముఁ డానందముతో వెడలిపోయెను.




---

రెండవ పరికరణము.

---

మర్మాంతికము.

మహాభారతసందయమంచు సీతారత్నబాబువచ్చెరె వాకిటిలోఁ బ్రాశస్త్యమైన కుర్చీపై వచ్చియుండెను. నీలరత్నబాబు, హరకుమారబాబు, సార్వభౌమభట్టాచార్యుఁడు అతనిపుత్రుఁడైన నవీనకృష్ణుఁడు, ఉమా

శంకరయ్యను, ఇనుపపెట్టెగువాడు మోతిలాలు
గులీఖోరు, జరీఖాన్ చినూర్యను మొదలగు
మఱియు శ్యామలాలుకూడ నచ్చట నుం చం
మెల్లగా నొకప్రక్కను కూరుచుండి యతి తుష్టితో ద
లుచుండెను. భృత్యుఁడు సమీపమునుండి యందించుచుండ
రకుమారబాబు బాడ గంజాయి పీల్చుచు యథేచ్ఛముగ వాగ వద
చుండెను. అతని యిరుప్రక్కల ననేక కాగితములును, వ్రాతపుస్తకము
లు నుండెను. కుమారకుమారబా బప్పుడు శ్యామలాలుని జూచి యిట్లని
తెను— "శ్యామలాలుబాబూ! నీవు కాశికి వచ్చియున్న సమాచార
ము నే నింటివద్ద విని యిచ్చటికి వచ్చితిని. మీదగ్గఱ నేను నే నొక
పెద్దసంగతినిగూర్చి మాటాడవలసియున్నది. మీరు శ్రద్ధతో విని
యుచిత మగు నేర్పాటు చేయుట మంచిది."

శ్యామ— మీమాట లనేకములు విని విని చెవులు చిల్లులుపడి యున్నవి. పడరానిబాధలు పడిపడి కాశికి వచ్చితిని. ఇక్కడ మీ రింక నుపదేశములచే నన్ను బాధింపవలదు. మిమ్ముల జూడవలసి వచ్చునని తెలిసినచో నే నిక్కడకు వచ్చియే యుండను. మీతో నాకు సకలసంబంధములను విడిపోయినవి. అప్పుడు మీరు నన్ను విడిచిపెట్టిన అసిన యవసర మెందులకు వచ్చినది?

హార— నీ కుపదేశము లిచ్చుటవలన నా కేమియుఁ బ్రయోజనము లేదు. నే నిప్పుడు చెప్పఁబోవుచు మాట లన్నియు నీవు వినుటకు బాధ్యుఁడవు. నీవు సహజముగా వినవిచో న్యాయచట్టముమూలముగా నవి నీచే వినఁజేయవలసియుండును.

శ్యామ— మీరు సహజముగాఁ జెప్పఁగలిగినచోఁ జెప్పవచ్చును. చట్టములు— న్యాయస్థానములు ననుట యేల? నే నేమియు న

వలసినమాట నైనచో వినవచ్చును. కాని
చరలు నాకు వినిపింపఁ జేయగలవా?

స వేవిధముగా వినినను విందువుగాక! నాపని నేను జే
ను. వినుము. శ్యామలాలుబాబూ! నీవు స్వర్గస్థుఁడైన
కోదబాబునకుఁ బుత్త్రుఁడవు గావు; నీ విన్నినాళ్లనుండియు
నుభవించుచున్న నైశ్వర్య మంతయు నీది గాదు. ఇదిగో! ఈనూతన
శాసనాన్నసి—ఉమాశంకరుఁడు రాధావినోదవందోపాధ్యాయ మహా
శయునకు నౌరసపుత్త్రుఁడు. తండ్రిమైశ్వర్యమునకు యథార్థముగా ను
త్తరాధికారి.

శ్యామ—(క్రోధముతో) మోసముచేసి కుతంత్రమును బన్ని
తివి. పనిలోనుండి తీసివేసితి ననుకోపముచే నన్ను భయపెట్టుట కిట్టి
పెద్దపన్నాగమును బన్ని పెల్లడించుచున్నావు. ఈనీపన్నాగములవలన
నేమియుఁ గార్యముగాఁజాలదు—నాపరమశత్రువైన భట్టాచార్యుఁడు
నాతనికొడుకు వకీలుఁడునుగూడ నిచ్చటనే యున్నారు. నేను మిమ్మం
దఱను దగినరీతిని శిక్షించెదను. నాభార్య నిన్నటియుదయమునఁ బ
లాయితురాలైనది. ఉన్నదో లేదోకూడ సందేహామే. ఉన్నను రోగ
పీడితురాలై రోజులపై నున్నది. నేను బుద్ధితక్కువచే నాసంపత్తి
యంతయు భార్యచేతిలోఁ బెట్టితిని నిజమే; కాని భగవంతునిదయచే
నాకంటకముకూడ దూరమైపోయినది. ఆసంగతి విని మీరు నన్నుఁ
గొట్టి వంచనచేయఁదలఁచుకొనినారా యేమి?

చండి—మహాప్రభూ! నీవెవఁడవు! చాల గొప్పబుద్ధిమంతుఁ
డవుగాఁ గనఁబడుచున్నావే! నీ వెప్పుడైనను జన్మలో నేమద్యత్నయిన
ను తిని యెఱుఁగవు. అట్లయిననో నీకింత యవివేక ముండియుండదు.

హరకుమారా—నీవద్ద నేమియు మోసముచేయవలయు ననునుద్దేశము లేదు ; నిన్ను మోసగింపవలసిన యవసరమును లేదు. నక్కలుఁ గుక్కలుఁగూడ నిప్పుడు నీదుఃఖస్థితికి దుఃఖించుచున్నది. బుద్ధిదోషముచే నీపాపములను నీవే ఖండించుకొంటివి. నీవిప్పుడు దయాపాత్రురాలవు. నీవు నా కెట్టిశిక్షఁ జేయుటకుఁ గోరుచున్నను, నాకు దానివలన నించుకయు భయము లేదు. ఇప్పుడు నేను జెప్పఁబోవుమాటలన్నియు వినుము. అంతయు విని పిమ్మట నీయిష్టమువచ్చినట్లు చేయుము ; నే నేమియు నిన్ను నిర్బంధపెట్టను, భయపెట్టను.

శ్యామలా లేమియు మాటాడ కూరకుండెను. హరకుమారుఁ డిట్లు చెప్పఁదొడఁగెను—నీతండ్రికి రెండువివాహము లైనవి ; ఆసంగతి నీవును నెఱుఁగుదువు. ప్రథమభార్యయైన మాతంగినీదేవికిఁ జిరకాలముసంతానము లేకపోవుటచే రాధావినోదబాబు శ్యామనగరమునందలి నిధిరామచట్టోపాధ్యాయునికుమార్తె జగత్తారిణీదేవిని వివాహమయ్యెను. జగత్తారిణి పరమసుందరియు, గుణవతీమణియు నై యుండెను. సరళత్వము, భయము, సంకోచము నను నీమూఁడుగుణములు నామెయందు పరిపూర్ణములై యుండెడివి. ఆమె కాపురమునకు వచ్చినతరువాత నొకసంవత్సరమువఱకు నామెయందు మాతంగినీదేవి కంతగా ద్వేషబుద్ధి కలుగలేదు. ఒకసంవత్సరమునకుఁ దరువాత జగత్తారిణీదేవి గర్భవతియయ్యెను. అప్పటినుండియు నామె మాతంగినికి నేత్రశూలముగాఁ గనఁబడుచుండెను. రాధావినోదబాబు తనద్వితీయభార్య గర్భమునందు వంశధరుఁ డావిర్భవింపనున్నాఁ డని తెలిసికొని, స్వాభావికముగా నామెను మఱికొంత శ్రద్ధతోఁ జూచుకొనుచుండెను. క్రూరహృదయురాలైన మాతంగిని యప్పుడు తనకును గర్భమే యని మిథ్యావాక్యములు నలుగురిలోఁ జెప్పుకొనుచు, గర్భవతివలె వికారము

లు సహించలేకపోయెను. సవతి యను కంటకమును దూరముగాఁ దొలఁగించుకొనుటకు కామె యొక యద్భుతమైన యుపాయము నవలంబించెను. గంగాస్నానమున కని మిషచెప్పి జగత్తారిణిని దీసికొని యామె కలకత్తాకు వెడలెను. కలకత్తాలో కాళీఘట్టమునందుఁ బూర్వమునుండియు వారి కొక వాసగృహ ముండెను. ఆగృహమునందే యామె సవతితోడను, ననేకసేవకజనముతోడను వసించియుండెను. అట్లుండి యొకనాఁ డామె జగత్తారిణితో నిట్లనియెను— "నేను నిన్నిక్కడ హత్యచేయించి యీగంగానదిలోఁ బారవేయించుటకే యిచ్చటకుఁ దీసికొని వచ్చితిని. ఇక్కడ నీభర్త లేఁడు. నావద్ద విస్తారము ధనము గలదు. ఆధనబలముచేతనే నావద్ద నైదువందలమంది జనులును గలరు. వారందఱు సులభముగా నేను జెప్పినట్లు చేయఁగలరు. స్వగ్రామము చేరి నే నెట్లు చెప్ప మనిన నట్లు చెప్పఁగలరు."

అతిసరళస్వభావయు, నతిభీరువు నైన జగత్తారిణి యప్పుడామె పాదములు పట్టుకొని యేడువఁజొచ్చెను. అట్లు కొంతసే పేడిచి మరల నించుక ధైర్యము దెచ్చుకొని యామెతో నిట్లనియెను. "అక్కా! నాగర్భములో శిశు వుండెను. నీవు నన్నుఁ జంపినచో శిశువును జచ్చిపోవును. కనుక నన్నుఁ జంపకుము. ఇఁక నే యుపాయమైనఁ జేసి నీవు సుఖముగా నుండునట్లు చూచుకొనుము" అప్పు డనేకాలోచనలు చేసి మాతంగిని యిట్లనెను. "నీవు కాశికిఁ బొమ్ము. నీవు నీతోఁ దెచ్చికొనిన యలంకారములును గొట్టియు నీతోఁ బట్టుకొని పొమ్ము. ఇఁక నీ వెప్పుడును భర్త కుత్తరము వ్రాయఁగూడదు. కాళీఘట్టమునందు మహామ్మారిజాడ్యముచే నీవు మరణించితి వనియు, నీగంగాతీరమునందే యథావిధిగా నీ యుత్తరక్రియలు జరిగె ననియు నేను వెల్లడి గావించెదను. నీ వెప్పుడైనను నీభర్తతో నుత్తరములతో మాటలాడుటకు

గాని స్థితిగతులు తెలుపుటకుఁగాని ప్రయత్నింతువేని, నే నప్పుడేమి చేసెదనో చూడుము—నీవు కాశీపట్టణమునందు నన్ను విడిచిపెట్టి యెవ్వరో మార్వాడివానితోఁ బలాయన మొనరించితి వనియు, ననేకదినములనుండి వృద్ధుఁడైన భర్తను బరిత్యజించుటకుఁ బ్రయత్నించుచు నిచ్చట నవకాశము దొరకుటచే నిప్పుడు కులభ్రష్టవైతి వనియు దృష్టాంతపూర్వకముగాఁ జాటించెదను. ఇన్నినాళ్ళనుండి కళంకభయముచే నీసంగతి వెల్లడింపఁజాల నైతి నని యప్పుడు చెప్పెదను. అప్పుడు నాతో నున్నజనులందఱు నందులకు సాక్ష్య మీయఁగలరు. ఆసంగతు లన్నియు విని నీభర్త నిన్ను గ్రహింపఁడు సరిగదా నీఛాయ నైన స్పృశింపఁడు. నీపుత్త్రుఁ డప్పుడు ధనమునకు నాగస్వామి కాఁగలఁడనుకొందు వేమో! వాఁడు వేశ్యాపుత్త్రునివలెఁ గళంకితుఁడై సమాజములో నిలువ నీడ లేకుండును." ఇది యంతయు విని జగత్తారిణి కేడుపు "అయ్యో! శ్రీహరీ! ఎక్కడికిఁ బోదు? ఏవిధముగా నక్కడకుఁ జేరఁగలను? ఎక్కడ నివసింతును?" అని యన్నియుఁ దలఁచుకొని వ్యాకులచిత్తయై రోదన మొనరింపఁజొచ్చెను; కాని ప్రాణముల విడిచిపెట్టుటకంటెను, కళంకితయై యెట్లో బ్రతుకుటకంటెను, గాశికిఁబోవుటయే శ్రేయ మని యామెకుఁ దోఁచెను. సోనామణి యనుపేరుగల యొక బ్రాహ్మణవితంతువు వంటలక్కగా నామెతోఁగూడ నుండెను. జగత్తారిణి యవస్థ యంతయుఁ దెలిసికొని సోనామణి యామెను గాశికిఁ దీసికొని వెళ్లెద నని ధైర్యము చెప్పి, మాతంగినివద్ద చేతులు మోడ్చికొని యందులకుఁ బ్రార్థించుచు నిలిచెను.—నాకుఁ గాలము తీరిపోయినది. సంతానము మొదలగుబంధము లేమియు లేవు. దేశమునకుఁ దిరిగిపోవలసినప్రయోజనముగూడ నేమియు లేదు. ఈస్థితిలో నా కిప్పుడు కాశీనివాసమే కోరఁదగినదై యున్నది." చాలసేపటి

చించి మాతంగిని యిట్లనెను—"వెళ్లవలయు నని గోరవచ్చును. వెళ్లను వచ్చును ; కాని యీవృత్తాంత మంతయు వెల్లడించుటకుఁ బ్రయత్నించితివేని నిన్నును జగత్తారిణినిగూడ సర్వనాశము చేయకుండ నేను విడిచిపెట్టువాఁడను గాను. నీవు ధనమంతయు నపహరించి జగత్తారిణి నేదుష్పథమున నైన మరలించితివేని యది యంతయుఁ దెలిసికొని నిన్ను నేను పిఘాయకముగా గోతిలోఁ బాతివేయించెదను." పిమ్మట జగత్తారిణి సోనామునితోఁ గాశికి వెడలిపోయెను. వా రిరువురు నచ్చట నొకచిన్నగుడిసెలో దుఃఖితులై దీనాతిదీనముగాఁ గాలము గడపుచుండిరి. శరీరమునందు గొన్నియాభరణము లుండెను. పెట్టెలోఁగూడ రెండుమూఁడు విలువగల యాభరణములును బ్రయోజనయములైన కొన్నిసామగ్రిలు నుండెను. ఇవిగాక మాతంగిని దయ తలఁచి రెండువందలయేబదిరూప్యము లిచ్చియుండెను. సామాన్యస్థితి నన్నవస్త్రములు గడచిపోవుట కేమియు నిబ్బంది లేకుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు జగత్తారిణి యాచిన్నగుడిసెలో నొకశుభముహూర్తమున మోహనాకారుఁ డగు నొకమగబిడ్డను బ్రసవించెను. ఆబిడ్డయే యీమహాపురుషుఁడైన యుమాశంకరుఁడు. బిడ్డను రెండేండ్లు నిండునప్పటికి జగత్తారిణికిఁ గాలిబాధము ఘటిల్లెను. అప్పుడిఁక విధిలేక సోనామునియే యాదుఃఖమంతయు ననుభవించుచు బాలుని లాలనపాలనంబులఁ జేయుచుండెను. కాని కాలక్రమమున రోగజీర్ణశరీరయై వృద్ధురాలగుటచే నాబ్రాహ్మణవితంతువునకుఁగూడఁ గాల మాసన్నమయ్యెను. మానవరూపదేవతయైన ఘనానందస్వామితో సోనామునికిఁ జాలకాలమునుండి పరిచయము గలదు. అవసానకాలమునం దామె యామహాపురుషునిఁ బిలిచి యాదివ్యశిశువు నాయనచేతులలోఁ బెట్టెను; అప్పిల్లవానిని యోగానందస్వామి కర్పించునప్పు డామె యాతని

వృత్తాంత మేమియు వివరించి చెప్పలేదు గాని “ఈతఁడు బ్రాహ్మణ బాలకుఁడు. ఈతనివృత్తాంతము తెలిసికొనవలసివచ్చినచో, వంగదేశమునందలి రామనగరములో నున్న గంగామణి యనుబ్రాహ్మణవితంతువునద్ద కేఁగి, యామెవద్ద నున్న కొన్నికాగితములను జూచినచో నీతనివృత్తాంత మంతయుఁ దెలియవచ్చును.” అని మాత్రము చెప్పెను. సోనామణి స్వర్గస్థురాలైనతరువాత ఘనానందస్వామి నేఁటివఱకు నుమాశంకరునిఁ బుత్త్రాధికవాత్సల్యములో విద్యాబుద్ధులు చెప్పి రక్షణ సేయుచుండెను.

ఇఁక నిక్కడ మాతంగిని తిరిగి తనగృహమునఁ బ్రవేశించి, ‘మహామారి’జాడ్యమువలన జగత్తారిణి మరణించిన దనిన సమాచార మక్కడఁ బ్రకటించెను. రాధావినోదబా బపరిమితదుఃఖమునకుఁ బాలయ్యెను. కాని యప్పుడే నాకీవృత్తాంతమునుగూర్చి యించుక సందేహము కలిగెను. గృహమునం దప్పుడు, ‘సౌరభి’యనుపేరుగల నాల్గవజాతి వితంతుస్త్రీ యొకతె దాసిగా నుండెను. అది వ్యభిచారిణి. అప్పు డది గర్భవతిగా నుండెను. మాతంగిని దాని నొక నిరపాయస్థలమునం దుంచి జాగ్రతతో రక్షించుచుండెను. ఇట్లుండఁగా నొకనాఁడు దానికిఁ బ్రసవవేదన ప్రారంభించెను. ఆదాసికిఁ బ్రసవబాధ ప్రారంభింపఁగానే, మాతంగిని తానుగూడఁ బ్రసవవేదనఁ బడుటకుఁ బ్రారంభించి, సూతికాగృహమునఁ బ్రవేశించి మంత్రసానిని బిలిపించుట మొదలగు సకలసన్నాహములు గావించుచు నీసమాచారము రాధావినోదబాబునకుఁ దెలియఁజేయించెను. అప్పుడు సౌరభి యొకమగశిశు పుదయించెను. ఆశిశువు దాసికౌశల్యముచే మాతంగితిసూతికాగారమునకుఁ గొనితేఁబడి రాధావినోదబాబునకుఁ బుత్త్రుఁడుగాఁ జేకొండెను. ఆతఁడే యీశ్యామలాలు.

హారకుమారుఁ డిట్లు చెప్పఁగానే, చుఁడి తల పైకెత్తి యిట్లని యెను—“ అన్నగారూ! ఈకథముందు మహాభారతరామాయణములు పనికిరానట్లున్నవి! శ్యామలాలుబాబూ! తల్లిదండ్రులవృత్తాంతమంతయు నీకుఁ దెలిసినదిగదా! ఇఁక నీవేమి చెప్పఁదలఁచుకొనినావో చెప్పుము!”

శ్యామ—ఈవిధముగా నాతల్లిదండ్రులనామములకుఁ గళంకము తెచ్చిపెట్టిన దురాత్ములను దునుకతునుకలుగా ఖండింపవలసియున్నది. నరాధముఁడైన యీహారకుమారుఁడు మాతండ్రియన్నమును ఒకకాలము దిని బ్రతికినవాఁడు. ఇప్పు డీముసలితనమునందు నాతల్లిదండ్రులనామముల కపఖ్యాతిని దెచ్చుచున్నాఁడు. ఏమి చెప్పను! నేనిప్పు డసమర్థుఁడను. మీరుమిక్కిలి. మీచేతులలోఁ బడియుంటిని. అట్లు కానిచో నిప్పుడే యింతకుఁ దగినప్రతీకారము చేసియుందును.

హార—ప్రతీకారము చేయుటకు నీకిప్పుడు సాధ్యము గాదు. నీమాటలకు నేను గోపపడువాఁడను గాను. ఏమన, నీవు దయాపాత్రుఁడ వని యింతకుముందే చెప్పియున్నాను. రాధావినోదబాబు నాకు సహోదరుఁడు, బంధువు, ప్రభువు, సకలమునై యుండెను. అతఁడు నిన్నుఁ బుత్త్రునిగానే భావించి యుండెను. కాని, అనేకపర్యాయము లాతఁడు నీనీచాచరణములను జూచి నీవు విజాతీయుఁడ వేమో యని యనుమానించియు నుండెను. దానికేమి? తుద కాతఁడు నీయెడల పుత్త్రభావముతోనే స్వర్గస్థుఁ డయ్యెను. అందుచేతనే శ్యామలాలా! నేనిప్పుడు నీతోఁ సంభాషించుచు నిన్ను నాదగ్గఱఁ గూరుచుండ నిచ్చితిని. నీ నీమాట లన్నియు విశ్వసింపకపోయినను నష్టమేమియు లేదు. ఏమన! ఈసంగతిని బ్రత్యేకముగాఁ దెలియఁజేయుటకు నఖండనీయమైన ప్రమాణములు నాచేతిలో నున్నవి. ఆప్రమాణము

లన్నియు న్యాయస్థానముఁ బదిమందియెనుటఁ జెప్పినప్పుడు నీకేక మాటాడుట కుపాయముండదు. నీ విప్పటివలెనే చిరకాలము బికారి వై యుండఁగలవు. నీజన్మవృత్తాంతము నీకోచిమార్గ జరథ్ను, నేనును బూర్వమునుండియు నెఱుఁగుదుము. జగత్తారిణీదేవి యప్పుడు మృతి నొందలే దనుసందేహము నాకుఁ జిరకాలమునుండియుఁ గలదు. కాని యామె యెచ్చట నున్నదియో, ఏమి సంతానము గనెనో, కల్గినసంతానము జీవించియుండెనో లేదో యను విషయము లన్నియుఁ దెలిసికొనుటకు నా కప్పు డానుకూల్యము కుదిరినది గాదు. మంచిదినములు తటస్థించుటచే నీవు నాకుద్యోగమునుండి సెల వొసంగితివి. అందుచే సకలవృత్తాంతములు దెలిసికొనుట కనుకూలమైన యవకాశము గల్గినది. ఈవృత్తాంతము లన్నియుఁ దెలిసికొనకుండ నీజన్మవృత్తాంతము బయలుపఱిచి యీవిపులధనసంపదను పరిపుత్రునువారిపరము చేయుటకంటె నిన్నే యనుభవింప నిచ్చుట మేలని యాలోచించి నే నిన్నిదినములవఱకు నూరకుంటిని. ఇప్పుడు నాకు సకలవృత్తాంతములు సప్రమాణములుగాఁ దెలియవచ్చినవి. ఎచ్చటను నాకిఁక నేసందేహమును లేదు. భగవత్కృపచేఁ బ్రాతఃస్మరణీయుఁడును మహాత్ముఁడు నైన రాధావినోదబాబు నౌరసజాతపుత్త్రుఁడు దొరకెను. ఇది నాకుఁ బరమానందకరమైనవిషయము. ఈనాశరీర మాతనియన్నముచేఁ బెరిఁగినది. ఈయథమునిచే నించుకయైనఁ బ్రత్యుపకారము కాఁ గల్గినచో నదియే పరమభాగ్యము.

చండి—అన్నా! నవ్వుచునవ్వుచు నంతయు మన్నగాఱించితివి! ఇట్టిసుందర మైనకథ నింతకట్టుదిట్టముగాఁ జెప్పి యలసితివిగనుక నిప్పు డేమైన నొకటిరెండు మోతాదులు లోనికిఁ బుచ్చుకొనినఁ జాల మంచివాఁడవు. ఈచిన్నతిమ్మని యాలోచనము విని యింకనైన న

భ్యాసము చేసికొనుము.

శ్యామ—నీవు మంచిమాట చెప్పినావు. హరనమారుని యాప్తహితుఁడు సత్యమే చెప్పినాఁడు. ఉద్యోగ మూఁడినతరువాత నీవిద్య నభ్యసించిన ట్లున్నాఁడే ?

హర—మంచిది; దృష్టాంతములు చూతువుగాని!



## మూఁడవప్రకరణము.



### దృష్టాంతములు.

“అఖండనీయములగు దృష్టాంతము లిప్పుడునాచేతిలోనున్నవి. చేయవలసినంతపరిశ్రమయు, బ్రయత్నమును, వ్యయమును జేసి నే నీదృష్టాంతములు సంగ్రహించితిని. స్వర్గస్థుఁడైన రాధావినోదబాబుతో నాకుఁ గలసంబంధమును బట్టి, యాతని యౌరసపుత్త్రుని వెదకి తెచ్చి యాతనిధనసంపత్తి కధికారిని జేయవలసినబాధ్యత నాకుఁ గలదు. ఇంతకాలమునుండియు నేనీకర్తవ్యమును నెఱవేర్పఁజాలకుంటిని. ఈవిషయములో నేను మిక్కిలి యపరాధినై యుంటి ననుట నిజము. కాని భగవంతుఁ డేమి చేయునో యది యంతయు మేలుకొఱకే. రాధావినోదబాబుపుత్త్రుఁడైనయుమాశంకరుఁ డిప్పు డెట్టిదివ్యచరిత్రసంపన్నుఁడై యుండెనో, ఎట్టి శిక్షాజ్ఞానములచే విభూషితుఁడై యుండెనో యట్టియునికి యాతని నైదుసంవత్సరములకుఁ బూర్వమే యీ సంసర్గమునుండి విడదీసినచో నెంతమాత్రమును లభింపఁజాలదు. ఇప్పుడు నేనట్టిపరిశ్రమ చేసి యేయేప్రమాణము లన్నియు సంగ్రహించితి

నో, అవి యన్నియు మీరందఱును జూడవలయును—వినవలయును; ఆతరువాత శ్యామలాలు తనయిష్టప్రకార మాప్రమాణములను మన్నించినను, మన్నింపకున్నను, న్యాయస్థానమునం దాతనికిఁ బరాభవము జరుగుననుటలో సందేహ మేమియులేదు." అని హరకుమారబాబు పలికెను.

నీల—నీ విప్పుడు చెప్పిన కథవంటికథ యెక్కడనవలాకారునికల్పనమునందును నుండఁజాలదు. ఇప్పుడు నీ వీకథను మొదటినుండి చివరవఱకును సవిస్తరముగాఁ జెప్పవలయును.

హర—జగత్తారిణికి వివాహమైన స్వల్పకాలమునకే యామె తల్లిదండ్రులు లోకాంతరగతులైరి. ఒక్కవితంతుసోదరితక్క యామె కింకెవ్వరును లేరు. వితంతురాలైన యామెయక్క యామెయత్తవారిగృహమునందే యుండెడిది. జగత్తారిణి కాశికిఁబఱువఁబోట్టఁబడినప్పు డామెతో నొక నగలపెట్టెయు, రెండువందలయేబదిరూప్యములు నుండె నని యింతకుఁబూర్వమునందే చెప్పియున్నాము. ఆయలంకారములను విక్రయించుకొనియు, రొక్కము వ్యయపఱచికొనియు నామె యన్నవస్త్రముల కిబ్బంది లేకుండఁ గాలము గడపుచుండెను. ఆమె పరలోకమున కేగినతరువాతఁగూడ ధర్మపరాయణురాలైన సోనామణిదయవలన బాలకుఁడగు నుమాశంకరునకు విశేషకష్ట మేమియుఁ గలుగలేదు. ఉమాశంకరుఁడు జన్మింపఁగానే కాశీనగరములోఁ బ్రధానజ్యోతిశ్శాస్త్రవేత్తయైన శ్రీయుత అద్వైతచరణాచార్యమహాశయుఁడు బాలకున కొకజాతకము వ్రాసెను. ఆజాతకపత్రముఁ జూడఁగా నీబాలకుఁడైనయుమాశంకరుఁడు రాధావినోదబాబున కౌరసుఁడై జగత్తారిణీగర్భమున జన్మించినట్లు తెలియుచున్నది. ఈజాతకపత్రము వ్రాసినపండితుఁ డిప్పటికిని జీవించియున్నాడు. నేను బిలిచిన వో

బహుసేపునిమిషములలో నాయన యిచ్చటికి రాఁగలఁడు. అందులకుఁ గాంగనే స్నానము గావించి యుంటిని. ఆయన జగత్తారిణిని జూచియుండెను. ఆమెయాకృతి ప్రకృతిపొందఁగను వచ్చియు నాయన మొదుగును. త్వరితము వివాహాంతకపత్రమును జూడసలయును.

ఇట్లు చెప్పుచు నొకకర్ర నుండి యొకపసుపుపచ్చనికాగితముపై వ్రాయఁబడియుండిన జాతకపత్త్రికను మారకుమారుఁడు పైకిఁదీసెను. సార్వభౌమభట్టాచార్యమహాశయుఁ డాజన్మపత్రమును జూచుచు విస్మయముతో నొకొక్కమాఱు ఉమాశంకరునివంకకుఁ జూడఁదొడఁగెను—॥ ఉమాశంకరునిజననియైన జగత్తారిణినిఁ జూచి యాజ్యోతిర్వేత్త యిట్లు చెప్పెను—॥ అమ్మా! నీయాదిక్కు దేవతుల్యుఁడు గాఁగలఁడు. ఈయల్పవయసునందు నీ వెందుల కిట్లయితివో చెప్పఁజాలనుః కాని నీకుమారునినిమిత్తము మంచియేర్పాటు చేయుట మంచిదగును." తరువాత జగత్తారిణికి మరణకాల మాసన్నము గాఁగానే జ్యోతిర్వేత్తయైన మహాత్మునివాక్యములు స్మరణకు వచ్చెను. తండ్రి యెవ్వరో తెలియఁబడని తనకుమారుఁడు లోకములో ననమానితుఁడు కాఁగలఁడని భావించి యామె యప్పుడు తనవివాహకాలముమొదలు తన మరణకాలముపర్యంతము గల తనజీవితచరిత్రమును సమస్తమును వ్రాయించెను. అక్కడ నున్న గణేశమహాలునందలి శ్రీవామనదాసచక్రవర్తి దానిని వ్రాసెను. జగత్తారిణి సామాన్యముగా వ్రాయను జదువను నేర్చి యుండెను. ఆకాగితమునందు జగత్తారిణి స్వయముగా సంతకముచేసెను. నలుగురుపెద్దమనుష్యులు దానిపై సాక్షిసంతకములు చేసిరి. వారిలో లేఖకుఁడైన వామనదాసచక్రవర్తియు, మాధవభట్టాచార్యుఁడును, మన్నాగతిరాయలును బ్రస్తుతము న్నున్నారు. వారు కూడ నే నిక్కడకుఁ బిలిచినచో రాఁగలరు.



నేను గంగామణీదేవి యిల్లంతయు సాంతముగా శోధించితిని. సోనా మణి మరణించుటకుఁ బూర్వము, జగత్తారిణివృత్తాంత మంతయు వ్రాసిన వామనదాసచక్రవర్తివద్దఁ గాగితము లన్నియు జాగ్రత్తపఱిచియుంచుటకు గంగామణి కొకయుత్తరము ముక్కముక్కలుగా శిథిలమై యామెయింటిలో నొకపెంటదిబ్బపైఁ బడియుండి నాకు దొరకెను. ఆముక్క లన్నియు జతపఱచి యనేకప్రయత్నములచే నేను దాని కొక శుద్ధప్రతి సిద్ధముచేసితిని. ఆరెంటిని మీరు చూడవలయును.

హరకుమారుఁ డొకచింకికాగితమును, నొకమంచికాగితమును గలిసియున్న మడతను బైకిఁ దీసి వారి కిచ్చెను. మరల నాతఁ డిట్లు చెప్పఁదొడఁగెను—ఆతరువాత గంగామణియింటిలో వెనుకటిపెంటదిబ్బలోనే యింకొకకాగితము నాకు దొరకెను. ఆకాగితము రామచంద్రుఁడు వ్రాసినది. ముక్తియారుగాకు వ్రాసిన యాయుత్తరము నాకు లభింపకపోయినచో నీకాగితము లన్నియు రామచంద్రునివద్ద నున్న వనుసంగతి తెలిసికొనుట నాకు సాధ్యము కాకపోయియే యుండును. ఆయుత్తర మిదిగో! మీరు చూడవలయును. ఈయుత్తరముసాహాయ్యముచే వెదకికొనుచు రామచంద్రునిఁ బట్టుకొని, చండీచరణునికౌశలముచే రామచంద్రునివద్ద నున్న కాగితములను సంపాదింపఁగల్గితిని. నేను జగత్తారిణిపుట్టినింటికిఁగూడ వెళ్లియుంటిని. ఆమె వితంతుబోధ రి గృహమునకును బోయియుంటిని. ఆమె నిచ్చటకు వెంటఁబెట్టుకొని వచ్చితిని. ఇప్పు డామె యిచ్చటనే యున్నది. జగత్తారిణిని రాధావినోదబాబువివాహ మగుటయు, నామె గర్భవతి యగుటయు, తరువాతఁ గాశి కేఁగుటయు, నీయుమాశంకరుని గనుటయు, నామె మరణించుటయు మొదలగు నన్నివిషయములకును విస్పష్టములైన ప్రమాణములు మీకుఁ గనఁబడుచున్నవి. అయినను మీకు మఱియొకవిషయ

ముగందు సందేహ మూండి యుండవచ్చును. జగత్తారిణి కాళీఘట్టము నందుఁ గాలధర్మము నొందుట యందఱకును విదితమైనవిషయమే. 1262 వ సంవత్సరములో శాధావినోదబాబు జగత్తారిణిని వివాహమయ్యెను. 1264 సంవత్సరములో జగత్తారిణిగర్భమును ధరించెను. నాలుగవమాసముగర్భములోనే యామె కాళీఘట్టమున కేగెను. దివాణపు జమాఖర్చులఖాతాలోఁ దత్సంబంధమైన ఖర్చులు చాల వ్రాయఁబడియున్నవి. నేనాసంవత్సరపు జమాఖర్చులు సంగ్రహించియుంటిని. మీ రవి చూచినచో విశదము కాఁగలదు. ఆసంవత్సరపు చైత్రిమాసములో వారు కాళీఘట్టమునకు వచ్చి పదిదినము లక్కడ నున్నారు. ఆసంవత్సరపు చైత్రసప్తమికి గొప్పపర్వము వచ్చినది. ఆపర్వ విశేషమును బట్టియే వారు గంగాస్నానమునకు వచ్చిరి. ఆసంవత్సర పుఁబంచాంగము నేను సంగ్రహించి యుంచితిని. ఈపంచాంగములో నాజమాఖర్చులదినముల జతపఱచి చూచినచో నాదినములు నీదినములు నొకటి యని మీకు విశదమగును.

హరకుమారబాబు దినిగిపోయిన జమాఖర్చులపుస్తకము నొకదానిని, ప్రాఁతపంచాంగము నొకదానిని బైకిఁ దీసెను. తరువాత మరల నిట్లు చెప్పఁదొడఁగెను—కాళీఘట్టమున జననమరణములపట్టిక గలదు. నే నాపుస్తకమునుండి 1264 సంవత్సరపు ఫాల్గునచైత్రమాసములయొక్కయు, 1265 సం. వైశాఖమాసముయొక్కయు మృత్యుపట్టికను సంతకములసహితముగా నకలు సంపాదించితిని. దానియం దెక్కడను జగత్తారిణి మృత్యువునుగూర్చి యుల్లేఖింపఁబడలేదు. అది కేవలము నబద్ధపుసంగతి. అందుల కేమియు సందేహము లేదు. మీ రీమరణపట్టికనకలు చూడవలయును.

ఇట్లు చెప్పుచు హరకుమారుఁడు మొహరుచేసిన యింకొక కాగి,

తిమును పైకిఁ దీసెను.

చండి—అన్నా! నీ వెట్టిదేవకార్యములైన నిట్టే చేసివేయఁగలవు! నీబుద్ధివిశేషమునకు సాటి లేదు. ఏమైన నేమి? కొంచెము మస్తు సేవించుట నేర్చుకొనవు? అది లేనిచో నీవు ఘనులలో నెట్లు చేరఁగలవు?

హర—అట్లు జరిగినతరువాత సరిగా నాలుమాసములకే—1265సం. కార్తికమాసములో 17 తారీఖున నుమాశంకరుఁడు జన్మించెను. ఈవిషయములో నెట్టివ్యత్యాసములును లేవు. జగత్తారిణి మరణించిన సమయములో రామనగరమునుండి యొకకాయస్థుఁడు కాశికి వచ్చియుండెను. అతఁడామెమృత్యుసమయమునం దామెదగ్గఱ నుండుటయేగాక యామెయుత్తరక్రియలకు సాహాయ్యపడి యుండెను. బాలుఁడైన యుమాశంకరు నాతఁడు చూచి యుండెను. అంతియే గాక యీబాలుని భవిష్యత్తు చాలగొప్ప దనియు, నాతనితల్లి సవతివలని భయముచేఁ బలాయితురా లయ్యె ననియు, నాతనితండ్రి వంగదేశములో నొక గొప్పభాగ్యవంతుఁడనియు, కాలక్రమమున నీబాలుఁడే యాభాగ్యమున కుత్తరాధికారి కాఁగలఁడనియు నీమొదలగు సమాచారము లన్నియు నాతఁ డప్పుడు తెలిసికొని యీవింతవార్త నొకయుత్తరములో వ్రాసి దేశములో నున్న తనభార్య కాయుత్తరమును బంపెను. ఆయుత్తరమును వ్రాసినమహాశయుఁ డిప్పుడు జీవించిలేఁడు. కాని యాతనిభార్యమాత్ర మిప్పుడు జీవించియున్నది. నే నామెయొద్దనుండి యాయుత్తర మనుకూలదృష్టాంతముగా నుండఁగలదని భావించి దానిని సంగ్రహించి యుంచితిని. దానిని మీరు చూడవలయును.

హరకుమారుఁడు మఱియొకకాగితమును పైకిఁ దీసెను. అతఁడు మరలఁ జెప్పఁదొడఁగెను—ఈవిషయమున నేఁ జెప్పవలసినది చా

లభాగము ముగిసినది. కావలసినవానికంటె నధికముగానే దృష్టాంతములు సంగ్రహింపఁబడిన వని నే ననుకొనుచున్నాను. మీరు కోరినచో మీ రెవరెవరిని బిలిపింపు మనిన వారిని బిలిపించి వారివలన వాచనికప్రమాణములుగూడ మీ కిప్పింపఁగలను.

నీల—నీవు గ్రహించిన దంతయు, నీవు చెప్పినమాట లన్నియు, నీవు చూపినప్రమాణము లన్నియు యథార్థము లని మేము విశ్వసించుచున్నాము. కాని యంతమాత్రముచే నీవిషయములో ఫలిత మేమున్నది?

సార్వ—అద్భుతపరిశ్రమముతో, అపరిమితధైర్యముతో, అత్యాశ్చర్యకౌశలముతో నీవు సత్యమును బ్రకాశింపఁజేసితివి. స్వర్గస్థుఁడైన రాధావినోదుని రెండవవివాహమునుగూర్చి నేను బాగుగా నెఱుఁగుదును. ఆయన ద్వితీయభార్య గర్భవతియై కాశీక్షేత్రములో మృతినొందిన దని విని యామెయకాలమరణమునకు మే మందఱము వగచితిమి. ఆవృత్తాంతము మిథ్య యని నీవలన వినుటచే నిప్పుడు నా హృదయము చల్లనైనది. ఈవిషయము లన్నిఁటిలో నా కేమియు సందేహము లేదు. కాని నావిశ్వాసమువలన లాభ మేమి?

హర—మీవిశ్వాసమే నాకుఁ గావలసియున్నది. నే నిందుకొఱకు న్యాయస్థానమునకుఁ బోనక్కఱలేదు. నేఁడు గాకున్న రేపైన నుమాశంకరుని పేర రాధావినోదబాబు సంపత్తియంతయు న్యాయప్రకారము నకలుపఱచుటకు లోకయాత్ర చేయవలెను. ఈనిముషము నుండి యీసంపత్తిపై శ్యామలాలును గాని యాతనిభార్య విధుముఖిని గాని యేవిధమైన యధికారమును జేయనీయను. మీరు పదుగురు విజ్ఞులైన పెద్దమనుష్యులు. సంగతి యంతయు విని, నేను జేసినదానిలో న్యాయాన్యాయములు విమర్శించి మీయభిప్రాయమును జెప్పుట

దలంచుకొంటిని. ఆసమయములో మాతంగినీదేవి నాకొక 'ఫరమానా' పంపియుండెను. ఆదాసిని నౌకరీలోనుండి తొలఁగింపవల దని యామె యాజ్ఞాపత్రములో వ్రాసెను. ఆయాజ్ఞాపత్రము నాదగ్గఱనే యున్నది. కావలసినచోఁ జూడవచ్చును. కాని యాదాసి యాతరువాత మరల నెక్కడను గనుపింపనేలేదు. రాధాకిశోరునియింటివెనుక నున్న పాడంటిలో నతిరహస్యముగా మాతంగినీదేవి దానిని దాఁచి యుంచెను. ఆయింటిలో నితరు లెవ్వరుఁ బ్రవేశించుట కధికారము లేదు. కాని యెప్పు డెవ్వరో కొంద ఱక్కడకు వచ్చుచుఁ బోవుచు నుండిరి. ఒకనాఁ డీజరిఫు రాత్రికాలమునం దత్యంతప్రయోజనమైన యొకపని గలిగి యాయింటివెనుకభాగమునుండి పోవుచుండఁగా, మనుష్యు లెవ్వరో విశేషదేహబాధచే మూల్గుచున్నధ్వని యాతనికి వినవచ్చెను. సాహసుఁడైన జరిఫు కౌతూహలపరవశుఁడై పాడుపడిన యాయింటిప్రాకారపుగోడను దాఁటి యింటిలోఁ బ్రవేశించెను. ఆతరువాత జరిగినసంగతులు వినుఁడు— ఆసౌరభి యనుదాసి యొకబిడ్డను బ్రసవించెను. వామ యనుదాసి దానికి శుశ్రూషలు గావించెను. బాలింతరాలు నిశ్చేష్టురాలు గాఁగానే వామ తనపైఁటకొంగులోఁ బసినిసుఁగు నుంచుకొని యక్కడనుండి వెడలిపోయెను. జరిఫుఁడు దాను దాఁగియున్న చోటినుండి యావలకు మెల్లఁగా వచ్చి చప్పుడు గాకుండ వామాదాసిని వెంబడించి నడువఁజొచ్చెను. అప్పుడు వామ పసిబిడ్డతో సంతఃపురములోఁ బ్రవేశించెను. వెంటనే మాతంగినీదేవికిఁ బుత్రోదయమైన దను వదంతి యంతఃపురములో బయలుదేఱెను. చూచితివా, నీకొకసంగతి జ్ఞప్తికిఁ దెచ్చెదను. నీ కది జ్ఞప్తియం దుండి యుండవచ్చును. యువరాజు స్వస్థుఁడైనతరువాత నీ వొకనాఁడు మాతంగినీదేవిని గొట్టినావు. మాతంగినీదేవి యందువలనఁ బ్రతీకార

చితిని. నిజముగా నీయపరాధములు నే నెప్పుడును గ్రహించియుండ లేదు. నిన్ను నే నెప్పుడైనను వేశ్యాపుత్త్రుఁడ వని నిందింతునా? నీవు వేశ్యాపుత్త్రుఁడ వైనను ఆయపరాధము నీది కాదు. నీవు నీచిత్తమును స్థిరపఱచుకొనుము. నేను నీకు సకలవిధముల నానుకూల్యము గావించెదను.

శ్యామసుందరుఁడు చాలసేపు దుఃఖించి మరల నిట్లనియెను—“ సన్న్యాసియైన యుమాశంకరమహాత్ముని కృపకంటె నే నన్య మేమియుఁ బ్రార్థింపను. ప్రస్తుతము నేను మహాత్ముచరణములకుఁ బ్రణామము చేయవలయును. తరువాత నిన్నిదినములనుండియు నాకు భార్యయని యెన్నఁబడుచున్న బ్రాహ్మణకన్యను దర్శింపవలయును. ఏదురాత్ముని ప్రోత్సాహముచే నే నశేషపాపకార్యములలో మునిఁగితినో, ఆపాపండుఁడే విధుముఖిని సర్వనాశము గావించి, యిప్పు డామెను జెప్పరాని దురవస్థలోఁ బడఁద్రోసియున్నాఁడని నేను నమ్ముచున్నాను. వాని యపరాధమునకుఁ దగిన శిక్షను జేయుటకు నేను బాధ్యుఁడను. నే నా విశ్వాసఘాతుకుఁడైన నరాధముని గలిసికొనఁ గల్గినచో మీసన్నిధికి వర్తమానము చేసెదను. కృతకార్యుఁడను గాలేనిచో మీకు శరణాగతుఁడనై కర్తవ్యమును గూర్చి మీయుపదేశమును బొందెదను.

సంసర్గమాహాత్మ్యముచే నధముఁడును, భీరువుఁ, గాపురుషుఁడునైన వానిహృదయమునందుఁ గూడఁ గర్తవ్యజ్ఞాన ముదయించి, తేజస్వితయు సాహసవికాసముఁ గనఁబడఁజొచ్చెను. హరకుమారుఁ డప్పుడు వానిని జూచి యిట్లు పలికెను—“ విధుముఖివిషయమునై నీ వెట్టిసందేహమును బొందితివో నేనును నట్టిసందేహమునే పొంది యుంటిని. ఎవ్వఁడో దురాత్ముఁ డామెను దుర్బుద్ధితో నెచ్చటికో కొంపోయె నని యే తోఁచుచున్నది. కాని నీ విప్పు డావిషయములోఁ గష్టపడి వెదక

వలసిన ప్రయోజనము లేదు. పోలీసువారును మఱియు నితరులు ననే కు లాకార్యమునందు నియుక్తులై పనిచేయుచున్నారు. వారందఱకంటె నావిషయములో నీ వెక్కువ పని చేయఁగలవని నే ననుకొనఁజాలను.”

శ్యామ—అది సత్యమే. కాని నేను విధుముఖియెడలఁ దెలిసియుఁ దెలియకయు ననేకాపరాధములు చేసియుంటిని. నే నామెను వివాహమాడియుండియు నామెతో నొకమాఱైన మాటాడియైన నుండనైతిని. నే నధముఁడనైన వేశ్యాపుత్త్రుఁడను. ఆమె బ్రాహ్మణకన్య. ఆమె యపరాధము లన్నియు క్షమించుట తగునని యే నాకిప్పుడు తోఁచుచున్నది. కాని నాయపరాధములు మహాగురుతరములైనవియు క్షమాతీతములైనవియు నై యున్నవి. ఈవిధముగా నాలోచించిన నేను నాసాధ్యమగునంతవఱకు నామె క్లేశము లన్నియుఁ దొలఁగించుటకుఁ బ్రయత్నించు బాధ్యత గల్గి యుంటినని తోఁచుచున్నది. కాని యిప్పు డావిచార మెందులకు? మీరు కరుణించి [illegible] నన్ను నాతల్లివద్దకుఁ బంపవలయును.

అందఱును లేచిరి. శ్యామలాలును హరకుమారుఁడును వెడలిపోయిరి. తల్లికాళ్ళకు మ్రొక్కి శ్యామలాలు చాలసేపైన తరువాత నీవలకు వచ్చినిలిచెను. ఆతరువాతఁ గొంచెముసేపటి కాతఁ డాకస్మికముగా “ఇప్పుడే మరల వచ్చెద” నని చెప్పి యక్కడనుండి వెడలిపోయెను. కాని చాలరాత్రి యైనది. ఆతఁడు తిరిగి రాలేదు. ఆరాత్రియు మరునాఁటియుదయమునను గూడ నుమాశంకరుఁడును, నీలరత్నబాబును, హరకుమారుఁడును వానిని వెదకుటకొఱకనేకులను బంపిరి. కాని యాతఁ డెక్కడను గనఁబడలేదు.

# నాలుగవ ప్రకరణము.



## ఒకటియే రెండు.

మఱునాఁటిసాయంకాలమున సార్వభౌమునిపుత్త్రుఁడగు సరసిజకృష్ణునకును సతికిని వివాహము జరిగెను. హారకుమారబాబుగృహమునందుఁ బెండ్లికుమార్తె యుండెను. అక్కడనే పెండ్లికుమార్తెతల్లి కన్యాప్రదానము గావించెను. కన్యాప్రదానకాలమందుఁ జతురచూడామణియైన హారకుమారబాబుచే నేర్పఱుపఁబడిన యొకపురోహితుఁడుండెను. వివాహమునకు వచ్చినవా రనేకులు నాఁటిదినమం దక్కడ భోజనములు గావించిరి. నీలకమలబాబు, ఉమాశంకరుఁడు, సార్వభౌముఁడు మొదలగువా రనేకులు పెండ్లినాఁటిరాత్రి పెండ్లియింటనే ఫలాహారాదులు గావించిరి. ఉమాశంకరునివేష మింకను వల్లెయున్నది. “ గురుపితా, గురుమాత ” యనుమహావ్రతధారి యుమాశంకరుఁడు జీవితమధ్యములో నేఁడే మొట్టమొదట సామాజికమనుష్యునివలెఁ బంక్తిభోజనముచేసినదినము.

వివాహమైనతరువాత హారకుమారబాబుభార్య సరసిజకృష్ణునకిని సతికిని మంగళారతు లొసఁగి, యాశీర్వాదములతో లోనికిఁ దీసికొని వెళ్లెను. వరుఁడు స్వభావముచేతనే సుందరపురుషుఁడు ; విశేషించి నేఁడు చందనచర్చితశరీరుఁడు, మల్లికామాలాలంకృతుఁడు, పీతాంబరధరుఁడు నగుటచే మఱింత శోభాయమానుఁడై కనఁబడుచుండెను. కాని యాతఁడు మిక్కిలివిషణ్ణుఁడును, గాతరుఁడునై యుండెను. ఆతనిరీతి చూడఁగా నానందోత్సాహము లాతనిని జిరదినములక్రిందటనే విడిచి వెళ్లిన ట్లగపడుచున్నవి.

శయనాగారమున యథాస్థానమందు నవీనకృష్ణుఁడు కూరుచుం
డియుండెను. పెండ్లికుమార్తెయైనసతియు నాతనిసామీప్యమందే
కూరుచుండెను. అచ్చట నింక నెవ్వరును లేరు.

అకస్మికముగా సతి యవకుంఠన మెడలించి యిట్లనియెను—
"సేవకురాలు చరణములకుఁ బ్రణామము చేయుచున్నది."

క్రొత్త పెండ్లికూఁతురికంఠస్వరము వినియు నామె రూపరాశిని
జూచియు నవీనకృష్ణుఁడు తత్తఱిల్లిపోయెను. ఇది యాచిరపరిచితకంఠ
స్వరమే! 'ఇది నాహృదయాంకితమైన యానిత్యనూతనరూపరాశియే!'
యనుకొని సవిస్మయుఁడై నవీనకృష్ణుఁ డిట్లనెను—"ఇదియేమి సుహా
సా! నీవే? పరమేశ్వరా, నన్ను ధన్యునిజేసితివి."

ఇంచుక చిఱునవ్వునవ్వుచు సతి యిట్లనియెను—"అవిశ్వాసిని
యైన సుహాసిని మరణించినది—ఇదిసతి!"

నవీ—నాసుహాసిని నిరంతరము సతియే. నేను సతిని గోరుట
లేదు—సుహాసయందే నామనఃప్రాణము లుంచియున్నాను.

సతి—ఆమాటయే నిజమైనచో మరలఁ గ్రొత్తపెండ్లికుమారు
నివేషము వేయరు. భాగ్యవశముచే సుహాస మరణించెను. అదియే
నాయదృష్టమై యీదేవదుర్లభమైనచరణసేవ లభించెను.

నవీ—ప్రపంచములో లోకులందఱికన్నులయెదుటను సుహాస
మరణించినమాట సత్యమే. కాని నాహృదయమునందుమాత్రము
నీవుసజీవమూర్తితోనే నిత్యము మసలుచున్నావు. లోకు లేమనుకొను
చున్నారో నే నెఱుఁగను; కాని నాసుహాసిని శివమోహినివంటిసతీదే
వియే యని నేనుమాత్రము మెఱుఁగుదును. నేను మిక్కిలి శుభకరమైన
యదృష్టమును జేసికొంటిని. అందుచేతనే గోలుపోయిన నానిక్షేపము
—నాసుహాస సతీరూపమున మరల నాసొమ్మైవచ్చినది.

సుహాసిని నపీంద్రునిమగు సింహాసనముతోఁ గలసి తొలగుసు హరి సకుసుమియుసు నాతోఁ బాటి యున్నానను—“ కాని నిజము చెప్పుదును. మీరు మన్నన్ మిత్ర భీయసు రాగమును దుఃఖమును మోపించినవి. మీరు చాల నాశించుకొని యిచ్చటికి వచ్చినారు. నేను క్రొత్త భార్య లభింపఁగల దని యనుకొన్నారు. కాని మీకదృష్టము లేకపోయెను. అట్లుకానిచో నీవంటి భాగ్యశాలివైన సుహాసిని మరల మీ కండ్లకు సందర్శనమగును?”

నపీ—నే నీనిందకుఁ బాత్రుండ నగుట నిజము. కాని నేను నేఁడు నాతలపై వజ్రాఘాతము గాని, సర్పాఘాతము గాని తగిలిన బాగుగ నుండు ననియు, నేదైన దైవఘటనము సంఘటించి యీ కార్యమునకుఁ బ్రతిబంధము కల్గిన బాగుగ నుండు ననియు మిక్కిలి యాసించుచు నిక్కడకు వచ్చితిని. నేను మిక్కిలి యదృష్టవంతుండ నగుటచే నట్లేమియు జరుగలేదు. నాబాహ్యాంతరములయం దేమి కలదో యంతర్యామికిఁ దెలియుగును. నాలోపలను వెలుపలను నెవరినిగూర్చిన చింత కలదో, ఎవ్వి మూర్తిని ముహూర్తకాలమందైనను మఱవఁజాలకున్నానో, ఆ దేవమూర్తిని నేఁ డసాధారణమైన యుపాయముచే మరల పొందఁగలిగితిని. నే నార్యులబిడ్డ నని నీవెఱుఁగుదువు. నీకుఁ బెనిమిటి యెట్లు ప్రత్యక్షదేవతయో, అట్లే నాకుఁ దల్లిదండ్రులు ప్రత్యక్షదేవతలుగదా! భర్తృసేవయు భర్తృప్రసన్నతాసంపాదనయు నిహపరములయందు నీ కెట్లు సకలకల్యాణహేతుభూతములో, అట్లే నాకు జననీజనకుల ప్రసాదమును బ్రియానుష్ఠానమును నైహికాముష్మికములలో సకలమంగళనిదానస్వరూపములు. భగవంతుఁడైన భార్గవరాముఁడు తల్లియనుజ్ఞచే నీభూమియందు రక్తనదులను బ్రవహింపఁజేసి యిరువదియొక్కమారు ధరాతలమును నిఃక్షత్రియముగ గావించె.

ననునంగతి నీ వెఱుఁగుదువు. రామచంద్రుఁడు తాను పితృవాక్యపరిపా లనముకొఱకు దీర్ఘకాలము దుస్సహాము లగు వనవాసక్లేశముల ననుభవించె నను నదియు నీ వెఱుఁగుదువు. పూర్ణబ్రహ్మమైన శ్రీకృష్ణుఁడానందముతో నందునియాజ్ఞను బరిపాలించుటయు, యశోదాదేవి బంధనములలో నిశ్చింతుఁడై బంధింపఁబడుటయు నీ వెఱుఁగుదువు. అట్టియార్యవంశమునందు నేను బుట్టితిని. వేయిపాపము లైనను దల్లి దండ్రులయాజ్ఞచేఁ జేయుటకు నేను బాధ్యుఁడను. ప్రత్యక్షదేవతాస్వరూపుఁడైన యాతండ్రి యేకాంతనిర్బంధమును, ఆతల్లియశ్రువారిని నుపేక్షించుట నాకెప్పుడును సాధ్యము గాకుండెను. సుహాసా! నీవిన్ని దినములనుండియు నెక్కడకో పోయితివి. అట్లుగాక నీవెప్పటియట్లింటిలోనే యున్నను నాతల్లిదండ్రు లన్యాయముగానో న్యాయముగానో నన్ను మరల వివాహముచేసికొమ్మని నిర్బంధించినచో నే నేమి చేయవలసియుండునో సుహాసా! నీవు చెప్పుము? నేను రెండుమూఁడుమాఱులు నాయనిష్టమును దెలిపితిని. అసంతుష్టిని వెల్లడించితిని. కాని నాయనిష్టమును, అసంతోషమును వా రుపేక్షించి బలవంతముగ నన్నాజ్ఞాపించుచుండుటచే హృదయము విదీర్ణమైపోవుచున్నను నేను విధాయకముగా వారియాదేశమును బాలింపవలసినవాఁడ నైతిని. ఆర్యసంతానము నిశ్చలముతోఁ దల్లిదండ్రులయాజ్ఞ నెఱవేర్పవలసినబాధ్యత గల దని నీవెఱుఁగవా? సుహాసా! ఆతల్లిదండ్రులయేకాంతనిర్బంధముచేతనే నే నీదుష్కర్మము నాచరింపవలసినవాఁడ నైతిని.

సుహా—మేమైనపనియే చేసితిరి. అదృష్టముచే నేయూహనయు నేప్రతిబంధకమును ఘటిల్లలేదు. అదియే యీనేవకురాలిభాగ్యమై మీాచరణసేవ లభించినది. అట్లు కానిచో సుహాసిని యమునచెంతనొకపరతి యెక్కడనో పడియుండవలసివచ్చును. ఇట్లు గలుగుటైను

గురు సపత్నులుండిన నుండవచ్చును.

సఖీ—సుహాసినీ! ఆమాటకూడఁ దక్కువమాట గాదు. నీప్రనేఁటికపటాచారములకు వికలచిత్తురాలవు గాకుము. భర్తయు నేకపత్నీవ్రతుఁడై యుండుటే యావశ్యకము. కాని యిప్పటిసభ్యతయందీనీతి కొన్నిదినములనుండి మనదేశములో రుచిభేదమును బొందియున్నది. అది నిందనీయమైన దని నీ వెఱుఁగుదువు. పతి తన కిష్టము గలిగినఁగాని, యితరప్రయోజన మేదియేని గలిగినఁగాని బహువివాహము లాడుచుండెను. పతివ్రతమైన భార్య యందువలన నేమియు దుఃఖము పొందుటలేదు. ఎందుచేత? పతి యామెకన్నులకు దేవతాస్వరూపుఁడే గాని యన్యుఁడు గాఁడు. అతఁడు పదివేలపడఁతులనడుమ నున్నను బతివ్రతకన్నులయెదుట నాతనిదేవత్వ మెప్పుడు మఱుఁగుపడదు. భర్తతోఁ గేవలము నింద్రియవ్యాపారసంబంధమే కల దని భావించినచో ననేకములైన యనర్థములు గలుగును. ఇహపరసుఖములు రెండును పతికరుణాసూత్రమునందు గ్రుచ్చఁబడియున్నవని యేస్త్రీ తెలిసికొనుచున్నదో, ఆమె యెప్పుడును బతిదేవతను మనుష్యమాత్రుని భావింపఁజాలదు. తుచ్ఛమైనయింద్రియసంబంధ మామెను బరాభూతురాలిని గాని, చంచలురాలిని గాని చేయఁజాలదు. ముఖ్యముగా నేపతి భార్యకుఁ గష్టము గల్గించునిమిత్తముగాని, కేవలము నింద్రియపరితృప్తికొఱకుఁగాని మఱియొకభార్యను బరిగ్రహించుచున్నాఁడో యానరాధముఁడు పశుతుల్యుఁడే. అట్టినిర్భాగ్యునిసంగతి ప్రసంగించుకొనఁగూడదు. కాని యెవ్వరైన న్యాయమగు ప్రయోజనమునందుఁగాని, యుదారభావములకు వశవర్తులగుటచేఁగాని, యన్యభార్యాపరిగ్రహణము గావించినచో, వారిభార్యలయెదుట వారిపతిదేవత్వ మెప్పుడు న్యూనము గాఁజాలదు. సుహాసినీ! నిన్ను నే నెప్పుడును దేవి

భావముతోనే విశ్వసించితిని. నేను మఱియొకవివాహము చేసికొనుట యనుదుష్కర్మ మాచరించినను, నీయట్టిసతీమణియెదుట గౌరవమర్యాద లించుకంతయు లోపింపవు. అందుచేతఁ జెప్పుచున్నాను—దేవియైన సుహాసినికి వేఱొకసవతి వచ్చినను నష్టమేమి?

సుహా—ఆసమాచారము నాకేల? నాదేవుఁడు నాప్రాణములతోఁ గూడియుండుటే నాకుఁ గావలయును. నే నిప్పుడు నూతనముగా నొకమాఱు నాప్రత్యక్షదేవతచరణములకు మనసారఁ బ్రణామము గావించుకొనెదను.

సుహాసిని సాశ్రునయనయై పైటచెఱఁగు సవరించుకొని పతిదేవునకుఁ బ్రణామముగావించెను. నవీనకృష్ణుఁ డత్యాదరముతో నామెను మన్నించి యిట్లుపలికెను—"ఇహపరలోకములయం దొకముహూర్తకాలమందైన నీతో నాకెడబాటు గల్గింపవల దని దేవునిఁ బ్రార్థించుచున్నాను. నే నిన్నినాళ్ళనుండియు నెట్టియాతనను సహించియుంటినో అది నీతో నెంతచెప్పినను దీఱునది గాదు. ఏమహాత్ముని కృపవలనను, కౌశలముచేతను మన యీవిషమయాతన లంతములయ్యెనో, యామహాత్ముఁడైన హరికుమారుని నాజనకసమునిపాదముల నుద్దేశించి నే నిప్పుడు పదేపదే ప్రణామములు చేయుచున్నాను.

సుహా—నేనును నాప్రాణేశ్వరునితో నేకప్రాణమనై యాపరమహితైషియైన మహాత్మున కంతరంగశుద్ధిగాఁ బ్రణామములు చేయుచున్నాను.

ఆతరువాత వా రిరువురు ననేకములైన తమకష్టసుఖములను జెప్పుకొనఁజొచ్చిరి. సుహాసినిసమస్తదురవస్థలనుగూర్చియు, బహువిధక్లేశములనుగూర్చియు వినుచు నవీనకృష్ణుఁ డశ్రువర్షమును గురియఁ జొచ్చెను.

ఈవల సార్వభౌమమహాశయుఁడు భోజనాదు లన్నియు నైన తరువాత హరికుమారునిఁ జూచి యిట్లు ప్రశ్నించెను—“తమ్ముఁడా! వివాహ మైనది. నీవు నాతో, నీవివాహమువలన వంగదేశములో నొక కీర్తిమంతుఁడైన పెద్దమనుష్యునితో బంధుత్వమేర్పడు నని చెప్పియు న్నావుగదా, ఆసంగతి యేమో యిప్పుడు చెప్పుము!

హర—ఈయుమాశంకరబాబు వంగదేశములో నొకప్రధాన ధనవంతుఁ డనియు, విద్వాంసుఁ డనియు, ధార్మికుఁ డనియు, మీ రంగీకరింతురా, లేదా?

సార్వ—అట్లని వేఱె చెప్పవలయునా? ద్విరుక్తి యెందులకు?

హర—ఈయుమాశంకరుఁడు మీకోడలికి సాక్షాత్తుగాఁ బిన తల్లికుమారుఁడు.

సార్వ—ఏమీ? చెప్పుము. ఎట్టిశుభవార్త! అట్లయిన రాధావినోదబాబు వివాహమైన జగత్తారిణి నాకోడలికిఁ బినతల్లియా?

హర—(నవ్వుచు) చిత్తము. కాని యీసంబంధము నేఁడు క్రొత్తగా వచ్చినదిగాదు—చాలదినములనుండి యున్నదే. మీ కెవ్వరు దాని నెఱుఁగరు. ఉమాశంకరునితల్లికి వివాహమైన చాలదినములకుఁ దరువాత గోపాలపురనివాసియైన జగద్బంధుభట్టాచార్యుని కుమార్తెను శ్రీనాసపీఠకృష్ణునకు వివాహము గావించిరి. ఆజగద్బంధుని భార్యయు రాధావినోదబాబు చిన్నభార్యయైన జగత్తారిణియు సాక్షాత్తు అక్కచెల్లెండ్రు.

సార్వ—(విస్మయముతో) నీవు నిన్నటియుదయమున శ్యామలాలుని జన్మవృత్తాంతమును వెల్లడించునప్పుడు నా కీసంబంధ మించుక జ్ఞప్తికి వచ్చినది; కాని యీ యుభయ స్త్రీల భార్యత్వాలితో సంబం

నేము. ఈవివాహముతో నాసంబంధ మేమున్నది చెప్పుము?



హార—అన్నా! ఆసంపర్కమే యీవివాహమునందు నూతన వేషమును ధరించినది. జగత్తారిణి పెద్దయక్కతో నామొత్తల్లిదండ్రుల కు మనస్పర్థలు గలిగెను. తరువాత రాధావినోదుండును జగత్తారిణి యు స్వర్గస్థులైన చాలదినములకు నవీనకృష్ణునకు వివాహ మగుటవల న నీసంబంధముతో మీకంటకేరిక కలుగలేదు. ఆనీకోడలే నేఁడు మ రలఁ గొత్తకోడలై మీగృహ మలంకరించినది.

సార్వభౌముఁ డప్పుడు క్రోధకంపితశరీరుండై లేచి యుచ్చైస్స్వ రముతో నిట్లనఁజొచ్చెను—“హారకుమారా! దుర్వృత్తా! పాపం డా! నరాధముఁడా! నీవు నాకు సర్వనాశము గావించితివా? నిర్భా గ్యుఁడా! నాజాతి, కులము, ధర్మము, సకలము నీవు ధ్వంసము గా వించితివా?

హారకుమారబాబు సవినయముగా సార్వభౌముని రెండుపాద ములను బట్టుకొని యిట్లనియెను—“మీకు లజ్జయుఁ గళంకముఁ గ ల్గినచో, నాకు లజ్జయుఁ గళంకములు గలుగవా? అన్నా! మీరు ధీ రభావముతో నామాట లన్నియు వినవలయును. ఆతరువాత నాయ పరాధ మేమైన నున్నచో మీయిష్టమువచ్చినట్లు నన్ను దండింపవల యును; నే నవనతమస్తకుఁడనై యాశిక్ష ననుభవింపఁగలను. నే నె ప్పుడును మీ కనుగతుఁడనైన యాత్మీయుఁడను; నేను మీకు హిత మేగాని యహిత మెప్పుడైన జేయఁజాలుదునా? అన్నా! [illegible] శపూజ్యులైనవారు; మీగౌరవమర్యాద [illegible] వ్యాదలు గలుగుచున్నవి.”

సార్వభౌముఁ డించుక యథాస్థితిలోనికి రాఁగానే, హారకుమా

రిబాబు జరిగినసంగతు లన్నియు నాద్యోపాంతముగా నొక్కొక్కటి వొప్పున వర్ణింపఁజొచ్చెను. చెప్పినవృత్తాంతము లన్నియు యథార్థములనుటకుఁ దగినమంచిమంచిదృష్టాంతములుగూడ నాతఁడు చూపించుచుండెను. సుహాసిని యెంతటినిరపరాధినియో, విశేషవిపత్తులలోఁ బడియు నామె యాశ్చర్యకరమైనపద్ధతిని తనసతీత్వధర్మమును గాపాడుకొనియెనో, యది యంతయు వివరముగా నెఱింగించి, యావిషయములో నెవ్వరికి నేసందేహమును లేదని చెప్పెను. లోకు లందఱు నామెను నారీజాతి కాదర్శస్వరూపిణిగా మన్నించుచున్నా రనియు నామె యసంభావితములగు విపత్తులనుండి విముక్తురాలై మరలఁ బునర్జీవించినవృత్తాంత మంతయు విని పరమేశ్వరునకుఁ గృతజ్ఞతావందనము లర్పించుచున్నా రనియుఁ జెప్పెను. అంతయు విని సార్వభౌముఁడు ప్రహసితవదనుఁడు గాఁజొచ్చెను. ఆతఁ డప్పుడు హరకుమారునిఁ జూచి ‹‹ ఆహా, ఎట్టియాశ్చర్యకర మైనసంగతి! ఇంతవృత్తాంతము నా కెట్లు తెలియఁగలదు? నీయట్టి ప్రాపంచికజ్ఞానిబుద్ధిచాతుర్యమువంటి బుద్ధిచాతుర్యము నాబోఁటి శుద్ధశ్రోత్రియునకు లభించుట యసంభవము. నాతమ్ముఁడైన హరకుమారుఁడు దేవతుల్యుఁడైన మనుష్యుఁ డని నే నెప్పుడు నెఱుఁగుదును. సోదరా! నీవు మిక్కిలి శుభసంఘటనమును గావించితివి. ఈవివాహవ్యాపారమునకు నూతనత్వమును గల్పించి నీవు నిజముగా సంతోషమును గల్గించితివి. నీవు చిరంజీవివై సుఖించున ట్లాశీర్వదించుచున్నాను. ఉమాశంకరుఁడును నీవును నాకుఁ బైవారుగారు, నీ విప్పుడు నా కతిసామీప్యబంధువుఁడవు. సంప్రీతిపూర్వకముగా నీ పీనకుటుంబముతోఁ గలిసిసుఖించుచుఁ జిరకాలము గడపవలయు నని యాశీర్వదించుచున్నాను.

ఆహా! ధనసంపదా! నీ కీర్తిగౌరవము నెట్టిసామర్థ్యమును గ

అవును! సన్యాసిశిష్యుఁడును, అజన్మబ్రహ్మచారియు, నేఁటికిని సన్యా
సివేషధారియు నైన యుమాశంకరునితో నీ వెప్పుడు కలిసికొంటివో,
అప్పుడే యాతఁడు దండఱకును బాబుగారై సంతోషము నొసఁగుచు
న్నాఁడు. ఇఁక నెవ్వరు నాతని సన్యాసి యని పిలుచుట కిచ్చగించుట
లేదు.

ఉమాశంకరుఁడు సాధ్వీమనోహరిని సమీపించి యాత
నిచరణములకుఁ బ్రణామముచేసి యిట్లనెను—“ఆహా! నాసౌభాగ్య
ము నేమని పొగడుకొందును? మీయట్టి దేశవిఖ్యాతపండితులను నా
కుటుంబములోనివా రని చెప్పుకొని గౌరవ మందఁగలభాగ్యము లభిం
చినది!”

తరువాత నుమాశంకరుఁడు హరికుమారునిచరణములను స్పృ
శించి యిట్లనెను. “మిమ్ములను నే నేమని పిలువవలయునో నాకుఁ
దెలియుటలేదు. మిమ్ములను దండ్రీ యని పిలుచుట కిచ్చపొడముచు
న్నది. మీకు—”

హరికుమారుఁడు మాటకెలుపుకొని యిట్లనియెను—“నాయ
నా! నీయిష్టము వచ్చినట్లు పిలువుము. కాని లోకులు పెద్దవారి నట్లే
పిలుచుచుందురు.”

ఉమా—మీకృపవలన నా పెద్దతల్లిగారు నాకు లభించిరి. పర
మగుణవతీమణియైన సోదరి లభించెను. పెదతల్లిగారు మీసన్నిధి ను
న్నట్లు తాము సెలవిచ్చియున్నారు. కృపచేసి నాకు వారిదర్శనము ల
భింపఁజేయుఁడు. నేను వారిచరణములకుఁ బ్రణామము గావించుకొని
జోడవని జూచి యానంద మందెదను.

సాధ్వి—బాబా! నడువుము. నేనుకూడ నొకమాఱు వీరిపిన్న
తల్లిదర్శనమునకు వచ్చెదను.

హరికుమారబాబును, సార్వభౌమచక్రవర్తియు, నుమాశంకరబాబును, నంతఃపురములోనికి నడచిపోయిరి. అంతయు నానందమయము, నంతయుసంతోషమయము, నంతయు ధర్మమయము నై యుండెను.

---

## అయిదవప్రకరణము.

### అనుమతి.

పదిగంటలవేళ యైనది. ఉమాశంకరుఁడు బిచ్చపుజోలిని స్కంధమునఁ దగిలించుకొని యాశ్రమమునఁ బ్రవేశించెను. ఘనానందస్వామి యొక్క లోకచర్మాసనమునఁ గూరుచుండి యేదియో గ్రంథముఁ జదువుకొనుచుండెను. ఉమాశంకరుఁడు బిచ్చపుజోలి నొక్కచోట నునిచి, గురుదేవుని సమీపించి భక్తివినయములతో నాయనకు నమస్కరించెను. ఘనానందస్వామి గ్రంథమువంకనుండి దృష్టిమరలించి కరుణాకటాక్షముతో నుమాశంకరుని వీక్షించి, యాశీర్వదించి మందహాసము చేయుచు నాతనితో నిట్లనెను—"ఒకచోట రెండు విరోధిధర్మములు సమ్మేళన మగుట యసంగతము. ఎండయుఁ జీకటియు నేకకాలమునం దొక్కచోట నుండఁజాలవు. అట్లే ధనసంపత్తియు దారిద్ర్యము నొక్కని నాశ్రయించుకొని యొకప్పుడైన నుండఁజాలవు. వత్సా! ఉమాశంకరా! నీ వధికవిత్తమున కధికారి వైతివి; ఇఁక నీ పక్షములో భిక్షావృత్తి బొత్తిగా శోభింపఁజాలదు.

ఉమా—ప్రభువువారియభిప్రాయమును దెలియఁజాలకున్నాను

కాని నాపక్షములో భిక్షావృత్తియే బహుదినములనుండి శోభించుచున్న దనియుఁ, జిరకాలము శోభింపఁగల దనియు నావిశ్వాసము. జ్ఞానము వచ్చినదిమొదలు నేఁటివఱకు నేను గురుసేవ, శాస్త్రాలోచన, ధర్మశిక్ష, గుర్వాదేశపాలనము, జ్ఞానోన్నతి కుపాయాన్వేషణము, భిక్షాగ్రహణము చేయుచునేయున్నాను. ఈకార్యము లన్నియు నా కత్యంత ప్రియజనకము లనియు సంపూర్ణసుసంగతము లనియు నెఱుంగుదును. ఇట్టికార్యము లన్నియు నాయందు శోభించిన ట్లన్యకార్యములు శోభింపఁజాలవు. ప్రభువునకు నిగ్రహము గలిగి యిప్పు డీకార్యము లన్నియు నాయెడల శోభింప వని తలంచినచో, ముఖ్యముగా నేనుగూడ నట్లే తలంపఁగలను. కాని యింకేవిధమైన యవస్థ తటస్థించినను నీ దీనసేవకునిచిత్తము నశించిపోఁగల దనియే తోఁచుచున్నది. మఱియుఁ బ్రభువా రింతకుముం దేధనసంపదనుగూర్చి చెప్పుచున్నారో, ఆధనసంపద కాశ్రియ మాయవలయు నని నా కెంతమాత్రమును గోరిక లేదు. ఈరుద్రాక్షమాలికలు, నీగైరికవసనములు, నీభస్మరాశియు, నీబిచ్చపుజోలియునే నాకుఁ బరమైశ్వర్యము. మఱియుఁ బ్రభువారి యీపాదపద్మద్వయమే నాయనంతవిత్తమున కక్షయభాండారము. ఇంతకంటెను శ్రేష్ఠతరవిత్తము నా కీజగములో నేమియు లేదు, ఉండవలయు ననుకోరికయు లేదు.

ఘనా—వత్సా! నీశిక్ష సంపూర్తియైనది. నీహృదయ మిష్ట
దైక్షిస్థితివిశేషములఁ బొందుటకైన నుపయు
కోరకున్నను విశేషైశ్వర్య మిప్పుడు వెదకి
యింప నున్నది. ఆయుత్కృష్టవ్యవహార
డవు. వత్సా! అదిగాక, విషయభో
మన? విషయములను విషయ

లు గావు. కర్తవ్యపాలనమునందు లక్ష్యముంచి విషయభోగములందుం దు నిస్పృహుఁడై యుండుటవలన నాత్మకును జగత్తునకును నుపకార మగును. విషయభోగమే జ్ఞానమునకుఁ బరీక్షయై యున్నది. అధికేచ్ఛను వృద్ధిపొందించెడు పదార్థముల నెప్పుడును గోరక కేవలము భోగవర్జితభావముతోఁ గాలము గడపెడివారికి, ఆభోగరాహిత్యమువలన జ్ఞానోన్నతి యెన్నటికిని గలుగఁజాలదు. అట్టివాని భావము సాధుమార్గమునకుఁ బోఁజాలదు. సంజ్ఞానముగూడ నింద్రియపరాయణులగు మూర్ఖజనుల జ్ఞానము నతిక్రమింపనుజాలదు. కన్నులకు గంతలు గట్టఁబడినయెద్దు స్వభావముచే సుస్థిరమైన దని చెప్పుట సుసంగతము గాదు. శాకాన్నభోజనముకంటె నన్యము లభింపనివానిని నితాంతమితాహారి యని చెప్పుటకు వీలులేదు. సకలభోగోపకరణములచే సంశ్లిష్టుఁడై యుండియు నెవ్వఁడు నిస్పృహుఁడై, నిర్లిప్తభావముతోఁ దత్సమస్తము ననుభవించుటకు సమర్థుఁడగుచున్నాఁడో, వాఁడే యథార్థజ్ఞాని; వాఁడే యుత్తమతత్త్వదర్శి. అట్టివానికి విషయానుభవములశేషకళ్యాణహేతుభూతములు. పంకజలమునందు భాసిల్లెడి పద్మపత్రమువలె, విషయపంకములోఁ దగులకుండ, సంసారసాగరమున మునిఁగియుండుట మేలే గాని కీడు గాదు. అందుచేత నీ కిప్పుడు సంప్రాప్తములైన యైహికభోగములను సముచితరీతి ననుభవించుచు నీజగత్తునకు భోగనిర్లిప్తతకసాధారణదృష్టాంతమును స్థాపింపుము. ఇదియే నా కోరిక

కిష్ట మేదియో యదియే నిశ్చలచిత్తముతోఁ
బాధ్యుఁడను. మంచిచెడ్డలు, న్యాయా
న్యాయములు నా కక్కఱలేదు. నాకుఁ గా
రుదేవునియాజ్ఞ ముఖ్యమైనదై

నను మాటాడకుండ దానిని జాలించుటకు బాధ్యుఁడను. ప్రభువాక్య మునకుఁ బ్రతివాక్యము కల్పించుట కైనను నాకు సామర్థ్యము లేదు. ప్రభువు తనసేవనుండి నన్ను వంచింపఁదలఁచుకొనినచో నందుల కన్యథా చేయుట నాకుఁ గాని యితరులకుఁగాని సాధ్యము గాదు. ప్రభుసేవనుండి వంచితుఁడ నైనప్పుడు నాయదృష్ట మెట్లు పరిణమింపఁగలదో యని భావింపవలసిన యావశ్యకము లేదు. కాని యీసేవకుని సామాన్యపరిచర్యలు జరుగకుండుటచేఁ బ్రభువున కేమి కష్టము గలుగునో యనిమాత్రము భయ మగుచున్నది.

ఘనా——(మందహాసముతో) ఈక్షణమునందే నీవు మృత్యువాసన్నమైన దనుకొనుము. నాకు నీ వప్పు డేమి పరిచర్యలను జేయఁజూడఁగలవు? కర్తృత్వాభిమానముతోఁ గార్యములు చేసినయెడల మనము విశేషములగు చింతలును గష్టములు ననుభవింపవలసివచ్చును. వత్సా! కావునఁ గర్తృత్వ మంతయు నేకాంతభావముతోఁ బరమకర్తయందే సమర్పించినచో సకలకష్టములును, సమస్తవిచారములును దిరోహితములు కాఁగలవు. పరిణామచింతయే మానవునిఁ జంచలునిఁ జేసివేయుచున్నది. రేపటిమాట యేమి? నేను మరణించినచో నాభార్యయు, నాబిడ్డలు నేమగుదురు? ఏయుపాయముచే దేహమునకు నిరంతరసుఖము చేకూరును? ఏకార్యముచేసిన, ననుపమసన్మానమభివృద్ధి కాఁగలదు? ముందుముందు సుఖ మెట్లు లభింపఁగలదు? ఈమొదలగు భవిష్యదాలోచనయే మనుష్యునిఁ బ్రతినిమిషమును హరించివేయుచున్నది. కాని యుద్విగ్నభ్రాంతులైన మానవులు, తాము భవిష్యత్తునుగూర్చి నిర్ణయించుట కెంతమాత్రము నధికారులము గామని యొకమాఱైన భావింపకున్నారు. ప్రతినిమిషమునందును మృత్యు వాసన్నమై యుండి మానవునివ్యవస్థ లన్నిటిని మా

చ్ఛేదము చేయఁగలదు. ఎప్పుడు ననుకొని యెఱుఁగని ప్రతికూలఘటనలు సంభవించి సావధానముతోడి యాతనియాలోచనము లన్నిటి నొగుడఁగొట్టివేయఁగలవు. కార్యములు మనము చేయుచున్నమాట సత్యమే, కాని కర్తృత్వముమాత్రము మనచేతిలో లేదు. ఎవ్వఁడు విశ్వేశ్వరుఁడో, ఎవ్వఁడు కార్యాకార్యకర్తయో, నీకును, నాకును, సందఱకును రక్షకుఁడును బోషకుఁడు నైనవాఁ డెవ్వఁడో, వాఁడే నాపరిచర్యలకుఁ గావలసిన యేర్పాటులను జేయుచున్నాఁడు. చేయఁగలఁడు. అందుచే నావిషయమై చింతించుట యనావశ్యకము.

ఉమాశంకరుఁడు నీరవుఁ డయ్యెను. నిజముగా గురుదేవునకుఁ జీకాకుఁ గల్గెడివిషయమును గల్పించుకొని మిక్కిలి యజ్ఞునివలె వ్యవహరించితి నని యాతఁడు తెలిసికొనియెను. పరమభక్తిభాజనుఁడును జ్ఞానసముద్రుఁడు నైన గురుదేవుఁ డాతని విషయమై యేదైన గ్రొత్తయేర్పాటు చేయుట యావశ్యక మని తలఁచి యట్లు కావించినచో నిశ్చలచిత్తముతో దానిని బరిపాలించుటయే యాతనిధర్మము. అట్లు కొంతసే పూరకుండి తరువాత నాతఁడు—“స్వామీ నాయెడల మాతృదేవతకుఁగూడ నిట్టి యభిలాషయే కలదా?” అనియెను.

ఘనా:—ఆమె కెట్టియభిలాషము కలదో నే నెఱుఁగను. కాని యామెకుఁ గోరికయే లేనిచో నిట్టిసంఘటన మెట్లగును? ఆమె యిచ్ఛామయి, ఆమె యిచ్ఛవలననే నాకుఁ గార్యావసర మేర్పడుచుండును.

ఆక్షణమునందే యాకుటీరద్వారమున యోగేశ్వరీదేవి సముజ్జ్వలమూర్తి ప్రత్యక్షమయ్యెను. ఘనానందస్వామి యుమాశంకరునిఁ జూచి యిట్లనెను—“చూచుము వత్సా! ఎవ్వరియిచ్ఛ నెఱుఁగుటకిచ్ఛగించితివో యాయిచ్ఛామయి నీయిచ్ఛఁ దెలిసికొని యిచ్చుటఁ బ్రత్యక్ష మయ్యెను!”

యోగే:—నాకిప్పు డవకాశము లేదు. కొడుకుకొఱకును గో డలికొఱకును గృహనిర్వాహము చేయవలసియున్నది. సంసారములో నాకెవ్వరును లేరు. నేను దిద్దుకొనకున్న నింకెవ్వరు దిద్దెదరు? స్వామీ! నీకుఁ బ్రణామము గావించుకొని వెడలిపోయెదను; పుత్త్రునకుఁ బూర్ణమనోరథసిద్ధి యగున ట్లాశీర్వదింపుము.

యోగేశ్వరి భక్తితో ఘుసానందునకుఁ బ్రణామము గావించెను. ఆమె తన చిరతరపద్ధతి ననుసరించి యాతని పాదధూళిని దన శిరమున వక్షమున ధరించి నాలుకపై వేసికొనియెను. అప్పు డుమాశంకరుఁడు కడుఁ దొందరతో నామెను సమీపించి ,,అమ్మా! అమ్మా! తండ్రిగారు నన్నుఁ బరిత్యజించుచున్నారు. నీవును నన్ను విడిచివేసెదవా? ఇఁక నేమి చేయవలయును?” అనియెను.

యోగే—(సవిస్మయముగా) విడిచివేయుటయా! విడువనున్నది యీసంసారములో లేనే లేదు నాయనా! ఇది ప్రేమరాజ్యము, భక్తి ప్రపంచము, ఆకర్షణబ్రహ్మాండము, దీనినుండి విడిచిపోవుట యెక్కడకు? ఒక్కపరమాణువు నైన నెవ్వఁడు పరిత్యజింపఁజాలఁడో, కీటకపతంగములుగూడ నెవ్వనికృపాదృష్టికి వెలిగావో, ఎవ్వనివిశ్వమునందలి స్థావరజంగమము లన్నియు నొకదానిపై నొకటి యాధారపడియున్నవో యాతఁడు నిన్ను విడుచుట యెట్లు సంభవించును? బాబా! ఈ ప్రపంచములో విడుదల కవకాశము లేదు. నీతండ్రి నిన్ను విడిచిపెట్టనని యెంతమాత్రమును భ్రమఁజెందకుము. ఆతఁడు దయామయుఁడు నీయెడల దయచూపుటకే యీయభినవోపాయమును నిర్ధారణ గావించెనని తెలిసికొనుము. ఇఁక నేనో! నే నీతనిచరణసేవకురాలను! ప్రభు వాజ్ఞాపించినదానినే చేయుటకు బాధ్యురాలను. ఇఁక నీవేమి చేయఁగలవు? దానినిగూర్చి నీ వాలోచించుట యెందులకు బాబా! నేను పో

యుపద్రవము. చాలఁ దొందరగా నున్నది. చాలపని గలదు. ఒక సంసారము నీడ్చుట సామాన్యమైనమాటలుగాదు.

ఘనా:—నీకార్యము లనంతములు—నీవు ననంతశక్తి. నీవచ్చుటయుఁ బోవుటయుఁ జాల నాశ్చర్యవ్యాపారము లనుటకు సందేహములేదు. నీ వెక్కడనుండి పోవుదువో, ఎక్కడకు వచ్చెదవో, అది యెవ్వ రెఱుంగఁగలరు? నీ వెంతటివ్యాపారము గలదానవైనను నీకుఁ గార్యము లిచ్ఛామాత్రముచేతనే జరిగిపోవుచుండును. ప్రపంచమం దంతటను నీకుఁ గొడుకులు, కోడండ్రే. నీవు వీరిందఱకొఱకే సంసార మీడ్చుటకుఁ జాల వ్యగ్రురాలవై యుందువు. ఈప్రపంచమున నీ కంటె నితర మెవ్వరికిని లేదు. తల్లిదండ్రులు, పుత్త్రికాపుత్త్రులు, సోదరసోదరులు సమస్తము మిథ్య. సర్వము క్షణికసంబంధము. కేవలమును నీవె సారము, నీవే నిత్యము. నీవే యవ్యయము. సూర్యచంద్రు లస్తమించిపోవుదురు. విశ్వసంసారము ధ్వంసము కాఁగలదు. సృష్టి సర్వమును విలుప్తమై పోవచ్చును. కాని నీవు సుస్థిరురాలవు. నిన్నుఁ దెలిసికొనఁగలుగుట మిక్కిలి యసాధ్యము. నిన్నుఁ దెలిసికొనినవారు సదా ధన్యులు, జరామరణములు, రోగశోకములు, సుఖదుఃఖములు వారిదగ్గఱనుండి దూరముగాఁ బాఱిపోవుచున్నవి. నీకార్యము లన్యులకు దురవగమ్యములు; దురవగాహములు. నీకార్యములను గూర్చి యాలోచింపఁబూనువారు విస్మయములో నిమగ్నులు కావలసినదే. కాని నీవాయనంతకార్యరాశి నవలీలగాఁ జేసివేయుచున్నావు. ఉమాశంకరుని మనోరథసిద్ధికొఱకు నే నాశీర్వదింపవలసిన యావశ్యకత లేదు. ఏమన? సౌభాగ్యవంతుఁడైన యుమాశంకరుఁడు నిన్నుఁ దల్లిగా భావించి, సుఖదుఃఖములు నీయందు సమర్పించి, నిశ్చింతుఁడై యుండుట కభ్యసించినాఁడు. ఉమాశంకరుఁడు ధన్యుఁడు! అతని

యదృష్టమును, సాధనయు నాశ్చర్యకరములు!

మఱియేమియు మాటాడకుండఁగనే యోగేశ్వరి వెడలిపోయెను. ఉమాశంకరుఁడు కాతరభావముతో నావంకకే చూడఁజొచ్చెను. కాని ఘనానందస్వామి మృదుస్వరముతో నవ్వి యిట్లనియెను—

"వత్సా! నీదృష్టులు కాతరభావపూర్ణములైన వేమి? యోగేశ్వరీదేవి నీస్థూలదృష్టులలోనుండి వెడలిపోయిన దని వ్యాకులుఁడ వగుచున్నావా? కాని, మరణధర్మశీలమైన యీదేహేంద్రియగ్రామము మనకుఁ జిరసంగి కాదని నీవూహించుకొనలేదా? ఈబాహ్యేంద్రియము లన్నిటికిని వృద్ధివినాశములు నుత్పత్తియుఁ గలవు; కాని మన యంతరింద్రియముమాత్రము మనతోడనే యుండును. ఏబాహ్యకారణములచేతను దాని కుత్పత్తిక్షయములు లేవు. కావున, వత్సా! ఈ బాహ్యేంద్రియములపై నిఁక నాధారపడి యుండకుము; నీ వాయంతరింద్రియసాహాయ్యముచే యోగేశ్వరీదేవిని దర్శించుటకుఁ బ్రయత్నింపుము. అట్లయినచో నామెదర్శనము కాలేదను దుఃఖము నీకిఁకఁ గలుగఁబోదు. అట్టికార్యమున కభ్యసించితివేని యేబాహ్యవిషయములును ని న్నిఁక విచారపఱుపఁజాలవు. అడవులు, సముద్రములు, పర్వతములు మొదలగునవియు నిన్ను నీయిష్టవస్తువునుండి వేఱుపఱుపఁజేయఁజాలవు. వత్సా! ఇఁక యోగేశ్వరీదేవి ప్రస్తుతము నీసమ్ముఖమునందు లేకున్నను, నీసమ్ముఖమునందే యుండును. సందేహము లేదు. సాధనబలముచే నెవ్వ రామెకృపకుఁ బాత్రు లగుచున్నారో, వా రిఁక నెప్పుడు నామెకృపనుండి వంచితులు గారు. నీతల్లి కరుణామయి. నీ వన్నియు నెఱుఁగుదువు. అయినను యోగేశ్వరిదర్శనముకొఱకుఁ గాతరుఁడ వగుచున్నావు. ఇది నిజముగా హాస్యజనకమైనపని. ఇందు కొఱకే నాకు నవ్వు వచ్చుచున్నది.

ఉమాశంకరుఁడు తనయసంపూర్తిని దయజ్ఞానముఁ దలంచు కొని యాలోచించుకొనుచుఁ దలవంచుకొని యూరకుండెను.

ఘనా—వత్సా! నీవు శాస్త్రనేత్రుఁడవు జ్ఞానివియు నై యుండియు నల్పవయస్కుఁడ వగుటచే లోకజ్ఞానము నొందఁజాలక యిప్పటికిని లోకమోహమును బూర్తిగా విడువఁజాలకున్నావు. ఇందుచేతనే జ్ఞానప్రదీపిక పుస్తకములను గావింపఁదలఁచి యిప్పు డప్పు డెగసరఁ ద్రోయుచున్నాను. కావున నీబోఁటియదృష్టవంతుఁడుఁ, దత్త్వదర్శియు నైన సాధువ క్లేశకరము నొసఁగవలసిన యవసర మింక లేదు. నీవు మార్గమును దెలిసికొంటివి. కాని యేయే యుపాయములచే నిర్విఘ్నముగా నామార్గమున నడచుచు గమ్యస్థానముఁ జేరఁగలవో యదియును విలక్షణముగాఁ దెలిసికొనుచున్నావు. నే నింక నీకుఁ జెప్పవలసిన దేమియు లేదు. కాని యిప్పు డొకచిన్నమాటనుగూర్చి నిన్నుఁ బ్రశ్నించుచున్నాను. నీలకంఠబాబుపుత్రి యన్నపూర్ణను నీ వత్యంతముఁ బ్రేమించుచున్నావు. ఈసంగతి నీవు చెప్పకున్నను నాకుఁ బూర్తిగాఁ దెలియును. ఆబిడ్డయు నీప్రేమకు సంపూర్ణపాత్రురా లని నే నెఱుఁగుదును. ఆమెతోఁ నీకుఁ బరిణయ మైనను గావచ్చును. ఇప్పుడది యంతయు నీసమ్మతిమీఁదనే యాధారపడియున్న దని యనుకొనుచున్నాను. కాని యనేకకారణములచే నాకామినీమణితో నీకు వివాహము గావించుట యుక్తాయుక్తము గా దని యెంచి నే నభ్యంతరపఱచినచో నీయవస్థ యేమగు నని యాలోచించుచున్నాను.

ఉమా—(సవినయముగా) నిజముగా నే నామెయెడల నతిశయానురాగినై యుంటిని. ఆనాయనురాగమునకు మేర నిర్ణయించుట యసంభవము. నామనస్సు ప్రాణము మొదలగువానిపై నాకన్యకామణి యధికారముచేయుచున్నట్లు తోఁచుచున్నది. నే నామెమూర్తి

రత్నమే మానవజీవనమునకు సారసర్వస్వ మని తలంచుచున్నాను, కాని నాయాకర్షణ మింతకఠిన మైనదియు, నాయనురాగ మింత ప్రబలమైనదియు నైనను నేను నాకర్తవ్యపాలనముం దించుకయు విముఖుఁడను గాలేదు. నాజ్ఞాన మించుకయు లోపించుటగాని చలించుటగాని సంభవింపలేదు. నిజముగా గురుదేవుని ప్రశ్నకు సమాధాన మిచ్చుటకుఁ గొంచెమైనఁ దడఁబాటుగాని, చింతగాని కలుగలేదు. ఓస్వామీ ! నేను మిమ్ములను సర్వజ్ఞులైన పరమపురుషుఁ డని విశ్వసించి యున్నాను. మఱియు మీయాలోచనములును మీయాచరణములును భ్రాంతిరహితము లని తెలిసికొనియున్నాను. కేవలము మీయిష్టమునకు వ్యతిరేకమైనది యెవ్వరికి నెప్పుడును శ్రేయస్కరము గాఁజాలదు. అందుచే మీరు దయతో నీయర్థమునకొఱ కేది నిర్ణయించెదరో, అది యెంతటికష్ట మైనదైనను నదియే నిశ్చయముగా నాకశేషకళ్యాణహేతుభూత మైన దని యనుకొందును. చిత్తస్థితి యెట్లున్న నుండుఁగాక ! దానికేమి ? మీయాజ్ఞాపరిపాలనముం దెప్పుడు విరాగము గల్గునో యప్పుడే యీయర్థముకైన యుమాశంకరుఁడు మృతుండయ్యె నని తెలిసికొనవలయును.

ఘనా — నీయీప్రత్యుత్తరము నాకు సంతోషజనక మైనదియే నైనను నీప్రస్తుతప్రస్తావము నాకిష్టముగా లేదు. ఈవిషయమై యింకేమైనను జెప్పవలసియున్నదా ?

ఉమా — ఉన్నది — ఇంకను గొంత చెప్పవలసి యున్నది. ప్రభువు సమ్మతి ననుగ్రహింపనిచో నన్నపూర్ణతో నాకెప్పుడును వివాహము ఘటింపదు. కాని నే నందుకొఱ కించుకయు దుఃఖితుఁడను గాని కాతరుఁడను గాని గాఁబోను. ఏమన, అన్నపూర్ణతోడివివాహసంబంధమే నాకుఁ బ్రార్థనీయము గాదు. ఆమెను హృదయాంతరము

లోఁ బ్రేమించుటనుగూర్చి నాపరిభవు నన్ను నిషేధించినచో, నది నాకుఁ గఠినపరీక్ష యగును. అన్నపూర్ణ నంతరాంతరమునందుగూడఁ బ్రేమింపకుండనుండుట నాకుఁ జాలకష్ట మనియే తోఁచుచున్నది.

ఘనా — వివాహము గాకపోయినను నీ కట్టిక్లేశ మేమియుఁ గలుగదు; కాని యంతరంగములో నామెను బ్రేమింపకున్నందువలన హానిసంభవించునా? నీయీభావమునకుఁ దాత్పర్యమేమో నాకుఁ దెలియఁజెప్పుము.

ఉమా — అన్నపూర్ణ విశేషధనికునితనయ. నేను భిక్షుకసన్న్యాసిని. నాకును నామెకును వివాహసంబంధము కలుగుట యసంభవము. వివాహము కాకపోయినను విశేషహాని యున్నట్లు నాకేమియుఁ గానిపించుటలేదు. నే నన్నపూర్ణను బ్రేమించుచున్నాను. వివాహము కాకున్నను, ఆప్రేమకు మార్పుగలుగవలసినకారణ మేమియు లేదు. ఆప్రేమాధికారమునుండి వంచించుట మీకుఁదక్క నీజగత్తులో నెవ్వరికిని సాధ్యము గాదు. వివాహమైనచోఁ బ్రేమ యించుక భావాంతరమును బొందు ననుట నిజమే. కాని యాభావాంతరమును పరిహరించుకొనియు నొకస్త్రీని బ్రేమించుటకు సమర్థుఁడనై యుండనిచో, నింతకాలమునుండియు గురుదేవుని సన్నిధిని బొందిన యుపదేశములును, ఇన్నిదినములనుండియు జగన్మాతయైన యోగేశ్వరీదేవి తత్త్వమును గ్రహించుటకుఁ జేసినప్రయత్నమును వ్యర్థమై పోవలసినదే. అన్నపూర్ణను వివాహమాడవలయు నను నాశ నాకెప్పుడును లేదు. ఇప్పుడును లేదు. ఆయాశను బరిత్యజించియు నే నామెను బ్రేమించుచున్నాను. జీవితకాల మంతయు నీవిధముగానే ప్రేమించుచుఁ బరమపరితుష్టుఁడ నగుటకు నిశ్చయించుకొని యుంటిని. వివాహము ఘటిల్లినప్పు డింద్రియసంబంధమైన యధికారవిశేషము కలుగుట నిజ

మే. సమయము వచ్చువఱకు నింద్రియాధికార మణఁగియుండఁగల దని గురుదేవునివలన వినియున్నాను. నా కిప్పుడు వయసును, జ్ఞానోన్నతియు, నవస్థయు నింద్రియాధికారమున కనుకూలములుగా నున్నను నే నట్టిభావమును వర్జించియే యన్నపూర్ణను బ్రేమించుటకు నేర్చుకొంటిని.

ఘనా—అన్నపూర్ణతో నీకు వివాహమైనచో నీసంతోషము సంపూర్ణ మగునా?

ఉమా—ప్రభూ! నీవంతర్యామివి; నీ వొకప్పుడు యోగానందరూపముతోఁ గ్రియాశీలుఁడవును, ఒకప్పుడు ఘనానందరూపముతో నిష్క్రియుఁడవు నగుచున్నావు. నీవు యోగానందుఁడ వగుటచేతనే ఘనానందుడవును, ఘనానందుడవగుటచేతనే యోగానందుఁడవును. నీతత్త్వము మహత్త్వము సంపూర్ణముగా నెవ్వరు గ్రహించుచున్నారో వా రనంతసౌభాగ్యమున కధికారు లగుచున్నారు. నే నధముఁడను. అపూర్ణసాధకుఁడను. నిన్నుఁ దెలిసికొనుటకు శక్తి నాకు లేకపోయినను నే నపరిమితభాగ్యబలముచే నీమహిమయొక్కయు, నీ యనంతశక్తియొక్కయు, నపరిమేయప్రతాపముయొక్కయు వృత్తాంతమించుక యవగతముచేసికొంటిని. కేవలము నీసన్నిధిని హృదయభావములు ప్రచ్ఛన్నములు చేసికొనుటకుఁ బ్రయత్నించుట మోసము చేయుట యగును. జ్ఞానమునకుఁగాని, యజ్ఞానమునకుఁగాని, లజ్జకుఁగాని, సంకోచమునకుఁగాని వశవర్తినై పరమారాధ్యుఁడైన గురుదేవునిసన్నిధి నట్టిమనోవృత్తులనైన దాఁచికొనవలె ననుకోరికయుఁ గలగకుండుఁగాక యని ప్రార్థించుచున్నాను. అన్నపూర్ణను వివాహమైనచో నేను వాస్తవముగానే నిరతిశయసుఖమును బొందఁగలను.

అప్పుడు సాధకులకు యోగానందుఁడును, సిద్ధులకు ఘనానం

దాంతము నైన యామహాత్ముండు ప్రీతిపూర్ణమైన నవ్వుతో నిట్లుపలికెను —“ వత్సా! నీతో నన్నపూర్ణను శీఘ్రముగానే వివాహము కాఁగలదు. ఇప్పుడే యీవిషయమైన సంగతు లన్నియు సుస్థిరములు కాఁగలవు. నేను నీమాటలకుఁ బరమసంతుష్టుండ నైతిని. కేవలము రూపమువలనను, ఇంద్రియతృష్ణవలనను బ్రబలమగు ప్రేమ ముదయించుట నిజము. కాని యాప్రేమ యాతృష్ణానివృత్తితోనే యంతరించుచుండును. నిష్కామమైన ప్రేమము, ప్రేమించుటమాత్రమే యెఱింగినప్రేమము. ప్రేమచేతనే సంపూర్ణసంతుష్టి నందుచున్నప్రేమము సుస్థిరమైనది. అదియే సారవంతమైనది. అదియే ధర్మము. అదియే బ్రహ్మనబోధకము. నీమనోరథము సంపూర్ణసిద్ధి బొందుట కాశీర్వదించుచున్నాను. నాశీఘ్రప్రదానము సార్థకమైనది. నీగౌరవముచే నేను గౌరవమందుట కాశించుచున్నాను.”

ఆసమయమునందు నీలరతనబాబును, హరకుమారబాబును దత్కుటీరద్వారమునఁ బ్రవేశించిరి. వారిని జూచి ఘనానందస్వామి యిట్లనియెను—“ గృహస్థమర్యాదలయందు దనభిజ్ఞుండ నయ్యును నేఁడు నేను మిమ్ములను గృహస్థునివలె నాదరపూర్వకముగా నభ్యర్థించుచున్నాను. మీ రిప్పుడు నాపుత్త్రుఁడగు నుమాశంకరునకు నీలరతనబాబుతనయ నన్నపూర్ణ నిచ్చి వివాహము గావించువిషయమును నిశ్చయించుటకు వచ్చినా రని తోఁచుచున్నది.

నీలరతనబాబును హరకుమారబాబును విస్మయులై యొండొరులమోములఁ జూచుకొనఁజొచ్చిరి.

హర—స్వామీ! మీ రంతర్యాములు. విశ్వమునం దంతటను మీకుఁ గోమకులును గోడంట్రును గలరు. వారందఱకును సంయోగవియోగములును, బంధమోక్షములును మీ కృపాప్రభావమువలననే

కలుగుచున్నది. మీయనుమతియు మీయాజ్ఞయు లేకున్న నెట్టి గము లేదు. అందువలననే మీరు యోగానందులు. మీయనుగ్రహము లేకుండ నీసంసారమున నానంద మించుకైన లేదు. అందువలననే మీరు ఘనానందులు. అనుగ్రహించి యీయల్పులమనోరథము సిద్ధింపఁజేయుఁడు.

ఘనా—ఈవివాహమునకు నేను సంపూర్ణముగా నామోదించుచున్నాను. అంతేగాక, ఎంతశీఘ్రముగాఁ జేయఁగల్గిన నంతశీఘ్రముగా నీశుభకార్యమును గావింపవలయు నని బలవంతపఱచుచున్నాను. నేను సంసారత్యాగిని. భిక్షోపజీవినై యున్నను, నేఁటినుండి మీరు నాబంధువు లైతిరి. అనుగ్రహించి యీయాశ్రమములోనికి వచ్చి యీయాసనముల నుపవసింపుఁడు.

నీల—ఎంతయో పుణ్యముచే మీరు మాబోఁటి యల్పులను మీబంధుకోటిగా స్వీకరించినారు. మీబోఁటిమహాత్ముల పాదధూళి కంటెను మాకుఁ గావలసిన దేమున్నది?

యోగా—(నవ్వుచు) మీరు పెండ్లివారు. మీకు బుక్కా, వసంతము కావలయును. సరి దాని కేమి? ఉమాశంకరుఁడు నావాఁడు మాత్రమే కాఁడు, సనాతని యగు యోగేశ్వరీదేవి యాతనిజనని. ఈవివాహవిషయమున నాయొక్కసమ్మతియే కాదు. యోగేశ్వరి కూడ నీసంబంధమున కత్యంతము నామోదింపఁగలదు.

హర—మాయదృష్ట మనుపమాన మైనది. ఈశుభకార్యవిషయమై మీసన్నిధి నెట్లు ప్రసంగింపవలయునో యని యాలోచించుకొనుచు మేము వచ్చియుంటిమి. దయామయులగు మీరే యాప్రసంగమునకుఁ బ్రారంభించి మాయుద్వేగమును దొలఁగించితిరి. యోగానందులకును యోగేశ్వరికిని, యోగేశ్వరికిని ఘనానందులకును భేద

తేనయే మే మనుకొనుచున్నాము. ఏవిషయమునందైన నొక రామోదించినచో రెండవవా రామోదించినట్లే యగును. ఏదియైనఁ గార్యము నొకరు సమ్మతించినచో సంఘమంతయు సమ్మతించినట్లు లోకము భావించుట కలదు. కావునఁ బ్రభువువారి యామోదమే యోగేశ్వరీదేవి యామోదమని మేము నిశ్చయించుకొనుచున్నాము. మేము విషయపంకమునఁ బడిన పాపులము గనుకఁ బ్రత్యక్షముగాఁ జూడఁజాలకున్నను, బ్రకృతిస్వరూపిణియు సనాతనియు నగు యోగేశ్వరీదేవి, పరమపురుషస్వరూపుఁడగు యోగానందునకు నిత్యసంగిని యగియు, సర్వాంతర్నిహితుఁడగు ఘనానందున కవిచ్ఛిన్నసహచరి యగియు మేము తెలిసికొని యాపరమేశ్వరికి భక్తిపూర్వకప్రణామములు గావించుచున్నాము.

నీలరతనహారకుమారు లాసీనులైరి. ఉమాశంకరునిసంబంధమైన యనేకవిషయములు సన్న్యాసి కెఱింగించిరి. మఱియు నాతనిఁ గూర్చిన యనేకవిషయము లాయన నడిగి తెలిసికొనిరి. యోగానందుఁడును వారికి సముచితములైన యనేకాలోచనములఁ దెలియఁ జేసెను.

శ్రీ [illegible]

## ఆఱవ ప్రకరణము.

### అవరోధము.

కాశిలో నన్నపూర్ణాదేవిమందిరమువద్దఁ గాశికావీథిలో సంస్కారములేని జీర్ణమందిర మొకటి గానవచ్చుచుండెను. ఆయింటిలో నొ

చప్పుడును జనులు మసలుచున్న చిహ్నము లించుకయు గనంబడుట లేదు. ఆయింటిసింహద్వారము తాళమువేసి యుండెను. ఆజీర్ణగృహముచందలి గదులన్నియు మనుష్యనివాసమున కయోగ్యములుగా నుండెను. పైకి రెండంతస్తుల మేడవలె నగపడుచున్నను నది మూఁడంతస్తులమేడ. దానిక్రిందియంతస్తు భూగర్భమునందే కట్టంబడియుండెను. భూగర్భములోని యంతస్తునకుంగూడ రాకపోకలకు మార్గములు గలవు. మందిరమునందన్ని భాగములును వాడుక లేక జనశూన్యములై యున్నను నేలమాళెయందలి యొకగదిలో నొకశుష్కాంగి భూశయ్యపైఁ బడియుండెను. ఆమె విధుముఖయే.

ఒకజాము రాత్రి యయ్యెను. భూగర్భమునందపలే యంధకారమునందున్న యాయిల్లిప్పుడు గాఢాంధకారమయమై యుండెను. ఆకటికిచీకటిలో నేకాకిని యగు విధుముఖి చేతనావిహీనయై శవమువలెఁ బడియుండెను. ఆకస్మికముగాఁ బైయంతస్తునందు మనుష్యులు నడచిన చప్పుడు విననయ్యెను. విధుముఖి యాశబ్దమున కించుకయుఁ జలింపలేదు. ఆమె పరుండియున్న గదికి వెలుపలఁ దాళముపేయఁబడి యుండెను. ఆగుమ్మమునొద్ద నిలుచుండి యిర్వురు మనుష్యులు మాటలాడుచున్నధ్వని యామెకు వినఁబడియెను. దానికిని నామె చలింపలేదు. క్రమముగాఁ దాళముదీయుచున్న శబ్దము వినఁబడియెను. అయినను నామె కదలలేదు. ఒకపురుషుఁడు నొకస్త్రీయు నాయింటిలోఁ బ్రవేశించిరి. వారొకదీపము నప్పుడు వెలిగించిరి. అప్పటికిని విధుముఖి కదలలేదు. ఆపురుషుఁడు హరిచరణుఁడు, ఆస్త్రీ శారద.

శార—ఏమిది కదలమెదల కున్నదే! మరణింపలేదుగద!

హరి—చచ్చినట్లులే పడియున్నది. ఇది యొకనాఁటి పనియా

ఇన్నైనదో మనకు విడిచిపెట్టఁగల మని భావించుచున్నది. నేను జూచెద నుండుము.

అని హరిచంద్రుఁడు విధుముఖిని సమీపించి యామెవీపుపైఁ బాదరక్షలతోఁ దన్నుచు— “చాలసుఖముగా నిద్రపోవుచున్నావే, నేను జెప్పిన దేమిచేసితివి?” అని యడిగెను.

విధుముఖి దీర్ఘనిశ్వాసమును విడుచుచు లేచికూరుచుండి “నేను నిద్రపోవుటలేదు. నీపాపముఖముఁ జూడవలసివచ్చునని కన్నులు మూసికొనియుంటిని. ఈజీవితమునం దింక నీముఖముఁ జూడఁగూడదనియే నాకోరిక. అన్యోల కావలెను? నిజమునకు నీదోష మేమియు లేదు. నేను స్వయముగానే పాపమునకు మరగి నాకష్టములను నేనే సృష్టించుకొంటిని. నిన్ను దోషిని గావించి నే నపరాధినైతిని. నీవుఁదు మిక్కిలి నీవు నాకుఁ బ్రకారాంతరమున నుపకారముచేసితివి. నీవు నన్నసహ్యించుకొననిదో, నీయనాదరముచే నాహృదయమునఁ గ్లేశము గలుగకున్నదో, నామనోగతి యెప్పుడు నీవిధముగా మారియుండక పోవును. పాపసాగరమునందుఁ జిరకాలము మునిఁగియుందును. నీయసహ్యభావముచే నాయంతరంగమునం దాలోక ముదయించెను. నీవు నాకుఁ జాల నుపకారము చేసితివి. నీకు నమస్కారము. నీవు నా కేమి చెప్పితివి? ఓహో! ఆకార్యమెప్పటికిని నావలనఁ గాదు. ఆమాట నేను నీకింతకుముందే చెప్పియున్నాను. ఇప్పుడును జెప్పుచున్నాను. ఆ కార్యముకొఱకు నీవు నన్నర్ధరాత్రమున నోటిలో గుడ్డలు గ్రుక్కి, జననిందఁ బొంది యిచ్చుటకుఁ దెచ్చి వ్యర్థముగా బంధించియుంచితివి. ఈపని నే నెప్పుడును జేయను. నీ విది స్థిరముగా నమ్ముము.

హరి—(క్రోధముతో) నిజముగా! చేయవా? నీ కింకను ననేక దుఃఖములు వ్రాసియున్నవి. నేను నిన్నెట్టి భయంకరకష్టముల

పాలుచేసెదనో యెఱుఁగుదువా?

విధు—(మందహాసముతో) నా కింకను ననేకదుఃఖములు వ్రాసియున్న వని నే నెఱుంగుదును. శారదయాలోచనము ననుసరించి నే నేదినమున నీయసహ్యాస్నేహమునకు సిద్ధపడితినో, ఆదినమునుండియు నాదుఃఖము లారంభము లయ్యెను. ఎక్కడకుఁ బోయిన నీదుఃఖము లంతమునొందునో తెలిసికొనుట కష్టము. నాసర్వనాశమును నేనే చేసికొంటిని. ఇంక నీవు న న్నేమి నాశముచేసెదవు? భగవంతుఁడు న న్నెట్లు నాశముచేయవలయునో, అట్లే చేసివేసెనాఁడు. అది తలఁచుకొనుటకుఁగూడ భయమైనసంగతి. నీవు నన్నుఁ బదికఱ్ఱలతోఁ గొట్టెదవా? అందువలన నాకేమియు భయములేదు. దేహ మెంతవఱకు సహించుకొనఁగలదో, అంతవఱకు సహించుకొనును. సహించుకొనఁజాలకున్నచో దేహమునుండి ప్రాణములు వెడలిపోవును. అది యంతయు నాయెడల నాశముగా నిఁక గణింపఁగూడదు.

హరి—జ్ఞప్తికిఁ దెచ్చుకొమ్ము. ఈశారద యొకప్పుడు నీవద్ద దాసిగాదా?

విధు—ఎఱుఁగుదును.

హరి—ఇప్పు డీశారద నాకుఁ బ్రాణేశ్వరి యయ్యెను.

నరపేరితమైన హరిచరణుఁ డిట్లు చెప్పుచు శారదను దగ్గఱకుఁ దీసికొని దానిచేయిపట్టుకొని యిట్లనియెను—“ఇఁక ముందు నీ వీశారదపాదసేవ చేయవలసి యున్నది. శారద నీసేవవలన సంతుష్టురాలైనచో నీ కన్నవస్త్రములు లభింపఁగలవు.

విధు—అన్నవస్త్రము లున్నను లేకున్నను హాని లేదు. శారద నీకుఁ బ్రాణేశ్వరియైనను సరియే, మఱియేమైనను సరియే. నీయసఃపాపము లెవ్వరి కర్పించినను సరియే. నా కది తెలిసికొనవలసినపని

యోజన మేమియు లేదు. నీతో వచ్చి నేను సర్వనాశనమైపోయితిని. నీసంబంధమువలన నిది యొక్కటియే నాహృదయములో మిగిలిపోయి నది. శారదపాదసేవనుగూర్చి చెప్పుచున్నావా? భూమిలోని క్రిమికీటకము లన్నిటికంటెను నే నిప్పు డసహ్యమైన యధమజీవిని; కేవలము శారదపాదసేవవలన నాకేమియు నవమానము లేదు. శారదా! రమ్మా. నేనిష్టముతోనే నీపదసేవ చేసెదను.

హరి—కాని యీపత్రముపై నంతకము చేసినచో నిన్నేమియు జేయను. ఇంకను నీవు సంతకముచేయవా? చెప్పుము?

విధు—ఎందులకు నీవు మరలమరల నన్నామాట యడిగెదవు? నీనిర్బంధముచే నొకమారు సకలసంపదను నాపేర వ్రాయించి పుచ్చుకొని సర్వనాశము నొందితిని; మరల నే నావిషయములో నే నాగితమునందును సంతకముఁ జేయను. సంపద నాది గాదు. ఎవ్వరి సంపత్తియో వారికే మరల నిచ్చివేసెదను. ఆవిషయములో న్యాయమార్పుచేయుటకు నా కధికార మేమియు లేదు. నీవు నన్నుఁ గొట్టుము, [illegible] పుము. ఎట్టియూరేపలఁ బెట్టవలయు నని న ట్టియూరేపలం బెట్టుము. నే నింక సంతకముచేసి యొరులకు హాని గలిగింపను. ఇది నీవు స్థిరముగాఁ దెలిసికొనుము.

హరి—ఏమీ? ఇంతక్రోధమా? నామాటయందు నీ కింత నిరాదరణమా? నీయహంకార మెక్కడ నుండునో నేను జూచెదను లెమ్మా.

అప్పు డాకిరాతుఁ డాపురణాపన్నమైన సుందరిని దనచేతికత్తితో నొకబలమైన దెబ్బగొట్టెను. వెంటనే శారద సమీపించి వానిని బట్టుకొని యీవలకు లాగి యిట్లనెను—“నీవు పొమ్మా—నీ వావల నుండుము. నేను వచ్చెదను బలిమాని యప్పుడు ననుకూలపడెదవ

ను. దెబ్బలాటలతోఁ బనులు గావు."

శారద హరిచరణునిచేయి దొరకఁబట్టుకొని యావలకుఁ దీసికొనిపోయి, పైయంతస్తులో నొకగదియం దాతని నుంచి తాను మరల విధుముఖిగదిలోనికి వచ్చెను. తరువాత నది విధుముఖ చెవివద్ద మోముంచి మెల్లఁగా నిట్లనియెను—"నీపెనిమిటి నిన్ను వెదకికొనుచుఁ దిరిగితిరిగి యనేకకష్టములుపడి యెట్లో నాదగ్గఱకు వచ్చెను. నీ వాతనిని జూచుటకు సమ్మతించెదవా; ఆతనిని జూచినచో నీ కిక్కడనుండి విముక్తియగుట కేదియే నుపాయ ముండునేమో.

విధు—నాకు ముక్తియు నవరోధము రెండు సమానములే. కాని నాకొకమా ఱాయనను జూడవలె నని కోరికయున్నది. రెండుదినములకుముం దాయనను జూడవలసిన ప్రయోజనము లేకపోయెను గాని, యిప్పుడు చూడవలయును. నీ వాయనను జూపింపఁగలిగిన నేను సంతోషించెదను.

శార—నేనందుకుఁ బ్రయత్నించెదను. నాప్రయత్నము కొనసాగినచో రెండుగంటలలో నాతనిని వెంటఁబెట్టుకొని మరల నిచ్చటికి వచ్చెదను. ప్రస్తుత మెట్లో యుపాయముచేసి హరిచరణు నావలకుఁ దీసికొనిపోయి యుంచితిని. వదినే, నీవు మనస్సులో నుంచుకొనకుము. నే నీవిషయములో నీయెడలఁ జేసినతప్పులను మన్నింపుము. నీవు కాగితముపై నెంతమాత్రమును సంతకముచేయవలదు. హరిచరణునిదగ్గఱ వానియిష్టమువొప్పున నటింపకున్నచో నీకు నే నేమాత్రము నుపాయము చేయుటకు నవకాశము గలుగదు. మీఁదుమిక్కిలి మన మిరువురము నొకవిధమైన యాపదలోనే పడియుండవలసివచ్చును. నేను నీదాసిని. నీయన్న మెంతయో తినియుంటిని. హరిచరణునియెడల నాకుఁ బ్రేమలేదు. అంతర్గతములో నాతనికి విరోధిని. ఆతనికి నా

బోటివాండ్రు) లక్షోపలక్షలు గలరు. ఆతఁడు స్త్రీల నొకయాటవస్తువులకంటె నన్యముగా భావించుచుండుటలేదు. ఆతఁ డెవ్వరిని ప్రేమించుట లేదు. ప్రేమించుట యాతఁ డెఱుఁగను నెఱుఁగఁడు. నే నాతనితోఁ గలిసియుండుట యెందులకనఁగా, ఇంచుక డబ్బు సంపాదించుటకును, వానిని జేతిలో నుంచుకొనుటకును నాశించితిని. అది యటుండ నిమ్ము. చాలసంగతు లున్నవి. వీనైనప్పు డన్నియుఁ జెప్పెదను. ఇప్పుడు నేను బోయివచ్చెదను. ఆలస్యము చేసినచో నన్నియుఁ జెడిపోఁగలవు.

శారద వెడలిపోయెను. వెడలిపోవునప్పు డాగదితలుపులు మూసి మరలఁ దాళమువేసెను. ఒకగంటసేపగునప్పటికి మరల గదితలుపులు తెఱవఁబడినవి. శారద శ్యామలాలును లోని కేఁగు మని చెప్పెను.

విధుముఖిని సమీపించి శ్యామలా లిట్లనెను— "నీదుఃఖము లన్నిటికి నేనే కారణము. నీయవస్థ యంతయు నేనెఱుఁగుదును. నే నిప్పుడు నీకుఁ గావలసినంతసహాయము చేయఁగలను. ఈబంధనము నుండి నిన్ను సులభముగా విడిపించెదను. నే నిప్పుడు రూపమోహముచే ముగ్ధుఁడనై నీకు శరణాగతుఁడను గాలేదు. ఘోరమైన యే యితరాపేక్షచేతను నేఁడు నీచరణాశ్రితుఁడను గాలేదు. నీక్షమాభిక్షమును గోరుచుంటిని. నాయపరాధము లనేకములు కలవు. దయతో నీవు నాయపరాధము లన్నిటిని క్షమింపవలయును. నేను నీకుఁ బెనిమిటిని. నిన్నాపదలయందును సంపదలయందునుగూడ రక్షించుటకేను బాధ్యుఁడను. ఎట్లయినను నిన్నిప్పు డీకష్టమునుండి తొలగింపవలయును."

విధు— నేను విశేషకష్టము లేమియు ననుభవించుటలేదు. మీ

గు మహాత్ములరు. అందుచేతనే కాలితోం దన్ని పాఱవేయవలసిన దానికొఱకింతగా నభిమానించుచున్నారు. మిమ్ము నా భర్తయని చెప్పుకొనుటకు నా కధికారము లేదు. అయినను జీవనమునందును మ రణమునందునుగూడ మీతో నా కవిచ్ఛేద్యమైన సంబంధమున్నది. నేను మీకు విక్రీతదాసినై యుండియు మీయిష్టమును జేయనైతిని. నాయపరాధము లపరిమితములును, మన్నింపఁదగినవియు నై యున్న వి. నేను మిమ్ము క్షమింపుఁడని కోరను, ఏమన ? నాకట్టిస్పర్ధయు సాహసమును లేవు. కేవలము మీపాదధూళినిమాత్రమే కోరుచు న్నాను. మీరు సేవకురాలిని పాదధూళి శిరసావహింపనీయరా ?

శ్యాము—విధుముఖీ ! నీ విట్టిమాట లేమియుఁ జెప్పవలదు. నీవు పాపపథమును ద్రొక్కినమాట నిజమే, కాని నేనే దానికిఁ గారణ ము ; నాయనాదరము, నకార్యములు ఘటిల్లకున్నచో విధుముఖీ ! నీవు సంసారమునందు దేవీస్వరూపిణివై యుందువుగదా ! ఏదేవునివద్ద నీవు ధర్మశిక్ష నొందితివో, ఆదేవుఁడే నాయదృష్టముచే నాకుఁగూడ నాశ్రయము దయచేసినాఁడు. నాయపరాధములకుఁ బరిమితి లేదని నే నిప్పుడు తెలిసికొంటిని. ప్రాణములైన నర్పించి నిన్నుఁ బ్రసన్ను రాలిని జేయవలయు నని నేను బ్రతిజ్ఞ చేసికొంటిని.

అకస్మికముగా నొకపెద్దకఱ్ఱతో నేలను గొట్టుకొనుచు హరిచ రణుఁ డక్కడకు వచ్చి శ్యామలాలుని జూచి యిట్లనియెను—" మరల నీవు వెతకికొనుచు నిచ్చటికిఁగూడ వచ్చిపడితివా ? నేఁడు నీతలగూడఁ బగులఁగొట్టుటకు నా కొకపని గలిగినదా ? సరే నిన్నెవ్వరు రక్షించె దరో చూచెదను.

హరిచరణుఁడు శ్యామలాలునితలపైకిఁ గఱ్ఱనెత్తెను. తక్షణమే విధుముఖి యిరుప్రునకుమధ్యను వచ్చి యిట్లనెను—" నన్నుఁ జంపు

ము. ఆయన నేల చంపెదవు? ఆయన నిరపరాధి.

హరి—చావఁగలవు—నేఁను నీవును జావఁగలవు. కాని ముందుగా నీదుర్భాగ్యుని ప్రాణములు తీయవలయును.

శ్యామలాలు వేగముగా హరిచరణుని సమీపించి యాతనిచేతిలోనికత్తి నూడలాగికొని యిట్లనియెను—“నేను దలఁచుకొనినచో నిప్పుడే నీతలపగులఁగొట్టఁగలను. కాని యట్లు చేయను. నేను జాల పాపములు చేసియుంటిని. ఇఁకఁ బాపము చేయఁజాలను. నరహత్య చేయుటకు నామన సొప్పుటలేదు. నీకంటె నేను జాలబలశాలినై యున్నాను. విశేషించి నీ విప్పుడు త్రాగి జోగుచుంటివి. నిన్నిప్పుడు చంపివేయుట నా కంతకష్టమైన పనిగాదు. కాని నే నట్లుచేయను. ఏమన? అది నాయుద్దేశము కాదు. నీ విక్కడనే యిప్పుడు బద్ధుఁడవై యుండుము. విధుముఖియు నేను నిన్నిప్పు డిక్కడ బంధించి వెడలిపోవుదుము. శారదకును నీగతియే సంభవింపవలసియున్నది, కాని యది నన్నిక్కడకుఁ దెచ్చుట కుపాయముచేసినది గనుక దానిని నేను క్షమించితిని.”

శ్యామలాలు తత్క్షణమే హరిచరణుని నేలపైఁ బడఁద్రోసి యాతనివస్త్రముతోడనే యాతనికాలుసేతులు బంధించెను. శక్తిహీనుఁడైన హరిచరణుఁ డప్పు డవశుఁడై చీత్కారముచేయఁజొచ్చెను. శ్యామలాలాకేకలను వినిపించుకొనకయే యాతనిని గదిలోనికిఁ ద్రోసివేసి విధుముఖచేయి పట్టుకొని యీవలికి వచ్చి తలుపులకుఁదాళము వైచెను. శారద యచ్చటనే వీరికొఱకు నిరీక్షించుచుండెను. ఆమువ్వురు నాగభీరరాత్రియందు దాగాంధకారములో నదృశ్యులైరి.

# ఆఱవ ప్రకరణము.



## సం సా ౩.

సోనాపురమునందలి రాధావినోదబాబు విశాలమందిరము చాల సందడిగా నుండెను. ఎన్నియో దినములనుండి యావిశాలభవనము పాడువడి, జనశూన్యమై, శోభారహితమై యుండెను. ఇప్పు డాసౌధ మంతయు జనసమూహముతో నిండియుండెను. ఐశ్వర్యచిహ్నము లంతటను బొడకట్టుచుండెను. ద్వారపాలకులు సముచితవస్త్రధారులై యస్త్రశస్త్రముల ధరించి ద్వారములు కాచుకొనియుండిరి. అశ్వశాల లనేకవిధములగు నశ్వములతో నిండి యలంకరింపఁబడియుండెను. వేఱొకచోట మదపుటేనుఁగులు తుండము లూఁపికొనుచు నిలిచి యుండెను. మఱియొకచోట ననేకవిధములగు గుఱ్ఱపుబండ్లు నిలుపఁబడియుండెను. సింహద్వారసమీపమునందు నాలుగుగుఱ్ఱములు పూర్వము పూన్పఁబడిన సుందరశకట మొకటి వేచియుండెను. జరిఫ్కోచిమాఱ్ సముచితవేషభూషాలంకృతుఁడై కళ్లెపువాగె చేతఁబట్టుకొని యానందమయమైన హృదయముతో కోచిపెట్టెపైఁ గూరుచుండి యుండెను.

భవనములోని యుత్సాహమునకు మేరయే లేదు. సేవకీసేవకు లెడతెఱపిలేకుండఁ బనులుచేయుచుండిరి. ఒకచోట గుట్టలుగుట్టలుగాఁ గూరలు పడియుండెను. కొందఱు కత్తిపీటలు ముందర వేసికొని కూరలు తరుగుచుండిరి. మఱికొందఱు బిందెలతో వంటసాలలోనికి మంచితీర్థమును మోయుచుండిరి, ఇంకఁ గొందఱు సన్నికంటితాళ్లతో మేఘగర్జనము లొనరించుచు “మసాలా” కారములు నూఱు.

చుండిరి. నలుగురైదుగురు వంటబ్రాహ్మణులు పెద్దపెద్దగుండిగల లోఁ బెద్దపెద్దగరిటెలను జప్పుడులుసేయుచు వంటసాలను మాఱు మ్రోఁగించుచుండిరి. ఈవిధముగా నాయాస్థలములయం దాయాపరి చారకులు, నాయాయుద్యోగులు నతివ్యస్తులు నత్యుత్సాహులునై పనులుచేయుచుండిరి.

కచ్చేరిచావడిలో నొకచోట నొకపండినశిరోజములు గలవృద్ధుఁడు కూరుచుండి తంబాకును సేవించుచు నాకాలపుగీర్వాణవృత్తాంతములనుగూర్చి యాలోచనచేయుచుండెను. ఇంకొకచోట నొకయధ్యాపకుఁడు కూరుచుండి—శాస్త్రపురాణాదులయం దొకయక్షరమైనను మిథ్యగాదనియు, వానిలో నెచ్చట నేకల్పనయుఁ జేరలేదనియు, నవి యన్నియు సాక్షాత్తు వేదోక్తములనియు దృష్టాంతములు చేయుచుండెను. అనేకస్త్రీపురుషు లక్కడ నున్నచోట నుండకుండ మహాసంరంభముతోఁ దిరుగుచుండిరి. ఒకచోటఁ గొందఱు యువకులు గూరుచుండి భారతదేశోద్ధరణమునుగూర్చిన తమతమ యుద్దేశములును వెల్లడించుకొనుచుండిరి. వేయేల? ఈవిధముగా నానాస్థానములయందు నానావిధవ్యాపారములు జరుగుచుండెను.

హరకుమారబాబు సపరివారముగా సార్వభౌమమహాశయుని వెంటఁబెట్టుకొని కొన్నాళ్లక్రిందటఁ గాశినుండి యిక్కడకు వెడలివచ్చెను. వచ్చి యాతఁడు రాజమందిరము మొదలగుభవనము లన్నియు నలంకరింపించి యుంచెను. ఈభవనములకు నీసకలైశ్వర్యమునకు నధికారి నేఁ డక్కడకు విచ్చేయఁగలఁడు. ఆయన నెదుర్కొనునిమిత్తము హరకుమారునియాహ్వానము ననుసరించి చుట్టుపట్టులనున్న గొప్పవారుఁ గొలఁదివారు నందఱు నిచ్చట సమావేశము నందిరి. సమాగతు లందఱకు భోజనాదిసదుపాయములు సమకూర్పఁబడియెను.

హరికుమారబాబునకు నేఁ డించుకయైనఁ దీఱుబాటులేకుండెను. అక్కడకు వచ్చినవా రందఱికడకును బోయి వారివారి యోగక్షేమములను దెలిసికొనుచుండెను. కొందఱితో నొకటి రెండుమాటలు గూడ మాటలాడుచుండెను. సనాతనపురమునుండి హరీశుఁడు, చండీతలమునుండి రామహరి కైవర్తుఁడును బరమానందముతో హరకుమారు నియాదేశము ననుసరించి యిచ్చటకు వచ్చియుండిరి. వారివారి వేషభూషలు వారివారియాధిక్యములను వారివారియాంతరికసంతోషములను దెలియఁజేయుచుండెను. అనేకోద్యోగు లనేకకార్యములకొఱకు నలుదిక్కులఁ దిరుగుచు నడుమనడుమ హరకుమారుకడ కరుదెంచి చేసినపనులనుగూర్చి చెప్పుచుఁ, జేయవలసినకార్యములనుగూర్చి తెలిసికొని పోవుచుండిరి.

చండీచరణుఁడు కచేరీచావడియందలి యొకవరండాలో నిలుచుండి చేతులను దలయు నాడించుచు రామహరి కొకభయంకరమైన కథను జెప్పుచుండెను. ఆతఁడు పరిశుభ్రములగు వస్త్రములను ధరించుకొనియెను. విలువఁగల బంగారువాచీగొలుసు నలంకరించుకొనియెను. మంచిరంగువేసిన పాదరక్షలను దొడిగికొనియెను. మంచిపనితనము గలిగి సుగంధధూమమును వెడలించు మస్లిపందరమగుహుక్కా యాతనియెడమచేత నుండెను.

చండి—శీఘ్రముగా నీప్రపంచమునకుఁ బ్రళయము గాఁగలదు. అందుకు సందేహములేదు. కలియుగములో సకలము విపరీతము లగుననియు, భూమి తలక్రిందు గాఁగల దనియు శాస్త్రములయందు స్పష్టముగాఁ జెప్పఁబడినది. ఇప్పటియీలక్షణములనుబట్టి చూడఁగా నదికిం కెంతయో వ్యవధాన మున్నట్లు తోఁచదు.

రామ—అయ్యా! ఏలక్షణములనుబట్టి మీరిట్లు నిర్ధారణము చేయుచున్నారు?

చండి—నిర్ధారణము చేయ కేమి? కనఁబడుటలేదా? దేవదేవుఁడైన మహాదేవుఁడు గంజాయి, నల్లమందు, మద్యము, సుర మొదలగు మత్తుపదార్థము లన్నియు సేవించియే సిద్ధపురుషుఁ డయ్యెను. బ్రహ్మయు నల్లమందు సుర సేవించినట్లు వేదమునందుఁ బ్రమాణములు గలవు. మఱియు నాతనిసృష్టియందంతటను—గుమ్మడితీగఫలములను ఱటవృక్షమువండ్లను జూచినచో నాతనిసూక్ష్మబుద్ధి తెలియవచ్చుచున్నందువలన నాతఁడు గులీభోరని స్పష్టముగాఁ దెలియవచ్చుచున్నది. మఱియు విష్ణుదేవుఁడును మత్తు సేవించె ననుసంగతి యనేకపురాణములలో వ్రాయఁబడియున్నది. అందుకు సాక్షి యాతనియవతారములే చూపుఁడు. ఒకమాఱు చేప, ఒకమాఱు తాఁబేలు, ఒకమాఱు పంది, ఒకమాఱు సింహమునై యాతఁడు భూమండలమును రక్షించెను. ఆతఁ డిచ్ఛామయుఁడు స్వయముగా నింతకష్టము పొందకుండఁగనే యిచ్ఛామాత్రమున నన్నియుఁ జేయరాదా యని లోకు లందరు. అట్లయిన నిట్లు చేయుట యెందులకు? ఇవి యన్నియుఁ దెలియనిమాటలు. అట్లయిన మత్తువస్తువులమహిమ వెల్లడి యెట్లగును? భగవంతుఁ డైనవాఁ డద్భుతకార్యములు చేసి మత్తువస్తువులమాహాత్మ్యమును బ్రచారముచేయకపోయినచో నీమహాత్కార్యమును జేయువారెవ్వరు? ఇంద్రుఁడుఁ, జంద్రుఁడు, వాయువు, వరుణుఁడు, యముఁడుఁ, గుబేరుఁడు, నీలుఁడు, గయుఁడు, గవాక్షుఁడు, హనుమంతుఁడు, మర్కటుఁడు, నందఱుదేవతలును సదా గంజాయి సుర మొదలగునవి సేవించుటయు, నిప్పుడును స్వర్గములో మూలమూలలఁ జుట్టలును గంజాయియుఁ గాల్చుచుండుటయు నేను నీకుఁ జూపింపఁగలను. ఆమేను

రాను లేమియో చెప్పుమాతము? ఏగంజాయి దేవుఁడో గంజాయిగొట్టముపుండి విడుచుచున్నధూమమే గాని యింకేమియుఁ గాదు. ఈసా మగ్రిలన్నియు భూతలమునుండి స్వర్గమునకుఁ బోవుచున్నవి. ఇక్కడఁ బుట్టి యక్కడకుఁ బోవుటలేదా? అవశ్యముగాఁ బోవలసినదే.

రామ—అట్లయిన నీభూలోకములోనిగురిభోగులవలననే సృష్టి నిల్పఁబడుచున్నదా?

చండి—ఆహా! అవును. కాని కాకఁ బుచ్చుకొనుట కిప్పుడేమియు లేదు. హరకుమారబా బింతబుద్ధిమంతుఁడు. ఆతఁడొక్కపీలుపైన నబీల్చుఁడు. ఉమాశంకరబా బింతపండితుఁడు, నిత్యస్నాని, ఎప్పుడు నేమియు సేవింపఁడు. ఘనానందస్వామి పరమసన్న్యాసి. అయినను మత్తువస్తువులను వర్జించెను. నిషా చేయనిదే సన్న్యాసి యగు నని యెప్పుడైన వినియున్నవా? కలికాలములో నిట్టియాశ్చర్యములు పుట్టుచున్నవి. నీవు నాకు జతగాఁడ వని యనుకొనుచున్నాను. తంబాకు సేవింతము రమ్ము.

రామ—నీవు తంబాకు సేవించుచుండుము. నా కొకపని గలదు. పోయి యిప్పుడే వచ్చెదను. నీ వొక్కఁడవే పదిమందిపెట్టు.

చండి—ఒకమాట విని వెళ్లుము. ఆమాట చెప్పుటకు నాకెంతయు విచార మగుచున్నది. సంగదోషముచే మనుష్యుఁడు నాశము నొందుచున్నాఁ డని నాలుగువేదములు నాఱుశాస్త్రములు ఘోషించుచున్నవి. నేను మిక్కిలి దుస్సహవాసములోఁ బడిపోయితిని. ఇప్పుడు ఘోరకలిపరితాపముచేతను దుస్సంసర్గదోషముచేతను మాటిమాటికి నన్నగారినిగూడ నామార్గమునకు దింపవలయు నని కోరిక పుట్టుచున్నది. ఆదుర్దశగూడఁ జివరకు ఘటిల్లునేమో! అన్నను విడిచిపెట్టనులేను—సహింపనులేను. ఆతఁడు దానశక్తుఁడు. ఆతఁ డన్నియు

నెఱుంగును. గంజాయిమహిమమాత్ర మెఱుఁగఁడు. కాని యీస్వల్పదోష మున్నంతమాత్రముచే నాతనిపైఁ గోపపడుట యన్యాయము. ఆతఁడు చెప్పినట్లు నేను నిషా మానినచోఁ బ్రపంచము మునిఁగిపోదు. అది యటులుంచుము. తరువాత నాసంగతి యాలోచింతము. ఇప్పు డొకసారి అన్నయొద్దకుఁ బోవుదము పద.

అంతఃపురములో సుహాసిని రామహరిభార్యయైన హరిదాసితో నొకగదిలోఁ బ్రవేశించి యక్కడ రత్నకంబళములను బఱపించెను. సుహాసినితల్లియు నత్తయు నింకొకచోట వెండిపళ్లెరములలో ఫలాహారములను సిద్ధముచేయుచుండిరి. హరిదాసి యిప్పుడు సువర్ణభూషణములతో శోభిల్లుచుండెను. ముందటివాకిటిలోఁ గొందఱు పుణ్యాంగనలు వివాహవేదిక నలంకరించుచుండిరి. అక్కడ వెండిచెంబులలో మామిడికొమ్మ లుంచఁబడి యుండెను. రామనగరమునుండి వచ్చిన భవసుందరి కొందఱు పరిచారికలతో సామానుకొట్టుదగ్గఱ నుండి, యెవ్వరి కేమి కావలయునో వారివారి కది యందించుచుండెను.

హరకుమారబాబు గడియారమునంకఁ జూచి యొకయుద్యోగిని బిలిచి రెండుశకటములను సిద్ధముచేయింపు మని చెప్పెను. తరువాత హరకుమారబాబు అధ్యాపకులననున్నసార్వభౌమమహాశయుని బిలిచెను. ఇంతలో నాయుద్యోగి వచ్చి బండ్లు సిద్ధముగా నున్న వని తెలియఁజేసెను. సార్వభౌమమహాశయునితో హరకుమారుఁ డశ్వశకటము నారోహించి బండిని నదీఘట్టమునకుఁ దోలుకొనిపొమ్మని కోచిమానున కాజ్ఞాపించెను. బండి బయలుదేఱెను. దానితో జరిపు గ్రోలుచున్న నాల్గుగుఱ్ఱములబండియు నింకొకబండియుఁగూడ బయలుదేఱెను.

మరల నొకగంటకాల మగునప్పటి కాగుఱ్ఱపుబండ్లొకట

తో నిండి భవనసింహద్వారమువద్దకుఁ దిగి వచ్చి నిలిచెను. బండి నిలుచునంతలోనే హరికుమారునియాజ్ఞానుసారముగా నొక్కమారే యనేకశతఘ్నులు ప్రేలెను. ఆవెంటనే యనేకమంగళవాద్యములు మ్రోగఁజొచ్చెను. తత్క్షణమే యంతఃపురములోనుండి శతాధికపుణ్యాంగనల కంఠస్వరములతో మంగళగీతములు బయలువెడలి దిఙ్మండలమును బ్రకంపితముఁజేసెను. వానితో గురుగంభీరశంఖధ్వనులు చెలరేఁగెను. బండి నిలుచునంతలో హరికుమారుఁడు గుభాలున బండి దిగి నాల్గుగుఱ్ఱములబండిని సమీపించి పరమసమాదరముతో నొకభువనమోహనుఁడైన పెండ్లికుమారుని, ఒకభువనమోహినియైన పెండ్లికుమార్తెను జేతులు పట్టుకొని బండినుండి దింపెను. సముచితమంగళాచరణములతో వధూవరు లంతఃపురములోనికిఁ దేఁబడిరి. హరికుమారుఁడు, సార్వభౌముఁడు, నవీనకృష్ణుఁడు మొదలగు ముఖ్యు లంతఃపురజనులకుఁగూడ నచ్చిరి. వధూవరులను మంగళాలంకృతులను గావించుటకు యథాస్థానమునకుఁ గొనిపోయిరి. వధూవరులు నిర్దిష్టస్థానములయందు నిలిచి యుండఁగా సుహాసిని వధూవరుల నలంకరించుటకు ముందుకు వచ్చి, యనేకమంగళాచారములను గావించి దంపతులను గృహములోనికిఁ గొంపోవుట కుద్యమించెను. ఆసమయములో నాకస్మికముగా దశదిశలను బ్రకాశింపఁజేయుచుఁ బరమశోభామయియు, విచిత్రవసనభూషణధారిణియు నైన దేవీమూర్తి యెట్లో యాకాశమునుండి యవతరించి నవ్వుచు వధూవరులను సమీపించి నిలిచెను. సమీపమునందున్నవా రందఱు నాయలౌకికశోభాసంపన్నమైన దేవిని దర్శించి విస్మయావిష్టులైపోయిరి. పెండ్లికుమారుఁడు తత్క్షణమే యాదేవిచరణకమలములకుఁ బ్రణామము గావించి యానందగద్గదస్వరముతో నిట్లు పలికెను— “అమ్మా! ఈనైహికైశ్వర్యకల్పి

పపూర్ణమైన సంసారమునందు నిన్నుఁ జూడఁగంటిని. ఇది నాకుఁ బర మసౌభాగ్యముగదా! నీకృప గలిగినచో నే నీవిషమపరీక్షనుండి నిశ్చయముగా నుత్తీర్ణుఁడను గాఁజాలుదును. అమ్మా! యోగేశ్వరి! ఈ నీచిన్నకుమారుఁ డెప్పుడును నీకృపకు దూరుఁడు గాకుండుఁగాక!

యోగే— బాబా! ఉమాశంకరా! ఈలోకములో బిడ్డ తల్లిని విడిచినకథ లనేకములు వినియున్నాము. కాని తల్లి బిడ్డను విడిచిపెట్టిన వృత్తాంత మెప్పుడైన నెవరైన విని యున్నారా? నీమనోరథములన్నియు సిద్ధించుఁగాక యని యాశీర్వదించుచున్నాను.

ఇంతలోఁ బెండ్లికొమార్తె మెల్లమెల్లఁగా వచ్చి యాదేవిచరణకమలములను బట్టుకొని యస్ఫుటస్వరముతో—“తమబిడ్డలను దాము సకలవిధముల నాదరించుకొనఁగలరు గాని యితరులబిడ్డలనుమాత్ర మాదరింపఁజాలరు. అమ్మా! నీకు నామీఁద నించుకంతైన దయ లేదు. ఎన్నియో దినములకు మరల నాయదృష్టవశమున నిన్నిప్పుడు చూడఁగంటిని.” అనియెను.

అప్పుడు యోగేశ్వరి స్నేహపూర్వకముగాఁ గన్య నొడిలోఁ జేర్చికొని—“అన్నపూర్ణా! నీమీఁది నాకెంతో ప్రేమ—నీవు నాప్రియపుత్త్రినిఁ బెండ్లికూఁతురవు. అమ్మా! అన్నపూర్ణా! నీ కాశీర్వాదము చేయుచున్నాను. అన్నపూర్ణాదేవివలె నీ వుమాశంకరున కనుగామిని వగుదువుగాక!” అనియెను.

సుహాసిని యుమాశంకరునిఁ జూచి—“అన్నా! యీదేవి యెవ్వరు?” అనియెను.

ఉమాశంకరుఁ డుచ్చైస్స్వరముతో“ఈమెయే మనయమ్మ యోగేశ్వరి.” అనెను.

అప్పు డచ్చటివా రందఱు భక్తియుక్తులై యాదేవికి సాష్టాంగ దండప్రణామములు గావింపఁజొచ్చిరి. అప్పుడు యోగేశ్వరీదేవి సుహా సినిహస్తమును బట్టుకొని—"అమ్మా! నీవు నాబిడ్డవు—చాల మంచి బిడ్డవు. నీకు సకలశుభములుఁ జేకూరుఁగాక యని యాశీర్వదించుచు న్నాను." అనియెను.

హరకుమారబా బప్పు డక్కడ కేఁగుదెంచి యోగేశ్వరీదేవిని సమీపించి—"ఈసమయమున నం దిక్కడ మీదర్శనము లభించుట మాకుఁ బరమసౌభాగ్యము. నేను మీకు నమస్కరించుచున్నాను." అనియెను.

యోగే—నాకొడుకు, నాకోడలు, నామూఁతురు, నాయల్లుఁ డు—నాసంసారము. నేను రాకున్న నిఁకెవ్వరువత్తురు? నీవు వియ్యం కుఁడవు. ఎంతసిగ్గు! వియ్యంకునితో నిన్నిమాటలా? కాని వియ్యం కుఁడా! నీవే యథార్థసాధుమూర్తివి. నీవే పరిశుద్ధాత్ముఁడవు. సంసారి వయ్యును నిజముగా నీవు సన్న్యాసివి. నే నెవ్వరిచరణదాసినో యాపర మేశ్వరుఁడు—ఘనానందరూపి యగు యోగానందుఁడు నీకు సహా యుఁడు. ఇఁక నేఁ జెప్పవలసిన దేమున్నది! నేను వియ్యంకునితో నిన్నిమాటలు చెప్పఁజాలకున్నాను. నాకు సిగ్గగుచున్నది. నా కెన్ని యోపను లున్నవి. కొడుకును గోడలిని దీసికొని యిఁక నే నింటిలోని కేఁగెదను.

శంఖధ్వనులతోడను, మంగళవాద్యధ్వనులతోడను, బురంధ్రీమ ణుల శోభనగీతధ్వనులతోడను దిఙ్మండలము ప్రకంపితము గాఁజొ చ్చెను. అప్పుడు యోగేశ్వరీదేవి వధూవరులను వెంటఁబెట్టుకొని న వ్వుచు నవ్వుచు గృహాభ్యంతరముఁ బ్రవేశించెను.

సంపూర్ణము.

210 స్త్రీల వ్రతకథలు.

(బాలాంత్రపు వేంకటరావుచే రచింపఁబడినవి.)

ఇవి బాలికలకును స్త్రీలకందఱకును అత్యంతోపయుక్తములుగ నుండునట్లు రచింపఁబడినవి. ఆంధ్రులలో నోములు పట్టని స్త్రీలుండరు. పూర్వమువలెకథలు వచ్చిన పెద్దముత్తయిదువులు లేని యీయుగమునదియవశ్యకతాద్దిని, స్త్రీలలో విద్యవ్యాపించుచున్న యిప్పుడు స్త్రీలందఱును సులభముగఁ జదువుకొని యీనోములుపట్టుటకై సులభశైలిని రచింపఁబడినవి. ఎంతకాలముక్రిందటనో 1-2 కూర్పులు చెల్లిపోయినవి. మరల మూఁడవకూర్పు ముద్రించినాము.

ఇవి రెండుభాగములు. భాగమునకు 32 నోములు (ఉద్యాపనములసహా) చొప్పున రెండుభాగములలోను 64 నోములు కలవు. వెల భాగము 1 కి 0—6—0 పోస్టేజి కొనువారే భరింపవలెను. 1—2 భాగములు వెలకు సిద్ధముగ నున్నవి.

## ప్రకటనము.

నాచే రచింపఁబడిన ఈస్త్రీలవ్రతకథలు 1-2 భాగములకు 1914 సంవత్సరము రిజిష్ట్రు కాపీరైటు ఆక్టుప్రకారము నేను సంపూర్ణపుకాపీరైటు కలిగియున్నాను. ఈపుస్తకములను నా యనుమతి పొందకుండా నాకు తెలియకుండా కొందఱు ముద్రించియున్నారు. తరువాత నాకుఁ దెలిసినవారిపై క్రిమినల్ సివిల్ చర్యలుతీసికొన్నాను. కాబట్టి యీనోముల పుస్తకములను నాలిఖిత రూపమైన అనుమతి పొందకుండా గ్రంథమంతయునుగాని, అందులోని భాగములనుగాని, ఎవ్వరును ముద్రింపఁగూడదని యిందుమూలముగాఁ దెలియచేయడమైనది. దీని నతిక్రమించి నడచువారిపై కాపీరైటు ఆక్టుప్రకారము చర్యజరిపి నాకు గలుగు యావత్తు నష్టములు రాఁబట్టుకొనడముగును.

ది 22-12-1926,
పిఠాపురము,
తూర్పుగోదావరిజిల్లా

బాలాంత్రపు వేంకటరావు,
గ్రంథకర్త అండ్ ప్రకాశకుఁడు,
పిఠాపురము.

211

# ఆంధ్ర ప్రచారిణీ గ్రంథనిలయము,

(1911 వ సంవత్సరములో స్థాపింపఁబడినది.)

## పిఠాపురము.

నవలలు—నవరసభరితములగు నవలలు—పుణ్యచరిత్రములు 200—250 పుటలకు మించకుండ—రెండుమాసముల కొక్కటిగా వెలువడును.

చందాదారుల సౌకర్యమునకై నవలల వెలలు చౌకచేసి పోస్టేజి మేమేభరించి పూర్వపునిబంధన లీక్రిందివిధముగా మార్చినాము.

—♦ నిబంధనలు. ♦—

1. ఇందుఁ జందాదారుగఁ జేరువారు ప్రవేశరుసుముక్రింద ముందుగా 0—4—0 చెల్లింపవలయును.

2. ఇందు రెండేసిమాసములకొక్కటిగ వెలువడుచుండు మంచి రేపరుబైండుగల ప్రతిగ్రంథమును పోస్టేజి మనిఆర్డరు కమీషన్‌లు మేమే భరించి రు 1-0-0 కిమాత్రమే చందాదారులకుఁ బంపుచుందుము.

3. చందాదారు అగువారు వెనుకటిగ్రంథములన్నియుఁ గొనవలయునను నియమములేదు. కాని, వారు కోరినచో వెనుకటిపుస్తకములుకూడఁ జందాదారుల వెలలకే పంపుచుందుము. క్రొత్తగ వెలువడుచుండు గ్రంథములు మాత్రము చందాదారులు తప్పక పుచ్చుకొనుచుండవలెను.

4. ఇందుఁ బ్రకటింపఁబడు ననుబంధములు చందాదారులు తప్పక పుచ్చుకొనవలయునను నియమములేదు. కోరినవారికే పంపుచుందుము.

5. సంవత్సరముచందా అనఁగా ముందు ప్రకటింపఁబడు ఆఱుపుస్తకములకు రు 5—4—0 లు ముందుగఁ బంపువారికి ఆఱుపుస్తకములవఱకు ప్రతిపుస్తకమును అన్‌రిజిష్టర్డుపార్సిలుగా బంపుచుందుము.

N. B —నైజామిలాకా చందాదారులకు మా ఏజంటు మహారాజశ్రీ నామపల్లి గౌరీశంకరవర్మగారు నెం 566 రెసిడెన్సీబజారు, హైదరాబాదు. వీరియొద్ద మా పుస్తకములు దొరకును.

212

# ఇంతకుఁ బ్రకటింపఁబడి వెలకు సిద్ధముగ నున్న గ్రంథములు.

| | చందాదారులకుఁ బోస్టేజిలో వెల. | ఇతరులకుఁ బోస్టేజి కాక వెల. |
|---|---|---|
| 1. దుర్గేశనందిని | రు 1-0-0 | రు 1-8-0 |
| 2. సీతారామ | 1-0-0 | 1-8-0 |
| 3. నూర్జహాను | 1-0-0 | 1-8-0 |
| ✓ 4. మనోరమ | 1-0-0 | 1-8-0 |
| ✓ 5. వీరపూజ | 1-0-0 | 1-8-0 |
| ✓ 6. మాయావి | 1-0-0 | 1-8-0 |
| 7. జీవన్మృతరహస్యము | 1-0-0 | 1-8-0 |
| ✓ 8. రహస్యవిప్లవము | 1-0-0 | 1-8-0 |
| ✓ 9. గోరా ౧ | 1-0-0 | 1-8-0 |
| ✓ 10. గోరా ౨ | 1-0-0 | 1-8-0 |
| ✓ 11. జయాపజయములు | 1-0-0 | 1-8-0 |
| ✓ 12. శ్రీకృష్ణచరిత్రము ౧ | 1-0-0 | 1-8-0 |
| ✓ 13. శ్రీకృష్ణచరిత్రము ౨ | 1-0-0 | 1-8-0 |
| 14. విషవృక్షము | 1-0-0 | 1-8-0 |
| ✓ 15. విశ్వప్రయత్నము | 1-0-0 | 1-8-0 |
| ✓ 16. భారతీభాస్కరము | 1-0-0 | 1-8-0 |
| ✓ 17. నరేంద్రగుప్తుఁడు ౨ | 1-0-0 | 1-8-0 |
| 18. మృణాలిని | 1-0-0 | 1-8-0 |
| ✓ 19. భూతగృహము (మొదటిభాగము) | 1-0-0 | 1-8-0 |
| ✓ 20. డిటో (రెండవభాగము) | 1-0-0 | 1-8-0 |
| ✓ 21. కుమారార్పణము | 1-0-0 | 1-8-0 |
| 22. మాధవీలత | 1-0-0 | 1-8-0 |
| ✓ 23. మరకతమంజూష | 1-0-0 | 1-8-0 |
| ✓ 24. రామాశ్రమము | 1-0-0 | 1-8-0 |

| | | |
|---|---|---|
| 25. ప్రమదావనము | 1-0-0 | 1-8-0 |
| 26. రహస్యగోపనము | 1-0-0 | 1-8-0 |
| 27. లలితచంద్రహాసము | 1-0-0 | 1-8-0 |
| 28. శ్యామల | 1-0-0 | 1-8-0 |
| 29. ప్రతిజ్ఞాపాలనము | 1-0-0 | 1-8-0 |
| 30. యోగేశ్వరి ౧ | 1-0-0 | 1-8-0 |
| 31. యోగేశ్వరి ౨ | 1-0-0 | 1-8-0 |

—◆ అనుబంధములు. ◆—

| | | |
|---|---|---|
| 32. రాధారాణి | 0-4-0 | 0-6-0 |
| 33. సాధన | 0-10-0 | 0-12-0 |
| 34. పరిమళ | 0-10-0 | 0-12-0 |
| 35. నీరద | 0-10-0 | 0-12-0 |
| 36. ఆరణ్యక | 0-10-0 | 0-12-0 |
| 37. మాయావిని | 0- 8 -0 | 0-12-0 |
| 38. రజని | 0-10-0 | 0-12-0 |
| 39. భారతవీరుఁడు | 0-10-0 | 0-12-0 |
| 40. నీతిముక్తావళి ౧ | 0- 4-0 | 0- 6-0 |
| 41. నీతికథాముక్తావళి ౨ | 0- 6-0 | 0- 8-0 |
| 42. శకుంతల | 0-10-0 | 0-12-0 |
| 43. అశోకుఁడు | 0-10-0 | 1- 0-0 |
| 44. వీరమహిమ | 0- 8-0 | 0-10-0 |
| 45. ఏకాంతసేవ | 0- 6- 0 | 0- 8-0 |
| 46. సీతావనవాసము | 0-10-0 | 0-12-0 |
| 47. హారావళి ౨ | 0- 3-0 | 0- 4-0 |
| 48. జాతీయగీతము | 0- 1-0 | 0- 1-0 |

| | | |
|---|---|---|
| 49. సంజీవనము | 0-2 -0 | 0- 2- 6 |
| 50. బాలవిజ్ఞానమంజరి ౧ | 0-2 -0 | 0- 3- 0 |
| 51. డిటో ౨ | 0-3 -0 | 0- 4 -0 |
| 52. డిటో 3 | 0-4 -0 | 0- 6 -0 |
| 53. ప్రభావతి | 0-1 -0 | 0- 1 -0 |
| 54. శ్రీరామరాజనీతి | 0-3 -0 | 0- 4 -0 |
| 55. పీఠికాపురసంస్థానము | 0- 1 -0 | 0- 1 -0 |
| 56. వీరపత్ని | 0- 1 -0 | 0- 1 -0 |
| 57. విజయదశమి | 0- 1 -0 | 0- 1 -0 |
| 58. సుశీల | 0- 1- 0 | 0- 1 -0 |
| 59. ట్రోజనుయుద్ధము | 0- 4- 0 | 0- 6 -0 |
| 60. అహల్యాబాయి | 0- 8 -0 | 0- 10 -0 |
| 61. భ్రాంతివిలాసము | 0- 10-0 | 0- 12 -0 |
| 62. విదురుడు | 0- 10-0 | 0- 12 -0 |
| 63. లక్షరూపాయలు | 0- 10-0 | 0- 12 -0 |
| 64. భారతమహిళ | 0- 10-0 | 0- 12 -0 |

☞ షరా:—ఒకరూపాయి వెలకు తక్కువ ఆర్డరు వి. పి. గాపంపబడదు.

మేనేజరు,

ఆంధ్రప్రచారిణీగ్రంథనిలయము.

పిఠాపురము, (తూర్పు) గోదావరిజిల్లా.

వి. యస్. ఆర్. ప్రెస్, పిఠాపురము, 1927.



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA117B185 |
| పుస్తకం పేరు | యోగేశ్వరి 02 |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 219 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | 155,156 |
| తయారు చేసినది | Sowmya |
| పేజీలు విడదీసినది | Sowmya |
| స్కాన్ చేసినది | Raksana |
| పరీక్ష చేసినది | Susmitha |
| పేజీలు సరిచూసినది | S pragathi |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |